Kolla Hanumantha Rao.
B.A (Hons) Cl
A U Colleges, Waltair

C

# కవిత్రయము

శ్రీ నండూరి రామకృష్ణమాచార్య

# కవిత్రయము

రచయిత
శ్రీ సందూరి రామకృష్ణమాచార్య ఎం. ఏ.,
ప్రభుత్వకళాశాల: అనంతపురం.

ప్రచురణ
విజ్ఞానప్రభాస
c/o ఉదయని ప్రెస్: భీమవరము: పశ్చిమగోదావరి.

# అవతారిక



చెన్నపురి విశ్వకళాపరిషత్తులో సాహిత్యపరిశోధకునిగ 1913 నుండి 1915 సంవత్సరమువరకు ఉపకారవేతనముతో "తిక్కనమహాయుగము" అను శీర్షికపై పరిశ్రమ చేయు నవకాశమేర్పడినది. తదుపరి నన్నయ - ఎఱ్ఱనల చేర్పుట - పర్యవసానము ఈ కవిత్రయము.

1955 జూన్ 26 వ తేదీన హైదరాబాదు నగరమున, రాష్ట్రపతి పూజ్యశ్రీ డాక్టరు రాజేంద్రప్రసాదుగారి హస్తమునుండి "తెలుగు భాషాసమితివారి బహుమతిని" ఈ గ్రంథము నోచుకొనినది.

తొలి ముద్రణము వెలువరించిన గుప్తదానప్రవీణులు
నరసాపురకళాశాలాసంఘకార్యదర్శి
శ్రీ యెఱ్ఱమిల్లి నారాయణమూర్తి పంతులుగారికి.
పాఠ్యగ్రంథముగా నిర్ణయించిన విశ్వకళాపరిషన్నేతలకు,
ప్రథమముద్రణ నాదరించిన ఆంధ్రసహృదయలోకమునకు
నమస్కృతులు.

నండూరి రామకృష్ణమాచార్య.

కృతిసమర్పణము

గురుదేవులు

పూజ్యశ్రీ

## పింగళి లక్ష్మీకాంతంగారికి



ద్వితీయముద్రణము 1958

వెల రు. 2-50

ప్రతులకు

విజ్ఞాన ప్రభాస

c/o ఉదయనిప్రెస్: భీమవరము: పశ్చిమగోదావరి.

# కవిత్రయము

## నన్నయ

నన్నయభట్టుమహాకవి ఆంధ్రసారస్వతప్రపంచమున వెలసిన తొలికావ్యము మహాభారతము నారంభించిన ఆదికవి. ఆదిసభాపర్వములను నారణ్యపర్వమునఁ జతుర్థాశ్వాసమునఁ గొంత వరకు నన్నయ రచించెను. మిగిలిన పదునైదు పర్వములు తిక్కన యారణ్యపర్వశేషమును ఎఱ్ఱాప్రగ్గడ రచించిరి. కవిత్రయ మని పేరొందిన నన్నయ తిక్కన ఎఱ్ఱన మహాకవు లాంధ్రవాఙ్మయ జగత్తులోఁ బ్రాతఃస్మరణీయపాదులైన సాహిత్య త్రిమూర్తులు.

నన్నయభట్టు రాజరాజనరేంద్రుని యాస్థానకవి. రాజరాజనరేంద్రుఁడు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దిమధ్యమునఁ దెలుఁగు దేశము నేలిన చాళుక్యసమ్రాట్టు. చాళుక్యులు తొలుత "వేగి", తరువాత రాజమహేంద్రవరమును రాజధానిగఁ జేసికొని తెలుఁగు నాడు నేలినారు. ఆ కాలమున 'వేఁగివిషయము' 'ఆంధ్రదేశము' చాళుక్యరాజ్యము నించుమించుగ నేకార్థద్యోతకము లైనవి.

"మును మార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికవిత బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

ఇది కుమారసంభవకావ్యపీఠికలో నన్నెచోడకవి ప్రవచనము. దేశికవితను దేశభాషను ప్రోత్సహించి యాంధ్రవిషయమునఁ దెనుఁగును నిలుపుటకు ప్రయత్నించిన వారు చాళుక్య చక్రవర్తులు. అంతకుఁబూర్వము తెలుఁగు భాష యెట్టి స్థితిలో నున్నది; అసలు తెనుగు భాష ఎప్పుడు పుట్టినది చెప్పుట కష్టము. కాని, తెనుఁగునకుఁ గావ్యగౌరవము సభామర్యాద రాజపూజ్యత తొలుత కల్పించిన మహారాజులు చాళుక్యులు. పూర్వకాలమునఁ జరిత్రలో సంస్కృతప్రాకృతములే రాజభాషలు. దేశభాషలు క్రమపరిణామవికాసబద్ధములై కాలక్రమమున వికసించినవి. దేశభాషలఁ దెనుఁగున కీ క్రమవికాసమునకు దోహదము కల్పించిన వారు చాళుక్యరాజులు.

ఆ కాలమున రాజాస్థానములందు విద్వత్పరిషత్తు లుండెడివి. కవులు రచించిన కావ్యముల విద్వత్పరిషత్తు లామోదించుట, ముద్రణసౌకర్యము లేని కాలమున రాజు గ్రంథములకు ప్రతులు వ్రాయించుట ఆ నాటి సారస్వతసంప్రదాయములు. తమిళదేశమున నిట్టి ప్రాచీనగ్రంథసముదాయమునకు "సంఘవాఙ్మయము"ని పేరు. ఇట్టి సారస్వతపరిషత్తులు తెలుఁగు దేశమున నా కాలమునఁగల వని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రవచించియున్నారు. నన్నయ మహాభారతపీఠికలో,

"పరమవివేకసౌరభవిభాసిత సద్గుణపుంజవారిజో
త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములైన సత్సభాం
తరసరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్."

అని సారస్వతపారిషదుల నభినందించినాడు. ప్రకరణాంతరమున మహాభారతప్రశస్తి నుగ్గడించుచు "ఉత్తమసభాసేవ్యంబ"ని వర్ణించినాఁడు. ఆస్థానవిద్వత్పరిషత్సముఖమున నన్నయమహాకవి రాజరాజనరేంద్రునకు మహాభారతము నుపపాదించియుండును.

చాళుక్యరాజుల సారస్వతకృషి రాజరాజనరేంద్రుని కాలమునఁ బరాకాష్ఠ చెందినది. నన్నయభట్టమహాకవి తెలుఁగున తొలి కావ్యమైన మహాభారతమును రచించుట కుపక్రమించెను. మహాభారతము తొలి కావ్యము, నన్నయ ఆదికవి యనినఁ దెనుఁగున నంతకుఁ బూర్వము కవితాసృష్టి గాని కవులు గాని లే రని చెప్పుట గాదు. నన్నయకుఁ బూర్వమే చాళుక్యరాజశిలాశాసనములందుఁ దెలుఁగు పద్యములు కన్పించుచున్నవి. యుద్ధమల్లుని బెజవాడ శాసనము పండరంగుని యద్దంకిశాసనము లుదాహరణములు. నన్నయ తరువాతి యుగమునఁ బాల్కురికి సోమన పదములు పాడుచుఁ దీర్థయాత్రలు సలుపు సామాన్యజనులను వర్ణించెను. దీనినిఁబట్టి నన్నయకుఁ బూర్వమే తెలుఁగున సారస్వతరచన లున్న వని తెలుఁగు కవులు కల రని చెప్పక తప్పదు. కాని, యా కవుల పేరులు గాని రచనలు గాని నేడు మన కుపలభ్యములు గావు. ఆ నాటి రచనలు నిబద్ధకావ్యములో కావో నిష్కర్షగఁ

జెప్ప లేము. నన్నయ తన్నుఁగూర్చి, "విపులశబ్దశాసనుఁడ"ని చెప్పుకొనెను. ఆ కాలమునఁ గల శబ్దజాలమును శాసించి విద్వదారాధ్యమైన సారస్వతసృష్టి సలిపిన తొలి కవి నన్నయ.

రాజరాజనరేంద్రుఁడు "నిజమహీప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ బరమండలంబుల ధరణిపతుల నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును బలిమి నీయని భూమివలయపతుల నుక్కడగించుచు దిక్కులఁ దన యాజ్ఞ వెలిగించిన" చక్రవర్తి. 'వేఁగీదేశంబునకు నాయకరత్నమైన రాజమహేంద్రవరమున రమ్యభర్మహర్మ్యతలంబున మంత్రిపురోహితసేనాపతిదండనాయకదౌవారిక మహాప్రధానానంతసామంతవిలాసినీపరివృతుండై, యపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును భారతరామాయణాద్యనేక పురాణేతిహాసచాతురీధురీణులైన పౌరాణికులును మృదుమధురరస భావభాసురనవార్థవచనరచనావిశారదులైన మహాకవులును వివిధ తర్కవిగాహితసమస్తశాస్త్రసాగరసారగరీయఃప్రతిభులైన తార్కికులును వైణికగాయకులును నాదిగాఁ గలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠి నొకనాడు.

తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతుఁడైన

నన్నపార్యు' మహాభారతముఁ దెనుఁగున విరచింపు మని యభ్యర్థించెను.

కృష్ణద్వైపాయనముని సంస్కృతమున మహాభారతమును రచించెను. "బహుభాషల బహువిధముల బహుజనములవలన" భారతవృత్తము బహుభంగుల వినిపించుచున్న దని రాజ రాజ నరేంద్రుఁడు నన్నయతోఁ బలుకును.

నన్నయకుఁ బూర్వమే కన్నడమున, మళయాళమునఁ, దమిళమున భారతములు గలవు. పంపకవి రచించిన కన్నడ మహాభారతము 'అరికేసరి' యను మహారాజున కంకితము. కవి, అరికేసరికి నర్జునునకు నభేదముఁ గల్పించెను. ద్రౌపది యర్జునునకు మాత్రమే భార్య. మూలవిశిష్టములైన స్వాతంత్రకల్ప నలతోఁ గన్నడభారతము యథామాతృకము గాదు. ప్రత్యేకముగ మహాభారతము తెలుఁగువారి సొత్తు. తెలుఁగు భారతమునకు వచ్చిన కీర్తి తక్కిన దేశభాషలలోని భారతములకు రాలేదు. తమిళ కంబరామాయణము, హిందీ తులసీదాసరామాయణము ప్రఖ్యాతములు. మళయాళమునఁగూడ 'ఎళుత్తచ్ఛన్' కవి వ్రాసిన రామాయణమున కున్న కీర్తి యతని భారతమునకు లేదు. తెనుఁగు భారతమే వ్యాసభారతమున కత్యంతసన్నిహితమై తుల్య ప్రాధాన్యము సంపాదించుకొన్నది. దీనికి కారణము భారత తత్త్వము నవగతము చేసికొనిన మహానుభావులగు నన్నయ తిక్కన మహాకవుల చేతిలోఁ దెలుఁగు భారతము పడుటయే. ఈ విషయమునఁ దెలుఁగు వారు మిక్కిలి యదృష్టవంతులు. రాజరాజనరేంద్రుఁడు నన్నయమహాకవిని "కృష్ణద్వైపాయన మునివృషభాభిహితమహాభారతబద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున విరచింపు మధికధీయుక్తి మెయిన్" అని వ్యాసప్రోక్తమహాభారత మునకుఁ దెనుఁగు రూపము కోరుకొనును.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతమ్ము.

అని నన్నయ వ్యాసమహాభారతమును బ్రశంసించెను. ఆ ప్రశంస తెలుఁగు భారతమునకుఁగూడ యథాక్షరముగ నన్వయించును.

మహాభారతము పంచమవేదము. విజ్ఞానసర్వస్వము. తెలుఁగు వారిని ధర్మవీరులుగ లోకోత్తరపురుషులుగ దిద్ది మహాసామ్రాజ్యమును నెలకొల్పుట రాజరాజనరేంద్రుని యభిమతము. మహాకవి నన్నయ భారతసంహితను వ్రాసి యీ ప్రబోధమునే తెలుఁగువారి కందిచ్చెను. తెలుఁగు దేశమున విజ్ఞానవికాసమునకు దోహదము కల్పించుట యేలికయైన రాజరాజనరేంద్రుని యుత్తమ కర్తవ్యము. బాధ్యత. విద్యాప్రబోధ మనిన నక్షరాస్యత యని

పూర్వికుల యభిప్రాయము గాదు. ఆ నాడు విశ్వవిజ్ఞానకోశమైన మహాభారతమును దెలుఁగున నిర్మించుటకంటె విద్యాప్రబోధ మే మున్నది? అందుచే విశ్వశ్రేయమును గాంక్షించి నన్నయభట్టు, "తెనుంగున మహాభారతసంహితారచనబంధురుఁ డయ్యె"ను.

ఆధ్యాత్మికప్రబోధమునకుఁ దత్త్వవిద్యోపదేశమునకు మహాభారతము మును ముందు పేర్కొన వలసిన గ్రంథము. ఉపనిషత్సారముగను బ్రహ్మవిద్యోపదేశముగను పేరొందిన శ్రీమద్భగవద్గీత మహాభారతములోనిదే. ఏనాడో కురుక్షేత్రమునఁ బరమపురుషుఁడు పూరించిన పాంచజన్యశంఖారావము గీతానాదముగఁ దరంగితమై నేటికిని భారతీయుల హృదయములలోఁ బ్రతిధ్వనించుచున్నది. జీవితసమరమున నరుఁడు విజయుఁడై కర్మవీరుఁ డగుటకు నింతకంటె సమృతసందేశ మే మున్నది? హృదయదౌర్బల్యము కర్తవ్యదర్శనము నణంచి నప్పుడు సర్వధర్మములను బరిత్యజించి గీతాపురుషుని శరణన్నచో విజయద్వారము వివృతము గాదా? భారతపుత్రులు నిర్వీర్యులై పోకుండ సదా కర్మవీరులుగ ధర్మశీలురుగ నీ గీతానాదమే పురికొల్పఁ గలదు. గీతామృతము భారతీయసంస్కృతి కజరామరమైన నిత్యయౌవనము నొసంగుచున్నది. జీవిత మొక కర్మక్షేత్రము. ఆత్మకు మరణము లేదు. ఆత్మను నీరు తడుప లేదు. నిప్పు కాల్ప లేదు. ఆత్మ సనాతనము. అనంతము — ద్వంద్వబద్ధమైన ప్రాణికోటి కెంతటి యాశాసందేశము!!

మహాభారతము బహుపురాణ సముచ్చయము. కురువంశముయొక్క యితిహాసము మహాపురాణమైనది. పురాణము

చరిత్రకంటె భిన్నము కావచ్చును. చారిత్రకసత్యము సర్వదా సాపేక్షికమైన సత్యము. ఏదో యొకచోట — నొక స్థలమున నొక కాలములో మాత్రమే యదార్థము. కాని పౌరాణికసత్యము దేశకాలపాత్రాతీతమై నిరవధికమై నిర్వికల్పమైన సత్యము. నిత్యనూతనము. సదా సనాతనము. అమృతమథనము వృత్రాసుర సంహారము నిట్టి సత్యములే. ఉపాఖ్యానములు అవాంతర గాథలు, గీతలు, మానవజీవితశిల్పములోని యనేకచిత్రములను సంతర్గర్భితముగ నర్థవాదరూపమునఁ బ్రదర్శించుటకొఱకే కల్పింపఁ బడినవి. ఇవి వ్యావహారికసత్యములు కానంత మాత్రమున యదార్థములు కాక పోవు. భారతములోని నీతులు విశ్వజనీనములు. భూలోకమున కవతరించిన మానవునకు స్వర్గారోహణమునకు దారి చూపుచున్న మహాభారతము, సార్వకాలిక మానవచరిత్ర. ఈ పరమసత్యమును సంపూర్ణముగ సాక్షాత్కరింపఁజేసికొనిన ఋషికల్పుఁడు నన్నయమహాకవి యాంధ్రమహాభారతము నారంభించిన ఆదికవి.

నన్నయభట్టుమహాకవికి, మహాభారతరచనమున నతని సహాధ్యాయి నారాయణభట్టు తోడు వడెను.

పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణు నట్లు వాణసభరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుఁ దన కిష్టుఁడుఁ సహా
ధ్యాయుఁడు నైన వాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగ॥

నారాయణభట్టు కూతురు శాసనము దక్షారామమునఁ గలదు. రాజరాజనరేంద్రుఁడు నారాయణభట్టునకు "నందంపూడి"

యగ్రహారమును దాన మొసంగెను. ఈ శాసనరచయిత నన్నయ. లేఖకుఁడు గండాచార్యుఁడు. అందు నారాయణభట్టునుగూర్చి కర్ణాట ప్రాకృతపైశాచికాంధ్రభాషలయందు కవిరాజశేఖరుఁ డని కవీభవజ్రాంకుశ మనియు, సరస్వతీకర్ణావతంస మనియు నష్టాదశావధారణచక్రవర్తి యనియుఁ, బ్రశంస గలదు. నందంపూడి నేటి కోనసీమలో నమలాపురమునకు సమీపమున నున్న చిన్న గ్రామము.

నన్నయభట్టునకు నారాయణభట్టు భారతాంధ్రీకరణమునఁ జేసిన సాహాయ్యస్వరూపనిరూపణమున వాఙ్మయరంగమునఁ బండితులలో నేకవాక్యత కుదుర లేదు. కొందఱు నన్నయ నారాయణభట్టులు జంటకవులై భారతమును వ్రాసి రని ద్వైకర్తృకత్వము నూహించుచున్నారు. మఱికొందఱు లాంఛనప్రాయముగ సహాధ్యాయుఁడైన మిత్రునకుఁ బ్రేమతో నన్నయ సమర్పించిన రవితాభివాదముగఁ బై పద్యమును స్వీకరించుచున్నారు. విప్రతిపన్నములైన రెండువాదములును సత్యదూరములే. నిత్యసత్యవచనుఁడు నవిరళ జపహోమతత్పరుఁడు నైన నన్నయమహాకవి సుస్పష్టముగ ద్వైకర్తృకత్వము సత్యమైనచోఁ జాటియుండెడి వాఁడు. నన్నయ ప్రయోగించిన ఉపమానము "పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నారాయణు నట్లు"— మిక్కిలి యర్థవంతము. మహాభారతయుద్ధమున శ్రీకృష్ణుఁడు వీరుఁడయ్యును జక్రమును జేతఁ బట్టనట్లు శపథ మొనరించెను. కాని సారథ్యము వహించెను. అట్లే నారాయణభట్టు కవి యయ్యు భారతరచనమున ఘంటమును బట్ట లేదని చెప్పక తప్పదు.

మహాభారతము నాంధ్రీకరించుటలో ననేకసమస్య లిమిడి యున్నవి. మహాభారతము పంచమవేదము. సంహితను దేశభాషలలోని కనువదించుటకు నాడు పండితప్రాతికూల్యము నెదుర్కొనవలసి యుండె నని కొందఱి యూహ. అప్పటికే యితర "దేశభాషల"లో భారతము లున్నవి. చక్రవర్తి రాజరాజ నరేంద్రుడు భారతముఁ దెనిగింపఁ బ్రార్థించెను. ఇంకఁ బండిత ప్రాతికూల్య మంతగఁ బరిగణింపఁ దగినది గాదు.

మహాభారతాంధ్రీకరణ మనినఁ గేవలము కవిత చెప్పుట కాదు. తెనుఁగు భాష కది శైశవము. ఆ విషయ మా నాటి వారు గూడ గ్రహించినదే. తెనుఁగున మహాభారతమును వ్రాయుటలో మూలము నెంత వర కనుసరింప వలెను? సంస్కృతశబ్దజాలములు సమాసములు నెంతవరకు పరిగ్రాహ్యములు? సంస్కృత ఛందస్సులకు దేశీయమైన ఛందస్సుల కెంతవరకు, నేవిధముగఁ బొత్తు సంధింపవలెను? మూలములోని యుపాఖ్యానముల నెట్లనువదింపవలెను. మూలములో విడువఁ దగిన వెవ్వి? విస్తరింపఁ దగిన వెవ్వి? సంక్షేపింపఁ దగిన వెవ్వి? సంస్కృతభారతమున లేకపోయినను దేశములో వ్యాప్తిలో నున్న భారతకథావిషయములు పరిగ్రాహ్యములా? పరిత్యాజ్యములా? అసలు సంస్కృతభారతము భారతదేశమున భిన్నభిన్నపాఠములతోఁ బ్రచారమున నున్నది? ఏ ప్రతి ననుసరింపవలెను? ఏ పాఠములు పాఠాంతరములు స్వీకార్యములు? ఇతరదేశబాషలలో నింతకుముందు భారతమును రచించిన కవు లీ సమస్యల నెట్లు పరిష్కరించిరి? ఈ విషయముల ననుశీలించి నిర్ణయించుటకుఁ దన శిష్యుఁడు సహాధ్యాయుఁడు నష్టాదశభాషావధారణచక్రవర్తి యగు నారాయణభట్టు

తోడయి నిర్వహించుట యవశ్యవాంఛనీయము. కావున నాంధ్ర మహాభారతమునఁ గవిత చెప్పినది నన్నయ. కావ్యశిల్పమునందు సాహాయ్య మొనర్చినది నారాయణభట్టని నిర్ణయింప వచ్చును.

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగన్.

ఇందు 'ప్రసన్నకథాకవితార్థయుక్తి,' 'అక్షరరమ్యత' 'భారతసంహిత' 'జగద్ధితము' అను ప్రయోగములు కవిహృదయ మును స్వయంవ్యక్తము చేయు నర్థవంతమైన పదగుంఫనములు.

ప్రసన్నకథాకవితార్థయుక్తి నన్నయ నుత్తమకథకునిగఁ జేసినది. దానిని కవీంద్రులు కథాకథనశిల్పజ్ఞులు మెచ్చుకొ గలరు. అక్షరరమ్యతను నితరులుగూడ నాదరించెదరు. ఈ "ఇతరు"లెవ్వరు? "అక్షరరమ్యత" యన నేమి?

నన్నయకు నర్థముమీఁద, సంతకంటె శబ్దముమీఁద, నిష్ఠ గలదు. నన్నయ నాదబ్రహ్మోపాసకుఁడు. రమణీయార్థప్రతి పాదకములైన శబ్దములు, వాని కూర్పు, గురులఘువుల యాను పూర్వీమాత్రమే గాక, 'ఏతదుచ్చారణ'నుగూడ నన్నయ యుపాసించెను. దీనినే "అక్షరరమ్యత" యని పలికెను. అక్షర రమ్యత సర్వజనైకవేద్యము. శబ్దార్థములకు నతీతము. కవీం ద్రులతోపాటితరులు గూడ నాదరింపఁ గలరు. ఇతరు లనినఁ బామరులు మొదలగు వారు. అందుఁ దెనుఁగు రానివారినిగూడఁ జెప్ప వచ్చును.

అక్షరసమ్మేళనమువలన జనించు నాదముపై నన్నయకుఁ గల నిష్ఠ కచదేవయాని ఘట్టములో నా మహాకవి కవితాహృదయము చీల్చికొని స్వయంవ్యక్త మగుచున్నది. ఆ సందర్భమున

విగతజీవుఁడై పడి యున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణదక్షుచేత
నభిహితం బగు శబ్దంబు నట్ల పోలె.

మృతుఁడైన వేదమూర్తి శుక్రుఁ డుచ్చారణదక్షుచే నభిహితమైన శబ్దము వలెఁ దిరిగి సంజీవితుఁడైనాడు. ఈ యర్థమునే భంగ్యంతరమునఁ బ్రతిపాదించిన నుచ్చారణదక్షుఁడు కాని వాఁ డుచ్చరించిన శబ్దము మృతప్రాయము. ఉచ్చారణదక్షుఁడు వేరు. సంగీతవిద్వాంసుఁడు వేరు. సంస్కృతమహాభారతములో లేని యీ యుపమానము నన్నయ కవి హృదయమునుండియే వెల్లివిరిసినది. ఉచ్చారణదక్షుఁడు కానివాఁడు నన్నయ మహాభారతమును బఠించుటకు ననధికారి. తెనుఁగున నన్నయ మహాభారత "సంహిత"ను రచించెను, సంహిత యని నొక్కిచెప్పుటలో వేదములకు గల స్వరప్రాధాన్యము గుర్తింపఁ దగినది. ఎంతటి సంగీతసాహిత్యపండితుఁడైనను, 'ఉచ్చారణదక్షత' యను నీ మృతశబ్దసంజీవనీవిద్య నెఱుఁగని వాఁడు నన్నయ భారతము పఠించిన సంపూర్ణరసాస్వాదన నలుప లేఁడు. నన్నయ సారస్వత జగత్తులో మృతసంజీవనీవిద్యామహితుఁడగు శబ్దశాసనుఁడు.

"పద్యకవిత నర్థగాంభీర్యము కొరవడకుండ గద్యమున వినిర్మించుట యసాధ్యము" అను సారస్వతవిమర్శకు నన్నయ

కవిత యంతయు నుదాహరణప్రాయమే. కవి విప్పారిన దివ్య చక్షువుతో నతిలోకసౌందర్యరసానుభూతిని దర్శించి పరివర్శించును. అందుచే వేదఋషులు తొలివేఁగుఁబోకలలో మంత్రద్రష్ట లైనారు. ఆర్షకవులు ద్రష్టలు. భారతము "సంహిత". నన్నయ కావ్యర్షి. కవి యనిర్వచనీయమైన సౌందర్యమును నతిలోకమైన యనుభూతిని వాగ్రూపమునఁ బ్రతిపాదించును. వాగగోచరమైన కవితానుభూతిని భౌతికనేత్రముల కందని సౌందర్యములను వాక్కులో నుపపాదించుటయే స్వవచోవ్యాఘాతమైన ప్రతిపాదన కావచ్చునుగాని కవితాప్రపంచమున స్వయంవ్యక్తమైన విచిత్ర విరోధాభాసము. నన్నయమహాకవి వాఙ్మయములోఁ బదములు చెప్పలేని భావములను గవితారూపమున నిర్వచించుట నక్షర రమ్యత మూలమున సాధించెను. శబ్దమునకుఁ గవిభావమును వ్యక్తీకరించు శక్తి లేకపోవుటచేతనే కవిత ఛందోరూపమున నభివ్యక్తమగుచున్నది. నన్నయమహాకవి ఛందస్సును, ఛందస్సుకంటె నతీతమైన నాదమును దన పద్యశిల్పమున నుపయోగించి శబ్దములు చెప్పలేని యనుభవైకవేద్యమైన భావములను మనోజ్ఞముగ గానము సల్పియున్నాఁడు. గంగ, మానవకన్యకయై ప్రతీపనృపాలుని చేరిన సన్నివేశ ముదాహరణగ స్వీకరింప వచ్చును—

గంగ నిజాంగదీప్తు లెసగం జనుదెంచి లతాంగి సంగతో
త్తుంగపయోధరద్వితయతోయరుహానన చారునేత్ర ది
వ్యాంగనయై ప్రతీపవసుధాధిపు శాలవిశాలదక్షిణో
త్సంగమునందు మన్మథవశంబున నుండెఁ గరంబు లీలతోఁ—

ఆంధ్రకవితాగానమునకు మృదంగవ్యాపారమును నిర్వహించునట్లు ఛందస్సు — యతిప్రాసలను ప్రయోగించు నొరవడి తరువాతి పురుషాంతరములకు నన్నయమహాకవి ప్రసాదించెను. బిందుపూర్వక గకారప్రాసము జలతరంగిణి వలె మ్రోగుచున్న యీ పద్యమున యతిప్రాసలు, పదములు చెప్పలేని యద్భుతభావము నెట్లు సుగమ్య మొనరించుచున్నదో రసజ్ఞహృదయములకు స్వయంవిదితము. సంస్కృతకవిత్వమున నిట్టి పద్యరచనాశిల్పము మృగ్యము. నన్నయమహాకవి యొరవడిగా దిద్దిన పద్యశిల్పమే తెలుఁగు మహాభారతమును, సంస్కృతమహాభారతముకంటె, దేశభాష లందలి భారతములకంటె విశిష్టమైనదానిగ, దేశభాషలందుఁ దెనుఁగును లెస్సగ నొనరించినది.

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ బదునాలుఁగు వేల మత్తేభములను రాజసూయయాగమున బహుమానముగ నొసఁగి నట్లు దుర్యోధనుఁడు తండ్రికి నివేదించును.

మండితసూర్యరశ్మిరుచిమన్మణిహారచయంబుతోఁ గట
స్యందిసుగంధిదానజలసంపద నొప్పెడు వాని దేవకీ
నందనుఁ డిచ్చెఁ బ్రీతిఁ బదు నాలుఁగు వేల గజంబులన్ జనా
నందనకీర్తియైన యమనాథతనూజున కిష్టమిత్రుఁడై

పదు నాలుఁగు వేల మత్తేభములు కను చూపు మేర కందండఁ గదలి వచ్చుచున్నవి. ఆ మత్తేభములు అలంకృతములు. ...ములలో ననేకమణులలోఁ బ్రతిఫలించు సూర్యరశ్మి, సూర్య... మండితము చేయుచున్నది. 'మండితసూర్యరశ్మిరుచి

మన్మణిహారచయంబుతో' – 'కటస్యందిసుగంధిదానజలసంపద నొప్పెడు వాని'—యీ దీర్ఘసమాసములు నేతదుచ్చారణవలనఁ బుట్టు నాదము, బిందుపూర్వకదకారప్రాసప్రయోగపౌనఃపున్యము మత్తేభయూథముల గంభీరమందగమనమును స్ఫురింపఁజేయును. 'ఉచ్చారణదక్షుఁడు' నన్నయమహాకవి రచించిన యీ పద్యమును బఠించినచోఁ దెనుఁగు రాని వాఁడు గూడ కదలి వచ్చెడి యేనుఁగుల గంభీరయానమున మ్రోగుచున్న చిరుగంటల మృదులయాన్వితనినాదమునుగూడ గుర్తింపఁ గలఁడు. కవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తి నాదరింపఁ గలరు. మహాభారతము వంటి మహాగాథలో నాద్యంతము లందుకొని యంతర్వాహినిగఁ బ్రవహించు వస్త్వైక్యము, కథాశిల్పము, ననురూపమైన ఛందస్సు. వ్యుత్పత్తి–ప్రతిభ, యేవంగుణవిశేషణవిశిష్టత యంతయుఁ బ్రసన్నకథాకవితార్థయుక్తి. అంత మాత్రమే గాక, శబ్దార్థములకు ఛందస్సునకు నతీతమైన నాదముచే ననుభవైకవేద్యమైన భావములను వ్యక్తీకరించు కవితాశిల్పమును సృష్టించిన కవులను విశ్వసాహిత్యప్రపంచమున వ్రేళ్ళపై లెక్కింప వచ్చును. అట్టి మహాకవులలో నన్నయ మేరుపూస. ఆంధ్రభారతము తెలుఁగుల సారస్వత వేదము.

దుశ్శాసనుఁడు ద్రౌపది వలువ లొలిచి నప్పుడు భీముని ప్రతిజ్ఞాపద్యము.

కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండఁగా మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు చేసిన ఖలుస్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్..

ఈ పద్యమున "కురువృద్ధుల్—గురువృద్ధబాంధవులు-మదోద్ధురుఁడై"— ఇత్యాదిసమాసములు ద్విరుక్తధకారప్రయోగపౌనఃపున్యము భీముని రౌద్రాకృతిని పఠితల మనోనేత్రమునకు సాక్షాత్కరింపఁ జేయుటయే గాక గదాదండప్రహరణనినాదము వినిపించు చున్నట్లున్నది. "తద్విపుల వక్షశ్శైలరక్తౌఘనిర్ఝర ముర్వీపతి".—సమాసము నుచ్చరించుచుండ, భీముడు పండ్లు పటపటఁ గొఱికి నట్లు ధ్వనించును. ఈ పద్యములో నే పదమునకు నిఘంటువు లిట్టి యర్థమును జెప్ప కున్నను, నుచ్చారణవలనఁ జనించు నాదమువలన నిది యంతయు స్వయంవ్యక్త మగును.

నన్నయ నోటఁ దెలుఁగు పదములు సంస్కృతసమాసములు నిష్ఠారపదవ్యవచ్ఛిన్నములై యథోచితముగ వికసించును. నన్నయ నానారుచిరార్థసూక్తినిధి. ఈ మహాకవి కావ్యమున ముక్తాహారకదృహ్లారసాంద్రపరాగప్రసరంబులు శరజ్జ్యోత్స్నాధవళకాంతిరేఖాపంక్తులు, విలసన్నవకైరవగంధబంధురోదారసమీరసౌరభములు, నవ్యనవనీతసమానరుచిరరసావిన్యాసములు, నుత్తుంగతరంగఘట్టితచలద్వేలావన్యైలావలీవల్లీలుంగలవంగసంగతిల తాలాస్యంబులు, హరినీలవినీలవిగ్రహారాళవైద్యుతరుచులు, నాంధ్రివాగ్విషయంబును దేజోమయం బొనర్చినవి.

వసంతోదయ మైనది. నన్నయ లయగ్రాహివృత్తములతో నామని శోభ వర్ణించెను.

'కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు
మధుపమ్ముల సుగీతనినదమ్ము లెసగెం జూ
తమ్ముల . లసత్కిసలయమ్ముల
సుగంధవకుళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ముల రవమ్ము
మధురమ్మగుచు వీచె ననిళమ్ము సుమనోఘా
రమ్ముల నశోకనికరమ్ములును
జంపకచయమ్ములును గింశుకవనమ్ములును నొప్పెఁ

చందన తమాల తరులందు
నగరుద్రుమములందుఁ గదళీవనములందు లవలీమా
కందతరుషండములయందు
ననిమీలదరవిందసరసీవనములందు వనరాజీ
కందళితపుష్పమకరందరసముం దగులుచుం
దనువు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందము లలందురఁగ
మందమలయానిల మమందగతి వీచెన్.

అట్టి 'సర్వభూతసమ్మోహనం బయిన వసంతసమయంబున'
మాద్రీదేవినిగూర్చి నన్నయ చెప్పిన పద్యము.

చారుసువర్ణభాసినవచంపకభూషయు సింధువారము
క్తారమణీయయున్ వకుళదామవతంసయునై యపూర్వశృం
గారవిలాసలీల నెసగం దన ముందట నున్న మాద్రి నం
భోరుహనేత్రఁ జూచి కురుపుంగవు డంగజరాగమత్తుఁడై.

నన్నయ సంస్కృతసమాసములలో ననిర్వచనీయమైన వసంతశోభ తొలుకాడు చుండును.

కృష్ణద్వైపాయనుఁడు, పుత్రశోకార్తయైన తల్లి సత్యవతితో

మతిఁ దలపఁగ సంసారం
బతిచంచల మెండమావు లట్టుల సంపత్
ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్.

మూలమున వ్యాసుఁడు 'పృథివీగతయౌవనా' అనిన నన్నయభట్టు 'గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్'—అని స్వతంత్రించి పలికెను. ఇట్టి విశ్వజనీనమైన యుదాత్తసత్యమును వక్కాణించుటకుఁ గవి మార్కండేయునివంటి చిరంజీవియై కల్పకల్పాంతరములు చూచిన వాఁడు కావలె. లేదా త్రికాలాబాధితమైన దివ్యదర్శనము గలవాఁడైన గావలె. వ్యాసుఁడు సమస్తపృథివినిగూర్చి యాకాశముకంచె నున్నతమైన భావమును వచింప, నన్నయమహాకవి యనంతకాలము నధిగమించు సుభాషితమును ప్రవచించెను. నన్నయ మహాభారతము సంస్కృత మూలమున కంధప్రాయమైన యనువాదము గాదు. యథామాత్రకమైన యథోచితానుసరణము, ఈ యొరవడినే తిక్కన మహాకవి పాటించుటచే, నాంధ్రభారతము స్వతంత్రకావ్యమైనది.

నన్నయభట్టు మహాకవికి మాతృభూమియైన తెలుఁగు దేశముపైఁగల యభిమానమున కర్జునుని తీర్థయాత్రాఘట్టము నిదర్శనము. అర్జునుఁడు తీర్థయాత్రల సేవించుచుఁ దెలుఁగు దేశము చేరెను.

దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన
గోదావరియు జగదాది యైన
భీమేశ్వరంబును బెడఁ గగు చున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగిదేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి
ణాంబురాశితీరంబున కరిగి దురిత
హారియైన కావేరీమహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుఁ జేసి కృతార్థుఁ డగుచు.

శిష్టాగ్రహారభూయిష్ఠమైన వేఁగిదేశము నర్జును కాలమునఁ గలదో లేదో గాని నన్నయ సమకాలీనమైన తన తెలుఁగు దేశమునే వర్ణించె ననుట నిర్వివాదము.

రైవతకాద్రికి యదువీరులు మహోత్సవార్థము పౌరజన ప్రధానసమేతముగా నేగిరి. ఈ యుత్సవము నన్నయ సమకాలీన సంఘవృత్తమే.

పొలుపుగఁ బూసి కట్టి తొడి భూరివిభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగ దత్పురీజనులు కాంస్య మృదంగ ముకుంద వేణు కా
హళపటహధ్వనుల్ చెలఁగ నాటలుఁ బాటలు నొప్ప నెల్ల వా
రలుఁ జని చేసి రర్చనలు రైవతకాద్రికి నుత్సవంబుతోన్.

అక్కడ "క్రొమ్ముడులందున పుష్పముల్ పయిం దొరఁగ నిదాఘబిందువితతుల్ చెదరఁగా మదిరామదంబునం బరవశలయ్యు నింపెసఁగఁ బాడుచుఁ దాళము గూడ మెట్టుచుం దరుణియ లొప్పనాడుట" జనములు మెచ్చుట; నన్నయ మహాకవి చూచిన తెలుఁగు తిరునాళ్ళ వర్ణనయే యతని భారతమున కెక్కినది. పౌరవరాజ్యసంవృద్ధిని వర్ణించు నప్పుడు నన్నయ మనస్సులో సమకాలీనచాళుక్యరాజ్యమే ప్రాతిపదికగా నిల్చెనని యూహింపవచ్చును.

అమలాచారపవిత్రభూసురవరేణ్యాగారపుణ్యప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహాస్వధాస్వ స్తిశ
బ్దములున్ మంగళతూర్యఘోషములు నుద్యత్కౌతుకాశీర్నినా
దములుఁగా రమ్యతరంబు లయ్యె ధరణిం దద్రాజ్యసమృద్ధితో.

ఆంధ్రసారస్వతమున నన్నయ కవిత తొలివేఁగుఁబోక. నన్నయమహాకవి పదగుంఫనములలో నేటికి నా ప్రత్యూష తుషారకోమలత తొలుకాడు చుండును.

నన్నయమహాకవి ప్రసన్నకథాకవితార్థయుక్తికి శకుంతలా గాథ మఱియొక నిదర్శనము. నన్నయ కాళిదాసమహాకవి కర్వాచీనుఁడు. సాహిత్యరంగమున నభిజ్ఞానశాకుంతల మప్పటికే స్థిరకీర్తి నార్జించియున్నది. శకుంతలాగాథ లోకములో యశోవ్యాప్తి నందుటకుఁ గారణము వ్యాసభారతము గాదు. కాళిదాస మహాకవి యభిజ్ఞానశాకుంతలమే. నాటకీయమైన కాళిదాస శాకుంతలాగాథ వ్యాసభారతమునకు భిన్నము. మనోహరమైన

కాళిదాసకల్పనము ప్రపంచము నంతటి నాకర్షించినది. పినవీరభద్రుఁడు శృంగారశాకుంతలమునఁ గాళిదాసకథను గొంతవరకు స్వీకరించెను. కాని, నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తితో, నాటకీయమైన కాళిదాసవృత్తమును స్వీకరింపక వ్యాసప్రోక్తకథను మాత్రమే రచించెను. నన్నయ కాళిదాసశాకుంతలమును జదువ లేదనుట సాహసము. కాని కాళిదాసు నన్నయను స్వీయపథకము నుండి తప్పింప లేక పోయెను.

మదనాతురుం డయిన దుష్యంతుఁడు శకుంతల యనురాగం బుపలక్షించి,

ఈ వల్కలాజినములకు,
నీ వన్యఫలాశనముల కీ విటపకుటీ
రావాసములకు నుచితమె
నీ విలసితరూపకాంతి నిర్మలగుణముల్.

ఈ ముని పల్లె నుండు టిది యేల కరం బనురాగ మొప్పగా
భామిని నాకు భార్య వయి భాసురలీల నశేషరాజ్య ల
క్ష్మీమహనీయసౌఖ్యముల మేలుగ నందు మనింపితేంమహా
దామలతుంగహర్మ్యముల హారిహిరణ్మయకుట్టిమమ్ముల౯.

అని యడుగును. ఆమెను గాంధర్వమున వివాహమై, రాజధానికిఁ దరలిపోవును. శకుంతలకు భరతుఁడు కణ్వాశ్రమమున నుద్భవించి యుక్తవయస్కుఁడగును. అప్పుడు కణ్వమహర్షి శకుంతలను భరతుని దుష్యంతునకడకుఁ బుత్తెంచును. అచ్చటఁ దన్ను నిరాకరించిన దుష్యంతమహారాజునకు శకుంతల నీతుల నుపదేశించును.

సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞు లైన మునులు.

అని నిత్యసత్యవచనుఁడైన నన్నయ శకుంతల దుష్యంతునితోఁ బలుకును. దుష్యంతుఁడు చలింప లేదు.

శకుంతల దుష్యంతునితో,

"విపరీతప్రతిభాష లేమిటికి సుర్వీనాథ యీ పుత్ర గా
త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుఁ బుత్రగా
త్రపరిష్వంగము నట్లు జీవులకు హృద్యంబే కడుఁ శీతమే''

అని యమాయికముగఁ బల్కినది. ఆశ్రమవాస సంపరి యమాయికపవిత్రత, యనుభవైకవేద్యమైన పుత్రప్రేమ, ప్రేమించిన పతియందలి నిష్కపటమైన లలనానిసర్గవిశ్వాసము రాశీభూతమై నన్నయ శకుంతలగా సాక్షాత్కరించును.

సత్యవతి, పుత్రుఁడైన పారాశర్యుని స్మరింపఁగనే,

నీలగిరీంద్రశృంగమున నిర్మలమైన సువర్ణవల్లరీ
జాలము వోని పింగళవిశాలజటాచయ మొప్పఁగా వచ
శ్శ్రీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీలవినీలవిగ్రహా
లోకరుచుల్ వెలుంగగఁ బరాశరసూనుఁడు తల్లి ముందటన్

ఈ పద్యము పఠించిన రసజ్ఞుని మనోనేత్రము ముందు నేటికి నల్లని పరాశరసూనుఁడు సాక్షాత్కరించును.

నన్నయ రచనలో నెడ నెడ ఋతువర్ణనములు మిక్కిలి మనోహరములు. పాండవులు గంధమాదనపర్వతమును జేరి నప్పుడు వర్షము కురిసెను.

కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషము పెల్లెసలంగ భయం
కరములు గాఁగ రాతెఁ బరకాతతు లొప్పఁ దటిల్లతాళి వి
స్ఫురితముగాఁ బ్రపూర్ణజలపూరము లగ్గిరికుంజఘూర్ణి ని
ర్ఝరతటినీవిశాలకటసాలచయంబు విమూలితంబుగన్.

నహుషప్రశ్నల కుత్తరం బొసఁగి, ధర్మరాజు నిజాశ్రమమును జేరి నప్పుడు

ఖరకిరణాతపమున సురు
తరదవదాహమున శోషితములైన వనాం
తరతరుతతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గడు బెడఁ గయ్యెన్.
ఘనతరనైశతమం బొకొ
యనఁగ ఘనాగమతమిస్ర మవికలమై క
ప్పిన జనులకు వస్తువిభా
వన మొక్కొకయెడల గలిగె వైద్యుతరుచులన్.

దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీ రజో
మిళిత సుగంధ బంధుర సమీరణుఁ డన్ సఖుఁ డూచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తులను నుయ్యెల లొప్పగ నెక్కి యూఁగె ను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్.

అరణ్యపర్వమందుఁ జతుర్థాశ్వాసమున నీ ఘట్టముననే నన్నయ రచన యాగిపోయినది. నన్నయ రచన యాగిపోవుటకుఁ గారణములను బండితులు పలు విధములుగా నూహించుచున్నారు. నన్నయమహాకవి నిర్యాణమే దీనికి హేతు వని కొందఱు, రాజరాజనరేంద్రుని యస్తమయ మని మఱికొందఱు.

రాజరాజనరేంద్రుఁడు శకసంవత్సరములు 944, దుందుభి సంవత్సరామాంత భాద్రపద బహుళ విదియ గురువారము నాఁడుదయమున నుత్తరాభాద్రానక్షత్రయుక్తతులాలగ్నమందుఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. అది క్రీస్తుశకము 1022 ఆగష్టు 16 వ తేదీ. అంతకుముందే యతఁడు యువరాజుగ రాజ్యభారము వహించెను. రాజరాజు తండ్రి భూపమహేంద్ర, ముమ్మడిభీమ బిరుదాంకభీమ - త్రిభువనాంకుశ, విష్ణువర్ధన, సత్యాశ్రియ బిరుదాంకితుఁడైన విమలాదిత్యుఁడు. అతఁడు కుందవాదేవివలన రాజరాజనరేంద్రుని, మేడాంబవలన వీరవిజయాదిత్యుని పుత్రులుగఁ బడసెను. ఆ కాలమున దక్షిణాపథచరిత్రి ననుశీలించినచో గాని భారత రచన మాగిపోవుటకుఁ గల కారణము లవగాహన చేసికొనుటకు వీలుండదు. విమలాదిత్యుఁడు, నతని పుత్రుఁడు రాజరాజు నతని పుత్రుఁడు కులోత్తుంగుఁడు వరుసగా చోళరాజ పుత్రికల వివాహ మాడిరి. వేంగిచోళమండలములు పరస్పర మైత్రితో నుండెను, విమలాదిత్యునకుఁ దరువాత రాజరాజునకుఁ గొంతకాలము వజ్జియప్రెగ్గడ ప్రధాని; బేతనభట్టాస్థానకవిగఁ గన్పించుచున్నారు. విమలాదిత్యుఁడు రణస్థిపూండి గ్రామము సర్వకరపరిహారముగ వజ్జియప్రెగ్గడకు ధార వోసెను. ఆ దాన శాసనము బేతనభట్టుకవి వ్రాసెను. లేఖకుఁడు జొంతాచార్యుఁడు.

రాజరాజనరేంద్రుని కోరుమిల్లి శాసనకవి చేతనభట్టు. లేఖకుఁడు గండాచార్యుఁడు. రాజరాజు నందంపూడి శాసనకవి నన్నయభట్టు. లేఖకుఁడు గండాచార్యుఁడు. అది క్రీస్తుశకము 1053 నవంబరు నాటిది. నారాయణభట్టునకు సోమగ్రహణకాలమున సర్వకర పరిహారముగ రాజరా జగ్రహారదాన మొసంగెను.

రాజరాజనరేంద్రునితోఁ జోళరాజ్యము తప్ప, నిరుగు పొరుగు రాజ్యములు శతృత్వము వహించియుండెను. కళింగాధిపతి మధుకామార్ణవుఁడు, కర్ణాటాధిపతి జగదేకమల్లుఁడు వేంగిపైఁ బగఁ బూనియుండిరి. రాజరాజనరేంద్రుని సోదరుఁడైన విజయాదిత్యుఁ డన్నపైఁ దిరుగుఁబాటు లేవదీసెను. కలిదిండిప్రాంతమునఁ గర్ణాటరాజసాహాయ్యము నందిన విజయాదిత్యునకుఁ జోళరాజసైన్యసాహాయ్య మందిన రాజరాజునకు ఘోర యుద్ధము జరిగినది. చేతనభట్టు యుద్ధమును గన్నులకు గట్టినట్లు వర్ణించెను. అది సమయుద్ధము. ఇట్లనేకయుద్ధములు సమయుద్ధములుగాఁ బరిణమించి చివరకు రాజరాజు కొల్లిపాక యుద్ధమున విజయాదిత్యుని సంపూర్ణముగ నోడింపఁగల్గెను.

రాజరాజు సంపూర్ణవిజయమును సాధించిన పిమ్మట, కలిదిండిలో రాజరాజేశ్వరాలయము లను పేరున రెండు శివాయతనములను నిర్మించెను. అందు బలినైవేద్యనృత్యసంగీతమంగళఖండస్ఫుటితనవకర్మలకొఱకును, వేదాధ్యయనశాస్త్రశ్రోతలకు సత్రాపకులకుఁ బంచసత్రములు, నేబది యిద్దరు వేశ్యలకు, బ్రాహ్మణవైశ్యశూద్రశతములకు వసతులను గల్పించి, కలిదిండి కడపట్లు ఆరవకూరు గ్రామములను దాన మొసఁగెను.

తరువాత కొంతకాలమువరకు దక్షిణాపథరాజ్యములు ప్రశాంతి వహించినవి. కాని, యీ ప్రశాంతి చాల కాలము నిలువలేదు. నాటి దక్షిణాపథచరిత్రలో మిక్కిలి ప్రాముఖ్యము వహించినది కొప్పము యుద్ధము. అంతకుముందు చోళ కర్ణాట రాజ్యము లనేకయుద్ధముల నొనరించినవి. జయలక్ష్మి యుభయ రాజ్యములమధ్య నూయెల యూపుగా వినోదించినది. కాని కొప్పము యుద్ధమున త్రైలోక్యమల్లుని సామంతుఁడు దడిగ దేవుఁడు చోళచక్రవర్తి రాజాధిరాజు శిరమును ఖండించి తన యేలికకుఁ గానుకగా నొసఁగెను. రాజాధిరాజు తమ్ముఁడు రాజేంద్ర దేవుఁడాహవరంగమును విడిచి పారిపోయెను.

రాజేంద్రదేవుఁడు రాజరాజనరేంద్రుని పట్టమహిషి యమ్మంగదేవి సోదరుఁడు, అతనికి వియ్యంకుఁడు. వేంగి చోళ రాజ్యములకుఁ గల సన్నిహితసంబంధమునుబట్టి కొప్పము యుద్ధము రాజరాజనరేంద్రునిపై నెట్టి పరిణామప్రభావమును వహించెనో!! రాజరాజనరేంద్రునకు కొప్పముయుద్ధము కురుక్షేత్ర మును మహాభారతయుద్ధమును స్మరణకుఁ దెచ్చియుండును. ఆ కొప్పము యుద్ధకాలము క్రీస్తుశకము 1053 వ సంవత్సరము.

నన్నయభట్టు రాజరాజనరేంద్రుని ప్రతాపము నాంధ్ర మహాభారతమున నాశ్వాసాద్యంతపద్యములలో మనోజ్ఞముగ నభివర్ణించెను. ఈ మహాయుద్ధము లన్నిటిలో గడిఁదేరిన వీరుఁ డుగాఁ బ్రసిద్ధి కెక్కిన రాజరాజనరేంద్రుఁడే యాంధ్రభారత కృతికర్త. నన్నయమహాకవి రాజరాజనరేంద్రుని, 'ఘోరాజి ముఖోపలబ్ధవిజయప్రమదా(శ్రిత)బాహుదండ! నిస్తేజితవైరి వీర!

దండితాహితవీర! పరగండభైరవ! వైరివేదండగండవిదారి ఘోరతరాసిధారాసిధుజార్గళ! వీరోగ్రాజివిజయా! ఇత్యాదిసంబోధనలచే మన్నించెను.

రాజరాజనరేంద్రుఁడు, నన్నయభట్టుమహాకవి భారతమున శ్రీ జయవిధాసివిసమగ్రాజన్యకిరీటమణివిరాజితపాదాంభోజుఁడు. నానావనినాథకిరీటతటీవిలసద్రత్నసంఘటితపదకమలుఁడు. గంధసింధురహయశిక్షారూఢుఁడు. ఘోరారిమదకుంభికుంభవిదారణ దారుణకృపాణదక్షిణహస్తుఁడు.

ఆంధ్రమహాభారతమును నన్నయ యీ మహాయుద్ధముల తరువాత, ననగా క్రీస్తుశకము 1053 సంవత్సరము ప్రాంతమున నారంభించెనని యూహింపవచ్చును. నారాయణభట్టునకు నందంపూడి యగ్రహారము క్రీస్తుశకము 1053 సంవత్సరముననే లభించుటగూడ నీ యూహకుఁ దోడ్పడుచున్నది. నారాయణభట్టు నన్నయకు సహాధ్యాయి. అతని కూతురు దక్షారామ శాసన కాలము శక 977, క్రీ॥ శ॥ 1055 సంవత్సరమున నారాయణభట్టు చక్రవర్తి త్రైలోక్యమల్లదేవర ప్రధానిగఁ జేర్కొనఁబడెను. అతఁడు కంచెన సోమయాజి పౌత్రుఁడు, అకలంక శంకనామాత్య పుత్రుఁడు.

త్రైలోక్యమల్లదేవునకుఁ జోళ వేంగీప్రభువులకుమధ్యఁ గల వైరము చరిత్రప్రసిద్ధము. అట్లయినచో త్రైలోక్యమల్లదేవుని ప్రధాని నారాయణభట్టున కెట్లు రాజరాజనరేంద్రుఁడు నందంపూడి యగ్రహారము దాన మొసగెనో యాతఁడెట్లు రాజనరేంద్రు నాస్థానము చేరెనో చరిత్ర యింకను విప్ప లేకున్న చిక్కు ముడి

నన్నయ నందంపూడి శాసనమున నారాయణభట్టు వైదుష్యము పొగడి 'జగదుపకరణుఁ డని' యతని స్తుతించెను. నారాయణభట్టు వాఙ్మయధురంధరుఁడై నన్నయకు, రాజనీతిజ్ఞుఁడై రాజరాజునకుఁ దోడ్పడి యుండును. నన్నయకు భారతరచనమున రాజరాజునకు త్రైలోక్యమల్లదేవునకు కొప్పమున యుద్ధము జరిగిన తర్వాత నారాయణభట్టు సంధి కుదిర్చి రాజరాజనరేంద్రుని యాస్థానమునఁ జేరి యతని మన్ననల నంది యుండవచ్చును. ఈ సంధిప్రయత్నములలో రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టు వలన నతని సహాధ్యాయియైన నారాయణభట్టు సాహాయ్యమును సంపాదించియుండవచ్చును. కొప్పము యుద్ధము తరువాత రాజేంద్రదేవుడు పారిపోయెను. రాజనరేంద్రునకు సంధి తప్ప గత్యంతరము లేదు.

అప్పుడు నన్నయ భట్టుమహాకవి త్రైలోక్యమల్లుని ప్రధాని నారాయణభట్టు తనసహాధ్యాయి కావున నతని మూలమున నీ సంధి కుదిర్చియుండును. అందుచేతనే నారాయణభట్టు కూతురు కుపమ తండ్రిని ప్రత్యక్షముగ దక్షారామమున 'త్రైలోక్యమల్లదేవర' ప్రధానిగఁ బేర్కొనఁ గలిగెను. నన్నయ, మహాకవి మాత్రమే గాడు. కావుననే నన్నయ, భారత పీఠికలోఁ దన్నుఁగూర్చి

"తన కుల బ్రాహ్మణు,........'పాత్రు'.......'లోకజ్ఞు'' .."
అని చెప్పుకొనెను.

'పాత్రు' శబ్దప్రయోగమున కొకవిశేషార్థ మున్నది. ఆ కాలమున రాజాస్థానముల సాంధివిగ్రహిపాత్రు లనెడి యుద్యోగు లుండెడివారు. వీరు నేటి రాయబారుల వంటి వారు. నన్నయ

రాయబారియై త్రైలోక్యమల్లదేవర యాస్థానమున కరిగి
యచ్చటఁ దన సహాధ్యాయుఁడు నారాయణభట్టే యొక ప్రధాని
గావున సంధి గుదిర్చె నని యూహింప వచ్చును. పురుషాంతర
ముల తరబడి మహాయుద్ధముల నొనర్చిన వేంగి కర్ణాటరాజ్యము
లకు నడుమ సంధిరాయబారము జయప్రదముగా నడపిన
నన్నయ "లోకజ్ఞుఁడు, సత్ప్రతిభాభియోగ్యుఁడు" అని వినుతి
కెక్కుటలో నతిశయోక్తి లేదు.

నన్నయ నెరపిన యీ రాయబారమునకు దక్షిణాపథ
చరిత్రలో రావలసిన కీర్తి రాలేదు. దీనికిఁ గారణ మా సంధి
చాల కాలము నిలువక పోవుటయే గావచ్చును.

నన్నయ రాయబారము జయప్రద మగుటకుఁ గారణము
"వాణసధరామరవంశవిభూషణుండు నారాయణభట్టు". వాణస
వంశస్థులు కర్ణాటరాజాస్థానమున ప్రధానులు. అందు వాణసవంశ
స్థుఁడైన మధుసూదనయ్య "కుంతలరాజ్యలక్ష్మీలతావసంతుఁడు.
దుర్మంత్రిమంత్రనిరతరిపునృపాలలక్ష్మీసమాకర్షణైకమంత్రము.
చాళుక్యరాజ్యభారధౌరేయుఁడు. సార్వభౌమరాజనియోగరాజాధ్య
క్షుఁడు, చాళుక్యచక్రేశ్వరప్రసాదాసాదితయువరాజపదవీవిరా
జితుఁడు." "చక్రవర్తి త్రైలోక్యమల్లదేవుని ప్రధాని", సహాధ్యా
యుఁడు నైన నారాయణభట్టు సాహాయ్యమున నన్నయ రాజరాజ
నరేంద్రుని రాయబారియై త్రైలోక్యమల్లదేవుని యాస్థానమును జేరి
యుభయరాజ్యములకుఁ సంధి యొనర్చెను. ఆగర్భవైరులగు
రాజులకు నడుమ కుదిర్చిన సంధి యది. ఇది నన్నయ
'లోకజ్ఞత'కు, దురదృష్టవశమునఁ జరిత్ర మరచిన యుజ్జ్వల

నిదర్శనము. కావుననే, నన్నయ సంధిసంధాతయైన నారాయణ భట్టును "అనుష్ఠితజగదుపకరణుఁడని, సాక్షాన్నారాయణుఁ డని ప్రశంసించెను. అతఁడు చక్రవర్తి త్రైలోక్యమల్లదేవుని ప్రధానిగ, రాయబారిగనే రాజరాజనరేంద్రుని యాస్థానమును జేరెను. అతఁడు ప్రధానిమాత్రమే గాదు. వాఙ్మయధురంధరుఁడు. రాజ రాజనరేంద్రుఁడు వేంగిప్రభువు మాత్రమే గాఁడు. "రాజమహేంద్ర కవీంద్ర సమాజసురక్ష్మాజము." నారాయణభట్టు రాజనరేంద్రుని యాస్థానమునకు వచ్చినప్పుడు కవీంద్రసమాజ మతనికి ఘనస్వా గతమిచ్చినది. అష్టాదశావధారణచక్రవర్తి నారాయణభట్టు, మహా కవి నన్నయ, కవీంద్రసురక్ష్మాజము రాజరాజనరేంద్రుని సమాగమ మాంధ్రవాఙ్మయమునకు మహోదయము. ఆ మహోదయమున సంస్కృతమహాభారతము తెనుఁగున కవతరించినది.

రాజమహేంద్రకవీంద్రసమాజసురక్ష్మాజ మైన రాజరాజ నరేంద్రుని యాదేశమున నన్నయమహాకవి భారతము నారంభిం చెనే గాని ముగింపలేకపోయెను. దీనికిఁ గారణ మానాటికల్లోల రాజకీయస్థితిగతులే యని యూహింప వచ్చును.

ఈ సంధి చిరకాలము నిలువలేదు. త్రైలోక్యమల్లుఁడు, మరల దిగ్విజయము సలుపఁ దలచి కాంచీపురిపై దండెత్తె నని బిల్హణకవి రచనవలనఁ దెలియు చున్నది. ఈ దండయాత్రకు జిగీషయే కారణము. అతని రెండవ కుమారుడు కుమారవిక్రమా దిత్యుఁడు వేంగిపై దాడివెడలెను. అతఁడు తొలుదొల్త చక్ర కూటము ముట్టడించెను. రాజరాజనరేంద్రుఁడు తనపుత్రుఁడైన కులోత్తుంగుని చక్రకూటమునకుఁ బంపి తాను కర్ణాటసేనాని

మధుసూదనునిపైన కెత్తి వెళ్ళెను. ఈ సంఘటనలు క్రీస్తుశకము 1058 సంవత్సరప్రాంతము నాటివి.

ఇదే సమయ మని రాజరాజనరేంద్రుని సవతి తమ్ముడు విజయాదిత్యదేవుఁడు పశ్చిమచాళుక్యులతోఁ జేరి రాజమహేంద్ర వరము నాక్రమించెను. రాజరాజనరేంద్రుఁడు కర్ణాటసేనలతోఁ బోరాడుచు యుద్ధమున వీరస్వర్గ మలంకరించెను. యువరాజు చక్రకూటప్రాంతమున నజ్ఞాతవాసము సలిపి వచ్చెను.

ఇట్టి కల్లోలస్థితిలో నారాయణభట్టు స్థితి చరిత్ర కందని విషయము. నన్నయభట్టుకూడ నేలికవెంటఁబోయి యుద్ధమున పరజించెనో తెలియదు. లోకజ్ఞుఁడు మిత్రుఁడునైన నన్నయ రాజరాజు నధిగమించియుండవచ్చును. నన్నయ భారతమున చివరి పద్యము శరత్కాలవర్ణనము. ఈ పద్యానుశీలనమున, నన్నయ తాను తిరిగివచ్చుట యసంభవ మని గుర్తించి, చిట్ట చివరి పద్యమున నిఁక నాంధ్రభారతపర్వములు "పరపూరితం బులై" వెలయు నని చెప్పి నట్లు దోచును.

శారదరాత్రు లుజ్జ్వలలసత్తరహారకహారపంక్తులన్
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబులై.

ఇందు, "కర్పూరపరాగపాండురుచిపూరములు—అంబర పూరితంబులై" యనుట ప్రకరణానుబద్ధమైన యర్థము. అట్లుగాక, కర్పూర పరాగ పాండు రుచిపూరములన్, "పరపూరితంబులై"

యను పదగుంఫనము చివరి మాటగ విశ్చి స్వీకరించిన, మహా కవి నన్నయయే భవితవ్యమునే యందట్లు పొందుపరచినట్లు గోచరించును. నన్నయ చివరిమాట, "పరపూరితంబులై''— 'యితరులచే పూరింపఁబడినవై' యని నిష్కర్షగఁ జెప్పె ననుట పండితులు సందర్భమునుండి వాక్యములను విడదీసి విరిచి చెప్పెడి యర్థమని కొందఱు పూర్వపక్షమును నెలకొల్పవచ్చును. కాని నన్నయమహాకవివాక్యము యాదృచ్ఛికనిరర్థకప్రయోగము కాఁజాలదు.

"ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోనుధావతే'' ఋషుల పలుకును అర్థ మనుసరించు నను భవభూతిమహాకవి వాక్యము చిరస్మరణీయము.



# తిక్కన

నన్నయ మహాకవి యారంభించిన మహాభారతము సుమారు రెండు శతాబ్దుల తరువాత తిక్కనమహాకవి యావిర్భావము వఱకు నసంపూర్తిగ నిలిచిపోయినది. నన్నయ తరువాత రెండు శతాబ్దులలోఁ దెలుఁగు దేశమునఁ గవులే పుట్టలేదా? మహాభారత మేల యసంపూర్తిగ నుండి పోయినది? ఈ ప్రశ్నలకు సమాధానము నన్వేషింప వలెను. నన్నయకుఁ దిక్కనకు మధ్య కాలమునఁ దెలుఁగున కవు లెందఱో గలరు. నన్నెచోడుఁడు, పండితారాధ్యుఁడు, పాల్కురికి సోమనాథుఁడు మున్నగు మహాకవు లందఱీ మధ్యకాలమున వెలసిన వారే. వీరందఱు భారత మేల పూరింప దొరకొనలేదు? దీనికనేకకారణములు గలవు. వీరు శివకవులు. శైవులలో నతివాదులు వీరశైవులు. వీరశైవ కవుల మతావేశము, భవికవుల దర్శనస్పర్శనాదులు పరిహరించు నంతవఱకుఁ బోయెను.

భవి కృతారంభసంభవభ్రాంతిచయము
భవి నిరీక్షణరసపాకవితాన
భవి హస్తగతఫలపత్రశాకాది
భవి గృహక్షేత్రసంప్రాప్తభవనవర్జితుఁడ;
భవిజనదర్శనస్పర్శనాలాప
వివిధదానాదానవిషయదూరగుఁడ.

అని పాల్కురికి సోమనాథకవి పండితారాధ్యచరిత్రలోఁ జెప్పుకొనెను. నాటి సమాజములో వీరశైవులు గొప్ప విప్లవమును నెలకొల్పినట్లే, నాటి సారస్వతములో శైవకవులు గొప్ప పరివర్తనము సంఘటించిరి.

శివకవు లందఱు వీరశైవులు గాకపోవచ్చును. కాని వా రందఱకు సారస్వతమునఁ జాల సమానధర్మములు గలవు. శివపారమ్యప్రబోధము, శివభక్తి యందఱకుఁ బ్రధానసూత్రములు. వీరి దృష్టిలో మతము ప్రధానము. సారస్వతము గౌణము. వీరు మతప్రబోధమునకే సారస్వతసృష్టికిఁ బూనుకొనిరి. తెలుఁగు వారికిఁ దెలుఁగు భాషలో శివభక్తిప్రాధాన్యము, శైవమత ప్రాశస్త్యము బోధించుటయే వారి సంకల్పము. కావున వారి కావ్యములు స్వమతస్థాపన పరమతఖండనలతో నిండిపోయి సార్వజనీనములు గాలేకపోయినవి. వీరి గ్రంథముల, నుత్తమోత్తమకవిత యని చెప్పఁదగిన మహోదారభావములు నుత్కృష్టసృష్టి యనిపించు సన్నివేశములు నెన్నియో కలవు. కాని సాహితీలోకములో వీరికి రావలసిన కీర్తి రాలేదు. చారిత్రికముగ వీరు నన్నయ తిక్కన మహాకవులమధ్యనున్నారు. ఇటు చంద్రాస్తమయము, అటు సూర్యోదయమునకు మధ్య, శుక్రుని యలఁతి యలతి కాంతులెంత నిసర్గరమణీయములైనను లోకము చక్కఁగా దర్శింప లేదు.

శివకవులు సారస్వతమునకుఁ జేసిన సేవ, "జాను తెనుఁగు"నకు, "దేశికవిత"కు, వారుకల్పించిన ప్రాముఖ్యము. స్వతంత్రమైన యీ సారస్వతోద్యమమే వారిని నన్నయనుండి వేరు చేసినది. శివకవులు భారతరచనకు దూరమైరి.

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

అని నన్నెచోడుఁడు దేశికవితను వివరించెను. నన్నెచోడుని కాలములో నాంధ్రసాహితీలోకములో, "మార్గ" "దేశి" యను భిన్నవాదములు గన్పించు చున్నవి. 'మార్గ' 'దేశి' పదములు సంగీతనాట్యపరముగ సలంకారగ్రంథములలోఁ గన్పించు చున్నవి. "మార్గ దేశి విభాగేన సంగీతం ద్వివిధం మతం" —శాస్త్రబద్ధమైన సంగీతము 'మార్గ'; యథేష్టాచరణ, నియమ రహితమైన సంగీతము 'దేశి'. అట్లే నృత్యనృత్తములుగూడ. కవితాపరముగఁగూడ నీ శబ్దముల కట్లే యర్థవివరణము చెప్పుకొన వచ్చును. నన్నెచోడుఁ డీ శబ్దముల నే యర్థమునఁ బ్రయోగించెను? ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుటలోఁ బండితులలో నేకవాక్యత కుదురుట లేదు. నన్నెచోడుఁడే

"మార్గకుమార్గము దేశియ
మార్గము వదవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గపదవర్తులనఁ దగు
మార్గములం దలచ నలంతి మహి సుకవులకున్"

అని వివరించెను.

"మార్గ=సంస్కృత కవిత్వము; దేశి= (తెలుఁగు) దేశభాషాకవిత్వము" అని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవముతో నర్థము వ్రాసియున్నారు. పూర్వోదాహృతమైన

చాళుక్యప్రశంసనుబట్టి నన్నెచోడుని దేశికవితాభిమానము నిర్వివాదాంశము. కాని, 'దేశికవిత' యనిన దేశభాషాకవిత్వ మని, యనగాఁ దెలుఁగు కవిత్వమని యర్థము చెప్పినచో చాళుక్యవాఙ్మయమునకు ధ్వజప్రాయమైన యాంధ్రమహాభారతమునుగూర్చి గాని, తత్కర్తయైన నన్నయభట్టునుగూర్చి గాని, నన్నెచోడుఁడు గాని, తక్కిన శివకవులు గాని, పూర్వకవి కావ్యప్రశంసాపూర్వకముగ నొక్క మాటయైనఁ బ్రసక్తి వచ్చినపుడు గూడఁ బలుకకుండుట వింతలలో వింత. లేక, శివకవులు నన్నయ భారతమును స్వచ్ఛదేశకవితగఁ బరిగణింప రేమో?

నన్నెచోడుఁడు పొగడిన 'దేశి' చాళుక్యవాఙ్మయ మేది? చాళుక్యరాజశాసనములలో నన్నయకు ముందే తెలుఁగులోఁ బద్యరచన కన్పించుచున్నది. యుద్ధమల్లుని బెజవాడశాసనము, పండరంగుని యద్దంకి శాసనము మున్నగునవి నిదర్శనములు. ఈ శాసనములలోఁ దరువోజలు మధ్యాక్కరలు సీసములు, నాటవెలఁదులు తేటగీతులు కన్పించుచున్నవి. యతిప్రాసాత్మకమైన తెలుఁగు ఛందస్సు, సంస్కృతములోని ఛందస్సుకంటె విలక్షణమైనవి. వీనిలో సంస్కృతగురుత్వమునకంటెఁ దెనుఁగుఁదనమే యెక్కువ ఇవిగాక తుమ్మెద పదములు వెన్నెల పదములు, రగడలు, ద్విపదలు మున్నగు పదవాఙ్మయ మెంతయో యుండెడి దని పండితారాధ్యచరిత్రి మున్నగు గ్రంథములవలన నూహింప వచ్చును. ఇట్టి వాఙ్మయవికాస మంతయు "దేశి" శాఖకుఁ జెందినదే గాని "మార్గ" కవితావర్గమునకుఁ జేరినది గాదు. చాళుక్యరాజ్యారంభము నుండి తెలుఁగు వాఙ్మయము క్రమపరిణామవికాసబద్ధమైయున్నది.

నన్నెచోడుని కుమారసంభవములోని చాళుక్యరాజుల దేశికవితా సేవాప్రశంస యీ వాఙ్మయవికాసమున కంతటికి నన్వయింప వలెనేమో!

చాళుక్యులలోఁ జివరిరాజు రాజరాజనరేంద్రుఁడు. ఆకాలము నాటికి నన్నయ మహాకవి మహాభారతరచనకుఁ బూనుకొనెను. నన్నయమహాకవి ప్రయోగించిన భాష—తత్సమకాలీనశాసనభాషతోఁ బోల్చి చూచినచో, "విపులశబ్దశాసనుఁడ"ను బిరుదునకు సార్థకత గోచరించును. నన్నయ ప్రయోగించిన భాషలోఁ జాలవఱకు సంస్కృతమర్యాదలు జాతీయములు యథాతథముగఁ దెనుఁగులోఁ గనిపించును. నన్నయ వాడుకలోనున్న శబ్దజాలమును సంస్కరించి వాడినాఁ డని చెప్పవచ్చును. సంస్కృతవ్యాకరణవిరోధప్రయోగములు శివకవుల కావ్యములలో నాటి శాసనములలోఁ గన్పించినట్లు, నన్నయభారతమునఁ గన్పింపవు. నన్నయకాలములోని శాసనము లందలి భాష యథాతథముగ గాక, సంస్కారరూపమున నన్నయకావ్యమున గోచరించుచున్నది. నన్నయ సల్పిన యీ శబ్దసంస్కారమే యతనికి 'విపులశబ్దశాసనుఁడ'ను బిరుదును సంపాదించిపెట్టియుండును. నన్నయ భారతమున నితివృత్తము, భాష, ఛందస్సు సంస్కృతప్రభావమునకు లోఁబడినవే. నిర్ణీతనియమబద్ధమైన యతని సంస్కారపద్ధతి 'మార్గ' కవితయే యని శివకవుల మతము గావచ్చును. అందుచేతనే యాదికవియైనను నన్నయమహాకవిని శివకవులెవ్వరు స్మరింప లేదు. దేశభాషాకవితాప్రపంచమున నగ్రగణ్యమైన నన్నయభారతమును శివకవు లెల్లరు స్మరింపకపోవుటకుఁ గారణము భిన్నమతప్రవృత్తియే కాక భిన్నసారస్వత దృక్పథము గూడ నని చెప్పవచ్చును.

సంఘమున నొక ప్రత్యేకమతమును వెలయించినట్లే శైవులు వాఙ్మయమునఁగూడ నొక స్వతంత్రసారస్వతోద్యమమును నెలకొల్పినారు. "గద్యపద్యసంస్కృతభూయిష్ఠప్రబంధరచన, మానుగా సర్వసామాన్యంబు గా ద"ని పాల్కురికి సోమనాథుని ప్రవచనము. ఈ మాట నన్నయ నెత్తిపొడుపు. తిక్కన తన తొలికావ్య మగు నుత్తరరామాయణమును నిర్వచనముగనే రచించెను.

"ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాదిప్రాసనియతిఁ
దప్పకుండగ ద్విపదలు రచియింతు"

ఇది పండితారాధ్యచరిత్ర యవతారికలో సోమనాథుని ప్రతిజ్ఞ. తెలుఁగు కవితకు ముఖ్యలక్షణములు యతిప్రాసలు. తెలుఁగు ఛందస్సునకుఁ బ్రత్యేకత నిర్ణీతగురులఘుపరంపరాను పూర్విసంకలిత మగు గణములు గాక మాత్రాబద్ధము లగు గణములు. తెలుఁగు యతి సంస్కృతయతికంటె విశిష్టము. సోమనాథుఁడు, 'ప్రాసము, యతి' 'దేసి'గా నిలిపి, యని యర్థవంతమైన వాక్యము ప్రయోగించెను. విరామపూర్వకమైన సంస్కృత యతి గాక వర్ణసాజాత్యపూర్వకమైన తెలుఁగు యతినే పాటింపవలెను. తెలుఁగు నుడికారపు నిసర్గతను గుర్తించి తదనుగుణముగ వ్రాయుట 'దేశి'కవిత. 'దేశి'కవితాశాఖ సంస్కృతవాఙ్మయ మర్యాదకు లోఁబడదు. ప్రాసనియతి సంస్కృతవృత్తములలో లేదు. అది తెలుఁగు కవితకుఁ బ్రత్యేకభూషణము. నన్నయ సంస్కృతములోని ఛందస్సులను గ్రహించి వానికిఁ దెనుఁగు

యతిప్రాసలు చేర్చి భారతములో వాడెను. కాని శుద్ధదేశికవితా వాదులగు సోమనాథాదుల కిది నచ్చలేదు. వారు శుద్ధదేశీయమైన ఛందస్సులో ద్విపదలో వ్రాసినారు. మాత్రాగణబద్ధములైన పద్యములు జాతులు. "జాతులు మాత్రానుసంధానగణవినీతులు గాన" మాత్రాగణబద్ధమైన ద్విపదలో శుద్ధదేశిగా కావ్యము లల్లెద నని సోమనాథుని ప్రతిజ్ఞ.

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవార"

"ఉరుతరగద్యపద్యోక్తులు"—నన్నయ వని గుర్తింప వచ్చును! శివకవుల కాలమున కవి సర్వసామాన్యము గాక పోయినవి. భాషాప్రయోగమున శివకవులు ప్రతిపాదించిన క్రొత్త సూత్రము "జానుతెనుఁగు." "సరళముగాఁగ భావములు జాను తెనుంగున నింపు పెంపుతోఁ బిరిఁగొన"—వ్రాయవలె నని కుమార సంభవ పీఠికలోనిమాట. సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున "జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు" అని ప్రతిపాదించి నాఁడు. సోమనాథుఁడే వృషాధిపశతకమున జానుతెనుఁగున కుదా హరణ ప్రాయముగ వ్రాసిన పద్యము.

"బలుపొడ తోలు సీరయును బాప సరుల్ గిలుపారు కన్ను వె
న్నెల తల సేదు గుత్తుకయు నిండిన వేలుపుటేరు వల్గు పూ
సలు గల జేని లెంక పని జాను తెనుంగున విన్నవించెదన్
వలపు మదిం జలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా!"

ఈ పద్యమునుబట్టి జాను తెనుఁగన నచ్చతెనుఁగని కొంద ఱర్థము తీయుచున్నారు. కాని, యీ నిర్వచనమునకుఁ గుమార సంభవమే గాక యా సోమనాథుని బసవపురాణము పండితారాధ్య చరిత్రముగూడ నపవాదములే. నన్నెచోడుఁడు సోమనాథుఁడు గూడ వారి జాను తెనుఁగు కావ్యములలో సంస్కృతసమాసములు కుప్పతిప్పలుగఁ బ్రయోగించినారు. మఱికొందఱు జాను తెనుఁగనఁ దేటతెనుఁగని యర్థము నిచ్చుచున్నారు. 'జాను తెనుఁగు' 'తేట తెనుఁగు'—మాటల రెంటిని విడివిడిగా సోమ నాథుఁడే ప్రయోగించినాఁడు. జాను తెనుఁగు, తేట తెనుఁగు అనగా సులభముగా నర్థమగు తెనుఁగు—అని సూర్యరాయనిఘంటువులో వివరణము గలదు. కాని, శివకవుల జాను తెనుఁగు కావ్యములలో సులభగ్రాహ్యములు గాని సంస్కృతసమాసములే కాక, కన్నడభాషాపదములు శ్రుతిస్మృతివాక్యములు పెక్కులు గలవు

శివకవులు వాడిన భాషకుఁ గొన్ని ప్రత్యేకధర్మములు గలవు. వారి దృష్టిలోఁ దెనుఁగు భాషను శాసించుటకు సంస్కృత వ్యాకరణమునకు హక్కు లేదు. తెలుగు భాషలో సహజసిద్ధముగ వాడుకలో నున్న పదములు, సంస్కృతవ్యాకరణసమ్మతములు గాకపోయినను, శివకవులు కుప్పతిప్పలుగ వాడినారు.

"నల్లవో బసవన్న నందీశమూర్తి"
"నల్లవో బసవయ్య ముల్లోకవంద్య"
"కట్టితి సర్వాంగ కచ్చడం బనుచు"
"శ్రీమహాదేవుఁడన్నామంబు లున్న
వేమహి నెటువంటి యితరవేల్పులకు"

— బసవపురాణము

ఇట్లే "నిత్యపడి, పునమీశ, భక్తకూటువలు, సద్భక్త సమూహి''. ఆ కాలపు తెలుఁగు శాసనములలో, నంతకుముందు శాసనములలోఁ గూడ నిట్టిసమాసములు గానవచ్చుచున్నవి. శివకవుల ప్రయోగసరణీ సమకాలీనశాసనములలోఁ గన్పించుటచే నట్టి పదము లా కాలమునఁ దెనుఁగు నాలుకలపై నలుఁగుచుండెడి వని యూహింపవచ్చును. సహజసిద్ధముగఁ దెనుఁగువారు వాడు పదములు కావ్యములలో వాడుకొనవచ్చు నని వారి యాశయము. జాను తెనుఁగన నిసర్గమైన తెనుఁగు. అందు సంస్కృతపదము లుండ వచ్చును. ఆ సంస్కృతము సంస్కృతపు రీతితోఁగాక తెలుఁగు నుడి ననుసరించి చేరును. శివకవులు నన్నయ 'విపుల శబ్దశాసన'త్వము నంగీకరింప లేదు. శివకవులు, నన్నయ "గద్య పద్యప్రబంధధూయిష్ఠరచన, యుదుతరగద్యపద్యోక్తులు, శబ్ద శాసనత్వము'పైఁ బూర్వపక్షమును నెలకొల్పి, సర్వతంత్రస్వ తంత్ర మగు నూత్నసారస్వతోద్యమమును నెలకొల్పిరి. నన్నయ యారంభించిన యాంధ్రమహాభారత మసంపూర్ణముగ నిలిచి పోవలసి వచ్చినది.

శివకవులు ప్రతిపాదించిన సారస్వతోద్యమము సార్వజనీనము గాలేదు. సాహిత్యప్రపంచమున భిన్నవాదములు చెలరేగినవి. శైవయుగములోఁ జిట్టవివర నుద్భవించిన కావ్యము రంగనాథరామాయణము. రంగనాథరామాయణకర్త శివకవులను బూర్తిగ ననుసరింప లేదు. ఛందస్సు శుద్ధదేశి యగు ద్విపదయే గాని యితివృత్తము సంస్కృతరామాయణమే. భాషాప్రయోగ స్వాతంత్ర్యమునుబట్టి చూచినను శివకవులవలె విశృంఖలవిహారము సలుపలేదు. ఈ కావ్యము వీరశైవమత క్షీణదశను సంస్కృత

సాహిత్యగౌరవపునరుద్ధరణాభిమానమును వ్యక్తము చేయుచున్నది. రంగనాథరామాయణము తిక్కన మహాయుగమునకు వేగుఁజుక్క. ఇట్టి స్థితిగతులలో నన్నయ యారంభించిన మహాభారతమును బూరింప సాహసించు మహాకవి లేకపోయెను. ఈ యుగమందే వేములవాడ భీమకవి సాహసించి భారతమును బూరింప సమకట్టియు విఫలుఁడై యుండవచ్చును. వేములవాడ భీమకవి విరాటపర్వమునుండి కొన్నిపద్యములు లక్షణగ్రంథములం దుదాహరింపఁ బడినవి. భారతమువంటి మహేతిహాసరచనకుఁ గవులందఱు నధికారులు కారు. అదియొక సామాన్యకవి కసాధ్యమైన పని. ఒక సారస్వతపరిషత్తు లేదా పరిషత్తు వంటి యొక మహాకవి సాధింపవలసిన కర్తవ్య మది. రాజరాజనరేంద్రుని తరువాత వేంగిదేశమునకు వీరవిజయాదిత్యుఁడు పరిపాలకుఁ డయ్యెను. రాజరాజనరేంద్రుని యాశ్రయమునఁ బెంపొందిన 'రాజమహేంద్ర కవీంద్రసమాజమున'కు రాజాశ్రయము తప్పినది. ఇక వ్యక్తులెవ్వరు భారతరచనకుఁ దలపెట్టలేదు. అంతలో శివకవులు చెలరేగి, దేశికవిత, జాను తెనుఁగు వాదములతో నన్నయ భారత వాఙ్మయముపై దండెత్తిరి.

రెండుశతాబ్దుల తరువాత నెల్లూరుమండల ప్రభువైన మనుమసిద్ధిమహారాజునకు మంత్రిత్వము నెరపిన తిక్కనమహాకవి తిరిగి మహాభారత రచనకుఁ బూనుకొనెను.

"అల్పాక్షరంబుల ననల్పార్థరచన", జాను తెనుఁగు, దేశికవిత" "ద్విపదరచన" యను సిద్ధాంతరాద్ధాంతములే గాని వాని యంత సత్త్వ మెట్టిదో, యవి యెంతవర కనుసరణీయములో

చూపిన మహాకవిమాత్ర మంతవర కెవరు లేకపోయెను. అసలంతరార్థము గుర్తింపక, పృథావాగ్వివాదములలోఁబడిన సారస్వతోపాసకులందఱు, నేకోన్ముఖము చేసి యన్ని వాదములలోఁగల సత్యమును సమన్వయించి చూపిన సారస్వతాచార్యుఁడు తిక్కన. నిజమున కుత్తమసాహిత్యగౌరవమౌచిత్యపరిపాలన, భావనాపాటవము రసప్రతీతిపైనను, గావ్యమునకంగభూతములైన జాతీయము పలుకుబడి నుడికారముపైన నాధారపడియుండును. వీనిలో నే యేకదేశమునో గ్రహించి, ఛందస్సుపైననో, భాషపైననో యధికనిష్ఠ చూపిన కవికి సాహితీసృష్టిలో నేకదేశసిద్ధి మాత్రమే లభించును. అట్లుగాక, పరిపూర్ణసిద్ధి బొందిన మహాకవి తిక్కన. ఈ సత్యమునే తిక్కన తన తొలికావ్యమైన నిర్వచనోత్తరరామాయణపీఠికలో నాచార్యుఁడై కవితాలోకమున కుపదేశించినాఁడు. ఈ ప్రబోధము సమకాలీనసాహిత్యమీమాంసలపై విమర్శ. శివకవులు ప్రతిపాదించిన 'జానుతెనుఁగు, దేశికవిత, యల్పాక్షరంబుల ననల్పార్థరచన, మున్నగు సిద్ధాంతములపై నిర్వచనోత్తరరామాయణపీఠిక సాహిత్యసమీక్ష. అంతమాత్రమే గాదు. చిరానుభవముచేఁ దాను గళాధర్మము లని గ్రహించిన సూత్రములఁ దిక్కన యాంధ్రసారస్వతజగత్తున కుపపాదించినాఁడు. నిర్వచనోత్తరరామాయణపీఠిక యొక్కటే తిక్కనకుఁ దెనుఁగులో నాలంకారికసంఘమున నగ్రగౌరవము నందింపఁగలదు. ఆ నాఁడు తిక్కనకుఁ గవిగానే గాక కవితాశిల్పవేత్తగా

గూడఁ బ్రఖ్యాతిగలదు. సమకాలీనసాహిత్యవాదములపై సుకుమారనిశితవిమర్శ, నిర్వచనోత్తరరామాయణపీఠిక యను విషయము, శివకవుల కావ్యపీఠికలు, తిక్కన కావ్యపీఠికతోఁ బోల్చి చూచినచో స్వయంవ్యక్తము కాగలదు.

"సరళము గాఁగ భావములు జాను తెనుంగున నింపు పెంపుతోఁ
బిరిఁగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగన్"

కుమారసంభవములోని పై పద్యములోని, 'ఇంపుపెంపు' నకుఁ దిక్కన నిర్వచనోత్తరరామాయణపీఠికలోఁ బూర్వపక్షమును నెలకొల్పుచు—

"ఎట్టి కవికైనఁ దనకృతి యింపుఁ బెంపఁ
జాలుఁ గావునఁ గావ్యంబు సరసులైన
కవుల చెవులకు నెక్కిన గాని నమ్మఁ
డెందు పరిణతి గల్గు కవీశ్వరుండు."—అని వ్రాసినాఁడు.

"జాత్యముఁగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁజొన్ప వాక్యసాం
గత్యము చేయుచో నయిన గద్యము తోడుగఁ జెప్పి వెట్ట దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్
ఖ్యిత్యనురూప మంచు నిడ సూరుల కివ్విధ మింపుఁ బెంపదే"

—నిర్వచనోత్తరరామాయణము

"జాత్యముఁ గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప"— అను ప్రతిజ్ఞ శివకవు లధిక్షేపించిన "సంస్కృత ఛాయిష్ఠరచనకు సమాధానము". వాక్యసాంగత్యము చేయుచో నయిన గద్యము తోఁకుగఁ జెప్పిపెట్ట"— అను వాక్యము శివకవుల 'ఆరూఢగద్య పద్యరచనకు' 'ఉరుతర గద్యపద్యోక్తులకుఁ' బ్రత్యుత్తరము. 'ప్రాసము ప్రకారము వేఱగు నక్షరంబు శ్రుత్యనురూప మంచు నిడ', అనునది శివకవుల నెత్తిపోడుపు.

సర్వజ్ఞభక్తివిరహితు
డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ డేటికిఁ గొఱమే.
—శివతత్త్వసారము.

ప్రాసమున శివకవులు కతిపయహల్సామ్య మనుసరిం పడిరి.

అంచవడ సంస్కృతిశబ్దము
తెలుఁగు బడి విశేషణంబు తేట పడంగాఁ
బలుకు నెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్.

అని నిర్వచనోత్తరరామాయణపీఠికలోఁ దిక్కన పేర్కొనిన వాక్యదోషములుకూడ శివకవులపైనఁ బరోక్షవిమర్శమే. తిక్కన నిర్వచనోత్తరరామాయణపీఠికలో "పలుకుల పొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాత వడ్డ మాటలఁ దప నేర్పు చూపి" అని కుకవినింద సల్పినాఁడు. తిక్కన పదప్రయోగకౌశల మొక లలితకళ. ఈ కళావైదగ్ధ్యమున కతని రెండు కావ్యములు

ఉదాహరణములే. తిక్కన 'రసభంగము' గర్హించి పదముల కూర్పుపైఁ దన యభిప్రాయము వెల్లడించెను.

"లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలు గా
హాళ సంధించిన విధమున నమరఁగ వలయున్"

అలఁతి యలఁతి తునియలు పూర్వాపరముగఁ గాహాళ నిర్మించినట్లు పదములను బ్రయోగింపవలె నని తిక్కన యాదేశము. అటు ప్రాత వడ్డ మాటలు గాని, యిటు వ్యవహారమున నలిగిన మాట లన్నియు యథాతథముగఁ బ్రయోగార్హము లని తిక్కన చెప్పలేదు. కవితార్థమును గంధవహుఁడు పుష్పదళంబుల సౌరభ మిచ్చు చందమున వికసింపఁ జేయవలెనని తిక్కన యాశయము.

నిర్వచనోత్తరరామాయణకథ యయోధ్యా వర్ణనముతో నారంభించుచున్నది. ఈ వర్ణనము సంస్కృతరామాయణములో లేదు. సంఘమునకు సారస్వతమునకును బింబప్రతి బింబభావము గలదు. సాంఘిక వాతావరణము సాహిత్యసృష్టికి రూపకల్పనలు దిద్దును. ఈ దృష్టితోఁ జూచినచో నిర్వచనోత్తరరామాయణములోఁ దిక్కననాటి యాంధ్రసాంఘికవృత్తముల నక్కడక్కడ ఛాయా మాత్రముగ గుర్తింప వచ్చును.

తిక్కన యయోధ్యాపురవర్ణన యొక యాదర్శప్రాయమైన యాంధ్రమహానగరవర్ణన. పదుమూడవ శతాబ్దిలో నాంధ్రదేశములో శత్రుదుర్భేద్యమైన యొకకోటను దిక్కన రామాయణ

కాంమునాటి యయోధ్యాపురికిఁ జేర్చినాఁడు. ఆ విశాలపరిఖ, యున్నతవప్రగోపురములు, బహురత్నోత్కీర్ణసాలభంజికలు రత్న ఖచితహర్మ్యరేఖలు, మత్తేభగర్జితస్ఫారరవంబులు బృంహితనాద ములు, పవనజవనాశ్వములు— ఇవి యానాటి కోటలలోఁ దిరు గుచుఁ దిక్కున స్వయముగఁ జూచినవే. కావంసిన వాల్మీకి యొక్క ముక్కగూడ సంస్కృతరామాయణమునఁ జెప్ప లేదు. ఇంతే కాదు.

మవ్వంపు మేనుల జవ్వసంబుల కింపు
మిగిలిన చెయ్యుల మెఱుఁగు పెట్ట
నల్లన మధురంపు సల్లాపరచనకు
లేఁత నవ్వున నునుఁ బూఁత పూయ
నిడు వాలుఁ గను దోయి నిసుపారు కాంతికిఁ
గలికి క్రేఁగన్నుల నలువు మిగుల
లలితంబులగు చిత్తముల చతురతలకు
సరసంపు నడవడిఁ దెరలు పుచ్చ
పెరపు గల్గి మనోభవు వీరరసము
నిరతముగ నేర్పు వాటించి కరువు గట్టి
పోసి చేసిన రూపుల పోల్కి వార
వనిత లొప్పుదు రప్పురవరము నందు.

వాల్మీకి దేవలోకములో రంభాదివేశ్యలను గూర్చి చెప్పి నాడు గాని భూలోకములో వేశ్యలగూర్చి, యందులో నయోధ్యా పురీవేశ్యలను గూర్చి ప్రస్తావింప లేదు. మొన్న మొన్నటివర

కాంధ్రదేశ మంతటఁ దిక్కన వర్ణించిన వేశ్యలుండెడివా రని వేఱుగఁ జెప్ప నక్కర లేదు.

ఘనసారకర్పూరపరిమళములు చందనగంధములు గాలి వీపులో గుబాళించు చుండెడివి. గంధవహుని పరిమళములోఁ దిక్కన యా నాటి విటుల రసికతను మనోజ్ఞముగ వర్ణించినాఁడు, ఈ విటులు, సంస్కృతరామాయణము నందలి యయోధ్యలో, నేటి తెలుగునాట లేకున్నను, దిక్కన నాడును, దర్వాత విద్యా నగరవీథులలో గంధవహునితోఁ గలసి మెలసి తిరుగు చుండెడి వా రనుట తథ్యము. యువతుల శృంగారము తిక్కన లలితముగ వర్ణించినాఁడు. ఆ యువతు లుత్తరదేశ మందలి యయోధ్యాపుర వాసినులు కారు. ఆంధ్ర యువతులేనాడు మేలి ముసుఁగు నెరుఁగరు. "పయ్యెద దూలించుట"యే నాటికి నేటికిఁ దెలుఁగు పడుచుల యనవరతశృంగారము. చందనగంధములు మైపూతలు నవతంసమంజరులు నాడు గలవు. ఆ నాడు మెలతల చెక్కుం మెఱుఁగు వింతగ నవతంస మంజరులు గాలిలోఁ గదలు చుండెను. "శుకపికసంకులత్వమున సుందరసాంద్రలతాంతసల్లవ ప్రకరబహుచ్ఛవిం బురవరంబు విహారవనంబు లొప్పు" నట. ఆ విహారవనము లలనాటి యయోధ్యలోఁగలవో లేవో చెప్ప లేము గాని, తిక్కననాటి తెలుఁగు రాజధానులలోఁ గల వని చెప్ప వచ్చును.

ఉపవనములను వర్ణించునపుడు తిక్కన యుప్పొంగి రచించెను. మత్తాళి పుష్పితనవలతాపుంజములోపల విహరించు చుండెడిది. ఉన్మదకలకంఠకుమారుఁడు సహకారపల్లవసమితి కదల్చు చుండెడివాఁడు. మందమారుతము లా పుష్పవనములలో

విహరించుచుండెడివి. ఉద్యానవనములలో లతామండపము లుండెడివి. రాజాంతఃపురములలో నుద్యానవనము క్రీడారంగము. సీతారాముల వనవిహారవర్ణనమును మూలములోఁ గంటెఁ బెంచి తిక్కన వర్ణించుటఁబట్టి చూచిన నాంధ్రరాజుల రాణుల కేళీవిలాస విహారములకు నుద్యానవనములే యాటపట్టు లని తెలియుచున్నది. ఇట్లే జలక్రీడలు. ఉపవనములలో జలక్రీడలకు సుందరతటాకము లుండెడివి.

సీతకు మూలములోఁ జెలికత్తెలు కన్పింపరు. నిర్వచనోత్తరరామాయణమున లెక్కకు మిక్కిలి చెలికత్తెలు గలరు. ఈ చెలికత్తియ లందఱు తిక్కన మహాకవి సీతకు ధర్మముగ నొసగిన పరివారము గాదు. ఆ నాఁడు తెలుఁగు రాణులకు అంతఃపురవాసినులైన పరిచారికాబృందము లెక్కకు మించి యుండెడిది. అంతఃపురోద్యానవిహారజలక్రీడాదులు తిక్కన కాలమునాటి తెలుఁగు నేలనే గాక తరువాత విద్యానగరసామ్రాజ్యమునఁ గూడఁ గల యాచారములు. ఈ విషయము విద్యానగరము సందర్శించిన విదేశయాత్రికుల వ్రాతల వలనఁ గూడఁ దెలియుచున్నది. తిక్కన పురవర్ణనము చదివిన తర్వాత ఓరుగల్లు కోటలోని నేటి శిథిలావశేషములను జూచి నప్పుడు పతిత స్వప్నములోఁ జూచిన దానిని సరిపోల్చు కొనుచున్నట్లు విస్మితుఁడగును.

రామాయణములో కుబేరుని దూత రావణు సందర్శించుట గలదు. కుబేరుని దూత సభలో రావణునిజూచి ''జయ'' అని పలికినాఁడు. సమయోచితముగ రాయబారమును నెరపినాఁడు. ఈ ఘట్టములో తిక్కన పంపిన దూత యక్షదూత కాదు. తెలుఁగు దూతయే. అతఁడు చనుదెంచి ముందఱ విభీషణుని జూచినాఁడు.

విభీషణుఁడు 'వచ్చిన కార్యమారసి' 'దానవేశ్వరుని' 'చెచ్చెర గానిపించి' నాఁడు. ఎడ సేయక అప్పుడు దూత 'వినీతవేషుఁడై చొచ్చి,' 'ధరాతలం బురము సోకగ నానతుఁడై యుపాయనం బిచ్చి, కరప్రదర్శితమహీ సంయుచితోపవిష్టుఁ డై నాఁడు. దూతకు వినీతవేషము తిక్కన క్రొత్తగ వేసినదే. దూత రాజు గారి కంటె ముందు రాజసోదరుని దర్శింపవలెను. అతఁడు దూతను రాజునకు సమర్పించును. దూత ధరాతలము సోకగ సాష్టాంగదండప్రణామ మాచరించి రాజుగారు చేసన్నతోఁ జూపిన చోటఁ నొదిగి కూర్చొనవలెను. ఇవి తిక్కన కాలము నాటి రాజాస్థానమర్యాదలు.

మూలమున విష్ణుదేవునకు రాక్షసులకు మధ్య జరిగిన ఘోరయుద్ధములు కలవు. తిక్కన తెలుఁగులో నా యుద్ధములను వర్ణించినాఁడు. అందలి భటులు దేవతలును గారు రాక్షసులును గారు. వారు

"కూలిన వారిఁ జూచి వెడ గొంకిన మెచ్చర మున్ను వెన్నుగా
నేలకుఁ జొచ్చువారుఁ దమ నెయ్యుర కడ్డము వచ్చువారు ను
క్కోలయి నెప్పు లేక తమకించి పయిం బడి నొచ్చువారు ముఞ్ఞా
వాలిన మచ్చరం బెసఁగ వారణ సేయక ప్రచ్చువారునై"

పోరాడినారు. ఇట్టివారు సంస్కృతమూలమున లేరు. "ఉక్కోలయి నెప్పు లేక తమకించి పయింబడి నొచ్చువారు"ను గల రట. శక్తి; యుక్తి; కత్తి, కలము తిక్కన నాటి తెలుఁగు భూమిలో వియ్యమందినవి. యుక్తి లేని శక్తి, కత్తి నెరుగని కలము నాటి వారికి నచ్చవు.

కుబేరుఁ డోడిపోయిన పిమ్మట యక్షులు చెల్లాచెదరై కాందిశీకు లయిరి. ఓటమి విషయము సంస్కృతరామాయణమునఁ గలదు. గాని "కాందిశీకుల" వర్ణనము మాత్ర ముండుఁ గానరాదు. నిజమునకు కాందిశీకు లయినది యక్షప్రజలు కాదు. అక్కన కాలము నాటి రాజు లన్యరాజుల జయించి నప్పుడు విరోధిరాజధానులఁ దగుల పెట్టి, తదాశ్రితులఁ బారఁద్రోలు చుండెడివా రని సమకాలీనశిలాశాసనములు సాక్ష్యము చెప్పు చున్నవి. ఒకవేళ శిలాశాసనములు లేకపోయినను మనమీ విషయమున చారిత్రకముగ నంధకారసముద్రమున మునిగిపోయెడివార మనుకొన నక్కఱ లేదు. అద్దములో వలెఁ బ్రతిఫలించి, యలనాటి కాందిశీకుల కష్టములు నిర్వచనోత్తరరామాయణమునఁ గన్పించు చున్నవి.

కాలుకొన్నంతయుఁ బాఱి
కనుకని దెసలందుఁ గాను పడియుఁ
బాఱఁ జాలక ముట్టఁ బడి జాడఁదప్పంగఁ
దొలఁగి పెన్గొందులఁ దూఱఁ బడియుఁ
దలలు జీరయును గంపలు పట్టికొని గాసి
గా ప్రుగ్గు టడవులఁ గాటు పడియుఁ
గాశుఁ జెయుఁగా నెట్టకేలకుఁ
జలు దెక్కి లోయలఁ జొంగఁ బడియు
బయలి మొనలు గోట కట్టిన పెల్లున
పీటి ప్రజయు నొక్క మూపు యురలఁ
దెరలి యిద్దొక్క తెరువునఁ బోవక
యాకులతను గాందిశీకులై రి.

రాజులన్యరాజ్యములు జయించి నపుడు తిక్కన కాందిశీకుల కష్టములు కనులార గాంచి యుండును. ఈ వర్ణన యేతదనుభూతి పరిణామమే. నాటితెలుఁగువారి కష్టము లన్నియు పాపము రామాయణకాలమునాటి యక్షులకుఁ గూడఁ దెచ్చిపెట్టినాఁడు మంత్రి తిక్కన!

"పయనము చాటఁబంచి సులభంబుగఁ బూరియు నీరు వంట కట్టియలును గల్గు చోట్లను గడింది మగల్ దగు నుక్కళంబుగా భయమను పేరు లేక నిరపాయముగా విడియించుచున్" రావణుఁడు సేనల నడపెను. ప్రపంచము నంతయు జయించుచు నాకాశమార్గమునఁ బోవుచు యథేచ్ఛాగమన శీలులగు రాక్షసులు గాదు పూరి, నీరు, వంట కట్టెలు గల చోట్లు తంటాలు పడి వెదకి విడిసినది. వారు తిక్కనకాలమునాటి తెలుఁగు భటులే.

'చామరగ్రాహిణీకరచారుకటకరశ్మిరాజినీరాజితుండు' 'నృపకోటియు, మంత్రికదంబకంబు,' 'కవీంద్రులు, వందిజనంబు లిష్టభృత్యులు మొదలైన వారలు' బలిసి ముదంబునం గొలువ రామభూవిభుండు కొలువు దీర్చినట్లు నిర్వచనోత్తరరామాయణ వర్ణనము. ఈ వర్ణనకు మూలము తిక్కన "అనుదినము" చూచిన మనుమసిద్ధి కొలువుకూటమే.

పౌరజానపదాభిభాషణంబులు దగ
నమ్మియ్యె తెరంగుల నాదరించు
నుత్తమహయదంతిసత్తమరథరత్న
ములు సూచి సపరణ లలవరించు
యోధవీరప్రతికారోక్తి నిరూఢస
ముద్ధతి కెడఁదలో నుల్ల సిల్లు

నిఖిలవిద్యాగమనిపుణవిద్వజ్జన
సంభావనంబుల సంతసిల్లు
ననుదినంబు నిట్టు లభిమతబహువిధ
సముచితప్రవర్తనము లొనర్చు
చతివిభూతినుండి కతిపయదినములు
వోపుటయును రామభూవిభుండు.

సంస్కృతరామభూవిభుఁ డీ రాజ్యకార్యములు తీర్చినట్లు వాల్మీకి చెప్పలేదు.

నిర్వచనోత్తరరామాయణమున సంస్కృతమూలములోఁ బ్రధానకథతో సంబంధము లేని యవాంతరగాథల నన్నిటిని తిక్కన వదలెను. సంస్కృతోత్తరరామాయణము మహారణ్యము. నిర్వచనోత్తరరామాయణము ఉద్యానవనము. చంద్రోదయచంద్రికావర్ణనములు, వనవిహారపుష్పాపచయవర్ణనములు, నాంధ్రవాఙ్మయమున తిక్కన లేఖిని తొలిసారి చిత్రించినవి. అర్వాచీనప్రబంధోదయమునకు నిర్వచనోత్తరరామాయణము వేగుఁ జుక్క. తిక్కన ప్రబంధకవులకు వర్ణనాత్మకసన్నివేశముల మేలు బంతులు దీర్చి దిద్దెను.

చిత్తజు చిగురులం జిత్రంబుగా నిడ్డ
లలితతమాలపల్లవ మనంగ
రతిపు మాణిక్యదర్పణమున నూనిన
కమనీయ మృగమదకణ మనంగ
వెడవిల్తు లీలారవిందంబు మీఁదికిఁ
దివుటమై యరిగిన తేఁటి యనఁగ

వలరాజు సిందూరతిలకంబులోఁ జెలు
వొందు కాలాగరుబిందు వనఁగ
నుదయరాగమహిమ నుజ్వలంబైన బిం
బంబు నడుమ లాంఛనంబు చెన్నుఁ
జేయఁ బూర్వశైలశిఖరదేశంబున
నిందుఁ దొప్పె భువన మెలమి మిగుల

తిక్కన 'ఉత్తరరామాయణ' మేల యారంభింపవలెను. పూర్వరామాయణమును విడుచుటకు హేతు వేమి? ఈ ప్రశ్నం నూహించి, సమాధానము తిక్కనయే చెప్పెను.

ఎత్తటి నైనను ధీరో
దాత్త నృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మగుట
నుత్తరరామాయణోక్తియుక్తుఁడ నైతిన్.

వెనువెంటనే తిక్కన మరియొక పద్యమున

సారకవితాభిరాము గుంటూరు విభుని
మంత్రి భాస్కరు మత్పితామహునిఁ దలఁచి
యైన మన్ననమెయి లోక మాదరించు
వేఱ నా కృతిగుణములు వేయు నేల? — అని

పితామహునిఁ బ్రశంసించెను. అయిన సారకవితాభి రాముఁడైన యీ మంత్రి భాస్కరుఁ డెవరు? అతని కృతు లెవ్వి? తిక్కన మాటలనుబట్టి యతఁడు మిక్కిలి సుప్రసిద్ధుఁడై యుండవలెను. భాస్కరరామాయణకృతికర్తయైన భాస్కరుఁడే తిక్కన పితామహుఁడని కొంద ఱూహించుచున్నారు. అట్లయిన

నుత్తరరామాయణప్రసక్తివచ్చినపుడుగూడ ఎత్తటి నైనను ధీరోదాత్తనృపోత్తముఁడు రాముని చరితము సంభావ్య మగు నని పల్కెను గాని పితామహుని పూర్వరామాయణరచనను గూర్చి యేమియుఁ జెప్పక మౌనము వహించెను. దీనినిఁబట్టి గుంటూరి విభుఁడైన మంత్రిభాస్కరుఁడు తిక్కన పితామహుఁడు సరసకవితాభిరాముఁడై యాకాలమునఁ బేరొంది యుండ వచ్చును గాని, రామాయణమును వ్రాయలే దని చెప్పక తప్పదు.

పూర్వరామాయణకీర్తి తాతగారికి, ఉత్తరరామాయణ శ్రీమదాంధ్రభారతకీర్తి మనుమనకుఁ గట్టిపెట్టుటచేఁ గథ రక్తి కట్టవచ్చును గాని సత్యము మాత్రము కాఁజాలదు.
కేతనదశకుమార చరిత్రలో

'మనుమసిద్ధిమహేశసమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.'

అని తిక్కనను బ్రశంసించెను. తిక్కన మనుమసిద్ధి మహీపతి రాజ్యంబునఁ గులక్రమాగతం బగు మంత్రిపదవి యం దుండె ననియు

"అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలి శంఖములును
గంబగట్లు భూమి కానిక గాఁగ బెం
పెసగు రాచ పదవు లెల్లఁబడసె."

ననియుఁ గేతన వ్రాసెను.

తిక్కన యుభయకవిమిత్రుఁడు.

'అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు తాల్చెన్'

అని కేతన దశకుమారచరిత్రమునఁ జెప్పెను.

తిక్కన మనుమసిద్ధి మహారాజునకు మంత్రి. ఆస్థానకవి. ఉభయకవిమిత్రుఁడు. అతఁడు తన నిర్వచనోత్తరరామాయణము మనుమసిద్ధి మహారాజున కంకిత మిచ్చెను. మహారాజునకుఁ గృతి నిచ్చుట యాశ్రితకవి కవశ్య కర్తవ్యము. కాని, మహాకవి తిక్కన మనుమసిద్ధికిఁ గృతి నిచ్చుట కా సంబంధము మాత్రమే కారణము గాదు.

ఏ నిన్ను మామ యనియెడి
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీ నర్హుఁడ వగు దనినను
భూనాయకు పల్కు చిత్తమున కింపగుచున్.

మనుమసిద్ధిమహారాజు మంత్రి తిక్కనను 'మామా' యని పిలిచెడివాఁడు. ఆ పిలుపునకు సార్థకత కల్పించుటకై తిక్కన కావ్యకన్యక నిచ్చెను. కృతిప్రదానమునఁ దిక్కన పలుకులలోఁ గనిపించు తీని తెలుగు కవుల కెల్లరకు గర్వకారణము.

మనుమసిద్ధి చరిత్రలోఁ దెలుఁగు చోడులని ప్రసిద్ధి కెక్కిన రాజవంశమునకుఁ జెందినవాఁడు. "మధురాంతకపొత్తపిచోడ, "గండగోపాల" బిరుదనామములతో వీరు దక్షిణదేశమునకుఁ

బాలకులైన చోళులకు సామంతులై రాజ్యము చేసినట్లు వీరి శిలాశాసనములు తెలుపుచున్నవి. మనుమసిద్ధి మహారాజు తండ్రి తిక్కనృపతి. తిక్కనృపతి వీరుఁడు. నిజపరాక్రమమున రాజ్యము విస్తరించెను. శంభురాజాదిప్రశస్తారిమండలమును నిగ్రహించి పుర మేలెను. కర్ణాటసోమేశు దుర్మదోగ్గర్వము రూపుమాపి చోళరాజునకు సాయ మొనర్చి 'చోళస్థాపనాచార్య' బిరుదు గైకొనెను. తిక్కనృపతి శిలాశాసనములు కాంచీపురమునఁ గూడఁ గన్పించుచున్నవి. ఇతని యాస్థానమునఁ బెక్కండ్రు కవు లుండెడివారు. తిక్కన తండ్రి కొమ్మన తిక్కనృపతి మంత్రి. కొమ్మన దక్షిణాపథరాజ్యరంగమునఁ బరాక్రమవైభవప్రాభవమున వెలసిన తన రాజుగారి పేరును దన కుమారునకుఁ బెట్టెను. తిక్కనకవి నామధేయమునకు మాతృక తిక్కనృపతి పేరే.

తిక్కనృపతి క్రీస్తుశకము 1254 సంవత్సరమువఱకు రాజ్యము చేసెను. అతని తరువాత మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చెను. మనుమసిద్ధి శాసనములు క్రీస్తుశకము 1256 నుండి కనిపించుచున్నవి. కావున నిర్వచనోత్తరరామాయణకృతికాలము క్రీస్తుశకము 1256 తరువాత నని యూహింపవచ్చును. ఈ విషయమునే నిర్వచనోత్తరరామాయణమునఁగల యాంతరంగిక సాక్ష్యములను బట్టి నిర్ణయింపవచ్చును. తిక్కన యవతారికలోఁ గృతిపతి మన్మసిద్ధి పరాక్రమ విజయములు వర్ణించినాఁడు. అందుఁ బేర్కొనిన విషయములు కవి కాలానుక్రమముగఁ గూర్చినట్లు తోచుచున్నది.

అవతారికకుఁ జీవర కృతిపతి శౌర్యమును

"శృంగారంబు సలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి తే
దంగంబుల్ మెఱుఁగేవ వింపకయు మాహారాష్ట్ర సామంతు సా
రంగుం దోలి తురంగముం గొనిన సంగ్రామంబునం దృప్తస
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభు పంపై చన్న సైన్యంబునన్"

అని వర్ణించినాఁడు. ఇందలి సారంగుఁ డద్దంకి సీమకుఁ బాలకుఁడు. ఇతని పేరు శిలాశాసనముల 'సారంగపాణి' అని కానవచ్చుచున్నది. మాధవనాయకుని యనంతరము సింగళదేవ మహారాజు క్రీస్తుశకము 1254 సంవత్సరము వఱకు రాజ్యము చేసెను. సింగళదేవమహారాజు తరువాత సారంగుఁడు రాజ్యము సల్పెను. క్రీస్తుశకము 1255 సంవత్సరమునుండి సారంగపాణి శిలాశాసనములు కన్పించుచున్నవి. కావున నీ సారంగు రాజుగఁ చేర్కొనిన నిర్వచనోత్తరరామాయణము క్రీస్తుశకము 1255 సంవత్సరము తరువాత, 1256 సంవత్సర ప్రాంతమునఁ దిక్కన మనుమసిద్ధికిఁ గృతి యిచ్చి యుండవచ్చును. ఆనాటికి మనుమ సిద్ధి రాజ్యము సల్పుచున్నాఁడు. తిక్కన మంత్రిత్వము నెరపు చున్నాఁడు. కేతన దశకుమారచరిత్రముకూడ సించుమించుగ నా నాటిదే. దశకుమారచరిత్రమున నిర్వచనోత్తరరామాయణ ప్రశంస లేదు. కావున నది నిర్వచనోత్తరరామాయణమున కీషత్ పూర్వమై యుండవలెను. నిర్వచనోత్తరరామాయణదశకుమార చరిత్రల యవతారిక లంఁనాటి తెలుఁగునాటి చరిత్రను నేటికిఁ గూడఁ బ్రతిఫలింపఁ జేయుచున్న యక్షయహర్మ్యములు.

మూలములోఁగల నరకవర్ణనము, అహల్యాకథ భృగు శాపకథనము మున్నగునవి నిర్వచనోత్తరరామాయణములో లేవు.

నృగరాజకథ తిక్కన యొక్క పద్యమున సంక్షేపించెను. శ్రీరాముని వీడ్కొని జనకాదులు తరలుట మూలమున నాలుగు సర్గలు. తెలుగులో కొన్ని పద్యములు మాత్రమే.

మూలమున రావణబలిసమాగమము మున్నగు గాథలైదు సర్గ లధికపాఠములు గలవు. అట్టివాని నెల్ల తిక్కన తెలిగింపక విడిచెను.

మూలమున సీతాపవాదమును శ్రీరాముడు హాస్యగాండ్రి వలనఁ దెలిసికొనును. నిర్వచనోత్తరరామాయణమున సీతాప వాదము నెరింగించిన భద్రుడు నర్మసచివుఁడు.

సంస్కృతరామాయణము సపరివారముగ రాముఁడు సరయూప్రవేశమొనరించి నిర్యాణమొందుటతో ముగియుచున్నది. తిక్కన నిర్వచనోత్తరరామాయణము కుశలవులు రామునితోఁ జేరి రాజవిద్యల నేర్చుటతోఁ గథాంతముగ నున్నది.

తిక్కన కావ్యమర్యాద ననుసరించి నిర్వచనోత్తరరామా యణమును మంగళాంతము సల్పెను.

తిక్కన తన్నుఁగూర్చి

అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిం సుతుఁడఁ దిక్కాఖ్యుండ
సన్మాన్యుఁడన్.

అని చెప్పుకొనెను.

కేతన దశకుమారచరిత్రలోఁ గృతిపతి తిక్కన చమూపుఁడు దండాధీశుఁడు.

సుకవీంద్ర బృంద రక్షకుఁ డెవ్వఁడనిన
వీఁడను నాలుకకుఁ దొడవైన వాఁడు
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన
వీఁడను శబ్దమున కర్థమైన వాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన
వీఁడని చెప్పుటకుఁ బాత్రమైన వాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన
వీఁడని చూపుటకు గుఱియైన వాఁడు
మనుమసిద్ధిమహీశసమస్తరాజ్య
భాగ్యధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మి సుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి

అని వర్ణించుట మాత్రమే గాక

కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చ
పరగ దశకుమారచరితంబు చెప్పిన
ప్రోడ నన్ను వేరె పొగడ నేల

అని కావ్యశిల్పమునకుఁ దిక్కనమహాకవిని గీటురాయిగా స్వీకరించెను. ఆ ఖ్యాతి సమకాలమువారివలననే తిక్కన సంపాదింపఁగలిగెను.

నిర్వచనోత్తరరామాయణరచనాకాలమునాటికి తిక్కన మంత్రి. మహాకవి. అయిన 'సోమయాజి' యెప్పు డయ్యెను? కేతన దశకుమారచరిత్రమునాఁడే

సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను నను టధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్ప నుభయభా
షలయందు ననుట ప్రశంస త్రోవ
యర్థిమైఁ బెక్కాళ్ల నగ్రహారంబులు
గా నిచ్చు ననుట పొగడ్త పొలము
మహితదక్షిణలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనము దారి
పరుని కొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపు సొంపార నెగడు నట్టి
కొమ్మనామాత్యు తిక్కన కొలఁది సచివు
లింక నొక్కఁడుఁ డెన్నంగ నెందుఁ గలఁడు

అని చెప్పెను.

ఆనాటికే తిక్కన బహువిధయాగములు చేసె మహిత దక్షిణ లిచ్చినను 'సోమయాజి' కాలే దనియే చెప్పవలెను.

నిర్వచనోత్తరరామాయణము నందలి యాశ్వాసాంతగద్య ముదాహరణము. "ఇది శ్రీ మదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధనవిధేయ తిక్కననామధేయప్రణీతంబైన యుత్తర రామాయణము"....

భారతమునందలి యాశ్వాసాంతగద్యము చూడవచ్చును.

"ఇది.... బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతము"

తిక్కన మహాకవి మనుమసిద్ధి యాస్థానమున మంత్రిగా మాత్రమే గాక, మహాకవిగా మాత్రమే గాక, మహోదారపురుషుఁడై తుల లేని గౌరవప్రపత్తుల ననుభవించెను. తిక్కన పూర్ణ పురుషుఁడు. మంత్రి. మహాకవి. దండనాథుఁడు. విద్వాంసుడు. వేదాంతి.

ఐతిహ్యము ఈ మహారాజును గూర్చి మహామంత్రిని గూర్చి కమ్మని కథలు చెప్పుచున్నది.

అక్కన్న బయ్యన్నలు, దాయాదులు మనుమసిద్ధి నోడించి రాజ్యము గైకొనిరి. మంత్రి తిక్కన కాకతి గణపతిదేవ చక్రవర్తి కొలువుకూటమున కేగి, యాతని సాయమున మనుమసిద్ధి మహారాజును సింహాసనమునఁ బునఃప్రతిష్ఠుతుని చేసె నని జనశ్రుతి.

తిక్కన మంత్రి మనుమసిద్ధిమహారాజునకు రాయబారియై గణపతి దేవచక్రవర్తి కొలువు కూటమునకుఁ జేరుటకు ముందే తిక్కన మహాకవి యశస్సు చక్రవర్తి వీనులు సోకినది. గణపతి దేవచక్రవర్తి మహాకవి కెదురేగి స్వాగత మిచ్చినాఁడు. కవిపూజ సలిపినాఁడు. మహాకవి తిక్కనవలన భారతామ్నాయము విని, మెచ్చి కవిని వరము కోరుకొనమనినాఁడు. మంత్రి తిక్కన మనుమసిద్ధి మహారాజును సింహాసనమునఁ బ్రతిష్ఠింప వేడికొన్నాఁడు. చక్రవర్తి అనుగ్రహించి, స్వయముగా సేనాపతియై తరలి కవి కోర్కి తీర్చినాఁడు. కథ రక్తి కట్టినది. ఇందు

తిక్కన గొప్పతనము గణపతి దేవుని రసజ్ఞత ఆంధ్రమహాభారతమహిమ స్వయంవ్యక్తమై, కావ్యకల్పనవలె నున్నది. ఇందలి చారిత్రికసత్య మేమి? అను ప్రశ్న వచ్చు చున్నది.

సిద్ధేశ్వరచరిత్రమను ద్విపదకావ్యమున నీ కథ గలదు.

సారె సారెకుఁగేరి సన్నుతుల్ చేయ
సార పారావారసరసగంభీర
సారుఁడై కీర్తివిస్తారుఁడై యలరు
నా రీతి గణపతి నటు చూచు వేడ్కఁ
దిక్కన సోమయా జక్కడ కొకట
దిక్కు దిక్కులనుండి తెరలి విద్యార్థు
లక్క డక్కడను గావ్యముల శ్లోకార్థ
మొక్కొక్క విధమున నొగి వినిపింపఁ
జక్కన వినుచును నొక్క యందలంబు
నెక్కి తిక్కన సోముఁడక్క డేతెంచె
నా రీతిగా సోమయాజుల రాక
వారక చని పణిహారులు దెల్ప

* * *

అట్టి మహాత్ముని నా సోమయాజి
నెట్టన నెదురేఁగి నేర్పుతో రాజు
తెచ్చి యర్ధాసనస్థితునిగాఁ జేసి
మెచ్చి తాంబూలాదు లెచ్చుగా నిచ్చి.

* * *

అగు భారతాఖ్యాన మా వీరవరులు
తగఁ జేసి నట్టి యుద్ధప్రకారములు
వినియు సంతోషించెఁ గని నట్లు చెప్ప

*           *           *

అంతఁ దిక్కన సోమయాజికి మెచ్చి
వింత వస్త్రంబులు వివిధభూషణము
లత్యంతభక్తితో నప్పు డిచ్చుదును
సత్యసంధుండు సభ్యవర్తనుఁడు
నగు సోమయాజి తా నా రాజు కనియెఁ
దగు మాట విను మొక్క ధర్మకార్యంబు
సూర్యవంశంబున సొబ గొంపు నట్టి
యార్యపూజితవర్యుఁ డా మన్మసిద్ధి
రాజు దా నెల్లూరు రమణతో నేల

*           *           *

అక్కన్న బయ్యన లధికబలిష్ఠు
లక్కట సిద్ధిరాయునిఁ బాఱఁద్రోలి
దక్కిన రాజ్యంబు తామె యేలుచును
నొక్క కాసైనను జక్కగ నీరు
వారల దండించి వారి నెల్లూరు
వారి కిప్పింపు మవారణఁ బ్రీతి
ననిన గణపతి రా జట్లు కా కనుచు
వెడలి గణపతియు విజయంబునకును
గుడి యెడమల సేన కొలిచి యేతేర

వెలనాఁడు చేరియు వీఁడెల్లఁ గాల్చి
వెలనాటి రాజును వెస గెల్చి వాని
యప్పనంబులు గొని యటఁజని రాజు
గుప్పున నెల్లూరు కూడ నేతెంచి
యక్కన బయ్యన నచట సాధించి

*　　　*　　　*

నెల్లూరి ప్రజలకు నేర్పు వాటిల్లఁ
జెల్లించె నట మన్మసిద్ధి రాజునకు
నెల్లూరు పట్టంబు నేర్పుతోఁ గట్టి
సల్లలితాద్భుతి సమదుర్గములను
నలువ దెనిమిదియు నగు పట్టణముల
నరు దొంద సాధించి యా మన్మసిద్ధి
రాజు కిచ్చియుఁ దన తేజంబు దిశలఁ
బూజ లెక్కఁగ ఘనరాజితయశుఁడు
ఘనతటాకంబుఁ దాఁ గట్టించె నచటఁ
గొనఁగొని నెల్లూరఁ గొన్నెల లుండి
మనుమసిద్ధికి రాజ్యమహిమలు దెల్పె.

సిద్ధేశ్వరచరిత్ర వ్రాసిన కాసె సర్వప్పకవి క్రీస్తుశకము 1400 సం. ప్రాంతము వాఁడు. అనగా తిక్కనకు సుమారు నూరేండ్ల తరువాతివాఁడు. జరిగిన సన్నివేశమునకు సుమారు నూట యేబది సంవత్సరముల తరువాత వ్రాసినవాఁడని చెప్ప వచ్చును.

ఈ కథనే కూచిమంచి జగ్గకవి తన సోమదేవరాజీయము నందుగూడ చెప్పియున్నాడు.

"చేయఁ దక్కువ యైన దేవాయతనము
లపుడు పూర్తిగఁ గట్టించి యలరు చున్న
చోట నొక నాడు తిక్కన సోమయాజి
వచ్చె నెల్లూరునుండి భూవరుని కడకు;
వచ్చిన యయ్యార్యవర్యు నెదుర్కొని
వినయసంభ్రమ భక్తు లినుమడింప
నతిథిపూజ లొనర్చి యతనిచే భారతా
ర్థమును ద్వైతాద్వైతతత్త్వములును
విస్మృతచిదచిద్వివేక లక్షణములుఁ
బ్రకటధర్మాధర్మపద్ధతులును
రాజనీతి ప్రకారంబును భారత
వీరుల మహిమంబు వినుచు నుండి
యనుమకొండనివాసులై నట్టి బౌద్ధ
జనుల రావించి వారిఁ దిక్కన మనీషి
తోడ వాదింపఁ జేసినఁ దొడరి వారిఁ
జులకఁగా సోమయాజులు గెలుచుటయును

అప్పుడు దేవాలయంబులఁగూలం ద్రోయించి గణపతి దేవరాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చి యతనిని బహు ప్రకారంబులఁ బూజించి యెనిమిది గ్రామంబు లొసంగి యతఁడు వచ్చిన కార్యం బడిగిన నా భూవరునకుఁ గవివరుం డిట్లనియె.

ఇనకులోద్భవుఁ డైనట్టి మనుమసిద్ధి
రాజు నెల్లూరు పాలించుచోఁ జెలంగి
యతని దాయాదు లతని నుక్కడఁగఁ బట్టి
యునిచి రాజ్యంబుఁ దమ రేలు చున్నవారు.

కావున మీరిపుఁ డచటికి
వే వేగం గదలి వచ్చి విడకుండగ నా
భూవరుఁ బున రభిషిక్తునిఁ
గావింపఁగ వలయు ననగ గణపతి విభుఁడున్

అట్ల కాక యనుచు నా పని కొడఁబడి
యత్యుదారగుణసమగ్రుఁ డగుచుఁ
దనివి యప్పు డొక్క నవలక్షధనమును
యజ్ఞకుండలములు నతని కిచ్చె

పనుచు నెడఁ దిక్కమఖి యా
జనవరు సింహాసనమున సచివాగ్రణియై
తనరెడు శివదేవయ్యన్
గనుఁగొని యా రాజుతోడఁ గడకం బలికెన్.

వసుమతీనాథ! యీతఁ డీశ్వరుఁడ గాని
మనుజమాత్రుండు గాఁడు పల్కులు నితని
యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మి
నేలు మని చెప్పి యా ఘనుఁ డేఁగుటయును.

గణపతి దేవుఁ డా ఘను ననుమతిఁ గాంచి
యతిసత్వరమునఁ బ్రయాణభేరి

వేయించి చతురంగపృతనాసమేతుఁడై
    తరలి ముస్వోలనాటి ధరణిపతుల
గెలిచి వారలచేత విలనప్పనముఁ గొని
    వారి నందఱఁ దన వశము చేసి
కొని చని నెల్లూరుఁ గొబ్బునఁ జొచ్చి య
    క్కనయు బయ్యనయు నన్ ఖలులఁ దఱిమి

మనుమసిద్ధిరాజుఁ బునరభిషిక్తుఁగా
వించి మించి రెండు వేలు నైదు
నూఱు గ్రామములు మనోవృత్తి కతనికి
నిచ్చి కడమఁ దాను బుచ్చి కొనియె

కాని ఈ కథను యథాతథముగ స్వీకరించుటకు కొన్ని చిక్కులున్నవి. గణపతిదేవచక్రవర్తి క్రీస్తు శకము 1260 సంవత్సరమువఱకు రాజ్యము సల్పెను. అప్పటికి తిక్కన మహాభారతము నారంభింప లేదని నిశ్చయముగఁ జెప్ప వచ్చును. సోమయాజి యయ్యెనో లేదో! అయిన తిక్కన నోట భారతార్థమును ద్వైతాద్వైతతత్త్వములు గణపతిదేవుఁడు విను టెట్లు పొసఁగును? "అందుచేత సోమదేవరాజీయాదులందు చెప్పఁబడిన భారతశ్రవణకథ కవికల్పిత మనుటకు సందేహము లేదని" శ్రీ వీరేశలింగముగారి అభిప్రాయము.

మనుమసిద్ధి రాజ్యభ్రష్టత, తిక్కన రాయబారము, కాకతి గణపతి భారతశ్రవణగాథతో నన్వయించుట పొసఁగదు తిక్కన, తన బ్రదుకు మలి సంజ వెలుఁగులలో నిష్కామకర్మగ భారతమును హరిహరనాథున కారాధనవిశేషముగ సమర్పించెను.

తిక్కన వార్ధకములోఁ గన్నులు కనుపింపని దినములలో భారతము కుమ్మరి గురునాథునిచే వ్రాయించె నని ఐతిహ్యము. పదునైదు పర్వములు ముగించుట కెంతయో కాలము పట్టి యుండును. నిర్వచనోత్తరరామాయణము తిక్కన నడిమి వయస్సులో క్రీ॥ శ॥ 1258 ప్రాంతమున రచించె నని చెప్పిన భారతము వార్ధకములోఁ బదుమూడవశతాబ్దాంత్యమున గాని, ముగింపియుండఁదని యూహింప వచ్చును.

అయిన తిక్కనరాయబారము, భారతశ్రవణగాథ కేవలము కవికల్పితములా? కావు.

చారిత్రకముగఁ జూచిన, మనుమసిద్ధి కాకతి గణపతిదేవుని శరణను కాంక్షించుచున్నట్లు ఒక శిలాశాసనమువలన తెలియు చున్నది[1].

అక్కన్న బయ్యన్నలు మనుమసిద్ధి రాజ్యము నపహరించుట గూడ యదార్థసంఘటనమే. గణపతిదేవచక్రవర్తి నెల్లూరు రాజుతో చేసికొనిన యొడంబడిక ప్రకారము నెల్లూరు తగుల బెట్టి అక్కన్న బయ్యన్నలను జయించినట్లు గుంటూరు మండలము నందలి నాయనపల్లిలోని శిలాశాసనమునఁగలదు.[2] కాని ఆశాన నమున శకవర్షముల అక్షరములు అరిగిపోయినవి.

తిక్కన రాయబారము, మనుమసిద్ధి పునఃప్రతిష్ఠా కాలము నిర్ణయించుటకు ప్రత్యక్షసాక్ష్యము లేదు. అయినను మార్గాంతరమున నిర్ణయింపవచ్చును. తెలుఁగు చోడులు దక్షిణచోళులకు

---

1. 1907 సం. 580 సంఖ్యగల శాసనము.
2. 1922 సం. B., 769 సంఖ్యగల శాసనము.

సామంతులు. దక్షిణచోళుఁడైన వీరరాజేంద్రచక్రవర్తికి మనుమసిద్ధి సామంతుఁడై యున్నట్లు శిలాశాసనము గలదు[1]. ఆ శిలాశాసనము వీరరాజేంద్రుని పదుమూఁడవరాజ్యసంవత్సరమునాటిది. అతఁడు క్రీ॥ శ. 1246 లో రాజ్యమునకు వచ్చెను. అతని పదుమూఁడవ రాజ్యసంవత్సరము క్రీ॥ శ॥ 1258 వఱకు మనుమసిద్ధి దక్షిణచోళునకు సామంతుఁడు. గణపతిదేవచక్రవర్తి క్రీ॥ శ॥ 1260 లో మరణించెను. కావున మనుమసిద్ధి క్రీ॥ శ. 1258 లో గాని 1259 సంవత్సరమున గాని పదభ్రష్టుఁడయ్యెనని విశ్వసింప వచ్చును.

శ్రీకృష్ణుని రాయబారము భారతములో నత్యద్భుతముగఁ జిత్రించు నేర్పు తిక్కన స్వానుభవముచే గడించెను. తిక్కన రాయబారము నెరపి గణపతిదేవుని మెప్పించి మనుమసిద్ధికి రాజ్య మిప్పించెను. నాటినుండి తెలుఁగు చోడులు కాకతీయ సామ్రాజ్యములోఁ జేరిరి. కాకతీయుల వెల్లఁగొడుగు నీడ పెన్నా నదీజలములలోఁ బ్రతిఫలించినది.

తిక్కన గణపతిదేవునకు వినిపించినది సంస్కృతభారతామ్నాయమై యుండవచ్చును. నాటికే భారతముమీఁద తిక్కనకు గల అధికారము జగద్విదితమై యుండును. భారతనీతికి జీవద్వ్యాఖ్యానము ప్రసాదించిన మహామంత్రి చిరంతనమననముచే మహాభారతాంధ్రీకరణమునకు నధికారము సంపాదించుకొనెను. మహేతిహాసరచన సలుపుటకు మహోదారజీవితమును నెరపిన మహాకవికే యధికారము కలదు. అయిన మహాభారతము నాంధ్రీ

1. 1907 నం. 580 సంఖ్యగల శాసనము.

కరించుటకు తిక్కనకు, కవిత్రయమునకు తెలుఁగువారి అదృష్ట వశమువలన నాయధికారము సమగ్రముగ లభించినది.

నిర్వచనోత్తరరామాయణ, మహాభారతరచనాకాల మధ్యమందు తిక్కన వ్యక్తిత్వములో నేర్పడిన పరిణామము గమనింప దగినది. ఆ నాఁడు తిక్కన మంత్రి. శైవుఁడు. మహేశ్వరాంఘ్రిక మలధ్యానైకశీలుఁడు. కేతన గూడ నతని చిత్తనిత్యస్థిత శివుఁ డని పేర్కొనెను. కాని మహాభారతరచనాకాలమున తిక్కన సోమయాజి హరిహరనాథోపాసకుఁడు.

మహాభారతమున తిక్కన మంత్రిత్వప్రశంస గాని నిర్వచనోత్తరరామాయణమున తిక్కన యజ్ఞప్రశంస గాని లేదు. తొలినాఁడు తిక్కన, సోమయాజి కానట్లే, మలినాఁడు మంత్రిత్వము నుండి విరమించుకొనిన ట్లూహింపవచ్చును. మహాభారతమున "నీ కరుణ నిట్లు పదస్థుఁడ నైతి" ననునే గాని మంత్రి నని చెప్పికొనలేదు. నిర్వచనోత్తరరామాయణమున "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ బారగుఁడ" అని చెప్పుకొనిన అహంభావము, భారతరచననాటికి

"నా నేర్చిన భంగి చెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్"

అను వినయముగా మారినది.

కవి, అంతఃకరణమున నిట్టి మహత్తరశుభపరిణామవికాస మేర్పడుటకు కొంతకాలము పట్టియుండక తప్పదు.

తెలివి యొకింత గల్గు నెడ దృప్తుఁడనై కరిభంగి సర్వమున్
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితి తొల్లి నే డిటు
జ్జ్వలమతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై
తెలియని వాఁడనై మెలఁగితిన్ గవ మయ్యె నితాంతగర్వమున్

అన్న భర్తృహరిసుభాషితమునకు తిక్కన మహాకవి జీవితము జీవద్వ్యాఖ్యానమైనది. "విద్య యొసగును వినయమ్ము" అను నానుడికి తిక్కన ప్రాణప్రతిష్ఠ సల్పెను.

నిర్వచనోత్తరరామాయణకాలమునాడు శైవుఁడుగానున్న తిక్కన మహాభారతరచనాకాలమునకు హరిహరనాథోపాసకుఁడుగా మారుట గణనీయము. నన్నయ తరువాత ఆంధ్రవాఙ్మయము నసే గాక దక్షిణాపథసాంఘికరంగమునందుగూడ శైవయుగ మావిర్భవించినది.

గజనీమహమ్మదు సోమనాథదేవాలయముపై క్రీ॥ శ. 1026 సంవత్సరము జనవరి నెలలో దండెత్తెను. అనగా రాజ రాజనరేంద్రుడు రాజ్యమునకు వచ్చిన నాలుగు సంవత్సరములకు. భోజమహారాజు రాజ్యమునకు వచ్చిన 27 సంవత్సరములకు. ఆకస్మికముగ సోమనాథదేవాలయముపైఁ బడి కాంచనమణిరత్న రాసుల దోచుకొనిన గజనీమహమ్మదు నెదుర్కొనుటకు భోజ మహారాజు దండెత్తి వెళ్ళెను.

గజనీ మహమ్మదు గజనీకి మరియొక మార్గమున సింధు లోని యెడారి మార్గములఁబట్టి పలాయనము సాగించెను. అతని ఆస్థానచరిత్రకారుని కథనమున "మహమ్మ దక్కడనుండి గజ నీకి, వెళ్లినదారినిగాక, చుట్టు తిరిగి యొక మార్గదర్శకుని సాయ మునఁ జేరవలసి వచ్చినది. దీనికి కారణము హిందూరాజయిన పరమదేవుఁడు వెంబడించుటయే. మార్గమధ్యమున నెన్నియో గుఱ్ఱములు, ఎందఱో భటులు మరణించిరి. ఎన్నియో కడగండ్ల నెదుర్కొనవలసి వచ్చినది." పరమదేవుడు పరమరరాజు భోజ రాజే. ముస్లిము చరిత్రకారులు భోజుడు మహమ్మదు నెదుర్కొని

నట్లు వ్రాయకపోయినను. భోజుడు ఉదయపుర ప్రశస్తి, యతడు తురుష్కుల జయించి నట్లు పేర్కొనుచున్నది. లేనిచో మహమ్మదు వచ్చిన దారిని బోక, యెడారిలో నానాబాధలు పడ నవసరము లేదు.

ఇస్లాము మతమునందు "దేవుడొక్కడే! మహమ్మదతని ప్రవక్త" అను సూత్రము ముఖ్యము. ఈశ్వరుడు విశ్వపిత అయిన అతని భక్తులందరు సోదరులే. ఏకేశ్వరోపాసన ఇస్లాము మతానుయాయుల సామ్రాజ్యమునకు దారితీసినది. గజనీ మహమ్మదు దండయాత్ర విరమించుకొని గజనికి తరలి పోయినను ఇస్లాము మతసంపర్కము హైందవభూమిని మరికొన్ని సమస్యల రేకెత్తించెను.

విగ్రహారాధకులకు బుద్ధిచెప్పుటకు, వారి సొత్తు కొల్లగొట్టుటకు ఇస్లాము ధ్వజము ప్రతిష్ఠించి దేవునకు, ప్రవక్తకు సంతోషము, విగ్రహారాధకులకు విముక్తి, కల్గించుటకు మరల మహమ్మదువంటి వాడెప్పుడో తలయెత్త వచ్చును. గోరీ మహమ్మదు క్రీ॥ శ. 1192 లో స్థానేశ్వరయుద్ధమున పృథ్వీరాజును జయించి అజ్మీరు రాజ్యము నాక్రమించెను. క్రీ॥ శ. 1197 సంవత్సరమున నతని సేనాని విశ్వవిఖ్యాతిగన్న నాలందా విశ్వవిద్యాలయమును అందలి రత్నోదధి, రత్నగర్భ పుస్తక భాండాగారములను విధ్వస్త మొనర్చెను. క్రీ॥ శ. 1199 లో "పద్మావతీచరణచారణచక్రవర్తి" జయదేవకవి కాశ్రయ మిచ్చిన లక్ష్మణసేన ప్రభువును బారద్రోలి వంగదేశము నాక్రమించెను. కాలదిశాంతములో ఉత్తరాపథ మంతయు ముస్లిమునంస్కృతికి, ప్రభుత్వమునకు దోసి లొగ్గినది.

ఉత్తరాపథము దాటి దక్షిణాపథమును గూడ ఇస్లాము సంస్కృతి ముస్లిము దండయాత్ర ముంచివేయకుంచ అరికట్టుట అవశ్యకర్తవ్య మయ్యెను. హిందూమతము ఆనాడు కులవిభేద ములతో, బహుదేవతోపాసనతో నిండియుండెను. అంతశ్ఛిద్ర ములు సమాజ రాజకీయ జీవితమునఁ గ్రుళ్లుచుండెను. ఇట్టితరి శైవులు ప్రబలి ఏకేశ్వరోపాసన ప్రతిపాదించి కులవిభేదములకు స్వస్తి పలికిరి. శివుడు పరదైవము. శివుడు విశ్వపిత. శివభక్తు లందఱు సోదర సమానులు. కులవిభేదములకు తావు లేదు. పండితారాధ్యునివంటి మహాపురుషుఁడా నాడు

"భక్తి మీది వలపు బ్రాహ్మ్యమ్ముతోఁబొత్తు
వదలలేను నేను బసవలింగ!." అని చెప్పెను.

శైవులలో 'అతివాదమతము ప్రబోధించినవాఁడు బసవేశ్వరుఁడు.

ముస్లిము సంస్కృతి వింధ్యపర్వతపంక్తులు దాటకుండ "హరహరమహదేవ్" "అస్సరభ శరభ!" అని వీరావేశమున శివ మెత్తి త్రిశూలఖడ్గధారులై ప్రతిఘటించి నిల్చిన కీర్తి వీర శైవులకు దక్కినది. వీరశైవులు సాంఘికరాజకీయవాఙ్మయ రంగముల నేకప్రయోజనము సాధింపనిల్చిన మహోద్యమ ప్రవర్తకులు. అందుచే వారు నన్నయభారతమును స్పృశింప లేదు. వారు బ్రాహ్మణపారమ్యము, సంస్కృతాధిక్యము వర్ణా శ్రమధర్మములు, వైదిక సంస్కృతి నంగీకరింపరు. అప్పుడు దేశమునకు కావలసినది వీరశైవప్రబోధము గాని భారతాంధ్రీ కరణముగాదు. శివకవులు, నన్నయ సంస్కృతభూయిష్ఠరచన నేవగించుకొనుటయే గాక "బ్రాహ్మణగార్దభముల, అద్వైత గాడిద"లను దుమ్మెత్తి పోసినారు.

ఆ నాఁడు ప్రగతిశీలు లందఱు శైవులై, ఆ మహోద్యమము నకుఁ దమ జీవితమును ముడిఁగల్పుకొనిరి. దక్షిణాపథమున కాకతీయసామ్రాజ్యము శైవులు నిర్మించినదే. ఆ నాటి చంపు గుడులఁబట్టి పరమేశ్వరారాధనకై యెందఱు వీరశైవులు తమ శిరస్సుల చేతులార గండకత్తెరకు బలిదానముగ సమర్పించెడివారో తెలియ నగును. మతసంరక్షణమున ప్రాణము తృణప్రాయము. అది యుగధర్మము. కాలమాహాత్మ్యము.

తిక్కనగూడ తొలినాళ్లలో శైవుఁడే. శైవుల ప్రాణబలిదానమునకైన సంసిద్ధమగు త్యాగశీలము ప్రతికూలసభ్యతపై, ప్రతిపశక్తులపై, విరోధిసేనలపైఁ బరపిన మంచిదే. కాని సుస్థిరసామ్రాజ్యస్థాపనముతో నా యావేశము నంతశ్ఛిద్రములుగా వ్యాపించినది.

శివపారమ్యము నంగీకరింపక వీరశైవుల వీరావేశము నెదుర్కొనినవారు వైష్ణవులు. దక్షిణాపథమున నీ యుభయ మతానుయాయులు కత్తులు నూరుకొనుట కుద్యమించినారు. జాతీయశక్తి, అంతఃకలహములలో అన్యోన్యమారణహోమముగా మారసాగినది. తిక్కన మహాకవి యీ యన్యోన్యకలహోన్మాదము గాంచి అశ్రువులు రాల్చినాఁడు. నిర్మాణాత్మకమైనకృషి సలుపవలసిన మహాశక్తి వ్యర్థమైపోవుచున్నది. అలసించుట కది తరుణము గాదు. తాను శైవుఁడే. అయిన నేమి? ఆంధ్రావళి నుద్ధరించుటకై

"శ్రీ యన గౌరినాఁ బరఁగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయతమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ

పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్''
అని యెలుఁగెత్తి చాటఁగల్గినాఁడు. ఇది శివకేశవాభేదాత్మకమైన ధర్మాద్వైతము.

మతోన్మాదము నెదిర్చి, గాంధీమహాత్ముఁడు "ఈశ్వర అల్లా తేరే నామ్'' అని అన్న మాట "విష్ణురూపాయనమశ్శివాయ'' అని తిక్కన అన్న మాటకు కాలానుగుణమైన స్వేచ్ఛానువాదమే.

తిక్కన ఉపాసించిన యీ హరిహరనాథుఁ డెవ్వఁడు? "అని పూని యీ దృశంబు లగు పుణ్యప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధనవిశేషంబగుటంజేసి'' అను తిక్కన వాక్యముల నాధారముగఁ గైకొని నెల్లూరిలో నాడు హరిహరనాథదేవాలయ ముండెడి దని చెప్పుచున్నారు. తిక్కన హరిహరనాథుని "పరతత్త్వము''గనే పేర్కొనినాఁడు. ఇప్పు డెప్పటను నెల్లూరులో హరిహరనాథదేవాలయము గాని శిథిలావశేషములు గాని లేవు. కొంద రా యాలయము పెన్నలోఁ గలిసి పోయిన దని సమాధానము చెప్పుచున్నారు. కాని తిక్కన, ఎచ్చటను హరిహరనాథుని పెన్నానదీతీరవాసునిగఁ జెప్ప లేదు. "హరిహరనాథునకు, భక్తపరతంత్రునకు'' "ఏను విన్నపంబు సేయు తెఱంగుగా సంతతసన్నిధిం గల్పించుకొని, యిమ్మహా కావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద'' అని వ్రాసినాఁడు.

తిక్కన వలెనే హరిహరనాథునకుఁ దమ కావ్యముల నంకితము చేసిన కవులు నాచన సోముఁడు. వేంకటనాథుఁడు. ఇరువురుగూడ ఆ హరిహరనాథునితో పాటు నెల్లూరు గాని పెన్నా నదిని గాని పేర్కొన లేదు. వీరిరువురు నెల్లూరువారు కారు

నాచనసోముఁడు "హరి మేలంచు హరుండు మేలనుచు నేలా తర్కముల్" అని శివకేశవాభేదప్రబోధము సల్పుచు, సమన్వయ వేదాంతము ప్రతిపాదించుటకే హరిహరనాథోపాసన సల్పు చున్నట్లు స్పష్టముగఁ బ్రకటించెను. నేటి రంగనాథాలయప్రదే శమున పూర్వము హరిహరదేవాలయ ముండెడి దని కొందరి కథనము. హరిహరాలయము శిథిలము కాగా, రంగనాథాలయ మచ్చట నిర్మించి రట. ఈ వాదమునందు సత్యము లేదు. రంగ నాథాలయము తిక్కనకు ముందునుండి నెల్లూరులో నుండెను.

హరిహరనాథపురము హరిహర లేదా కుదలూరు అను పురము తుంగభద్రాహరిద్రానదీసంగమునఁ గలదు. ఈ పట్టణము పద్మపురాణప్రసిద్ధమైన తీర్థయాత్రాస్థలము. శ్రీ చైతన్యస్వామి శిష్యుఁడైన నిత్యానందుఁ డీ పట్టమును సందర్శించెను.

హరిహరక్షేత్రము నామాంతరము గల సోనేపూరు పట్టణ మిం కొకటి గంగాగండక్ నదీ సంగమస్థానమునఁ గలదు ఇది వరాహపురాణప్రసిద్ధము క్షేత్రము.

హరిహరనాథుఁడు తిక్కన మహాభారతమునుండి కన్నడ దేశమునకు వలస పోయెనో పురాణప్రసిద్ధుఁడైన హరిహర నాథుఁడు కన్నడదేశమున, గంగాతీరమున, తిక్కనమహాకవి హృదయమందున, ఏకకాలములో వెలసెనో యూహించుట కష్టము. తిక్కన నిష్కారణముగా శైవమును త్యజించి హరి హరనాథుని స్వీకరింపలేదు. తిక్కన శైవుఁడుగా నున్నపుడు, నిర్వచనోత్తరరామాయణకాలమునఁగూడ హరిహరనాథుఁడు ఒక వేళ నెల్లూరివాఁడైన నచ్చటనే యుండి యుండునుగదా. అపుఁడేల తిక్కన, హరిహరనాథుని స్వీకరింప లేదు? తిక్కన ధర్మాద్వైత

సందేశమునకు అనువుగ, అవశ్యచారిత్రభవితవ్యముగ హరి హరనాథోపాసన నల్పెను.

ఆంధ్రసాంఘికజీవితమును నిత్యరణక్షేత్ర మొనర్చి, జాతీయశక్తి నంతను వమ్మొనరించుచున్న శైవవైష్ణవవిభేద ములకు స్వస్తి చెప్పి, హరిహరనాథోపాసన, శివకేశవాద్వైతము ప్రతిపాదించి "విష్ణురూపాయ నమశ్శివాయ" అని ఉభయ మతములకు మధ్య నిలిచి, పొత్తు కుదిర్చి నవ్యయుగోదయమున ఉషస్సూక్తము పఠించిన రాయబారి మాత్రమే గాదు తిక్కన. జాతీయజీవితమును నిత్యకురుక్షేత్ర మొనర్చు విప్రతిపన్నశక్తులకు శాశ్వతసమన్వయము. వేదాంతము ప్రతిపాదింప నించిన జ్యోతిర్మూర్తియైన "ధర్మాద్వైతమూర్తి". మహాభారతము ఈ ధర్మాద్వైతమునే ప్రబోధించుచున్న దని తిక్కనయుద్దేశము. తెలుగు జాతికి ఈ మహాప్రబోధ మందించుటకే "ఆంధ్రావళి మోదమున్ బడయ" తిక్కన ఆంధ్రమహాభారతము "మహాకవిత్వ దీక్షావిధి" నొంది రచించె నని చెప్పుకొనెను.

విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రవరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన యామ్నాయమున్

భారతరచనకు తిక్కన మహాకవికి భవ్యకవితావేశము కల్పించినది ఈ ధర్మాద్వైతతత్త్వనిరూపణమే.



వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్

వా డైన చోటులను దా
మూవల ధర్మార్థకామమోక్షస్థితికిన్,

అని తిక్కన ప్రవచించెను.

ధర్మము ద్వైత మగునా? ఇక ధర్మాద్వైత మన నేమి? వేదములు ఉపనిషత్తులు బహుధర్మప్రతిపాదికములు. ధర్మ సూక్ష్మము తెలిసికొనుట కష్టము. అప్పుడు లోకమునకు గతి యేమి; 'సత్యంవద' 'అహింసాపరమో ధర్మః' ఇత్యాది ధర్మములు వేదోపనిషత్ప్రోక్తములు. అహింసాధర్మము పాటించునప్పుడు సత్యవ్రతమునకు భంగ మేర్పడ వచ్చును. అప్పుడు పంచమవేదమైన భారతమే మార్గదర్శక మని తిక్కన మహాకవి సందేశము.

ఒక అరణ్యము; అందొక ఋషికులము. అరణ్యమార్గమునఁ బోవు గృహస్థును సంహరించి ధనము నపహరింప దొంగలు వెంటాడుదురు. గృహస్థు ఆ ఆశ్రమమునందలి ఋషి మరుగు చేరును. వెంబడించిన దొంగలా గృహస్థు ఉనికి పట్టులగూర్చి ఋషిని ప్రశ్నించెదరు. 'సత్యంవద' అన్న వేదవాక్యము పాటించిన "అహింసాపరమోధర్మః" అను ఉపనిషత్వాక్యమునకు భంజక మగును. ఋషి కర్తవ్య మేమి? ఇచ్చట ధర్మము ద్వైతముగా నున్నది. కాని 'ధర్మాద్వైత' పరిష్కారము పంచమవేదము సూచించుచున్నది.

భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు తత్
భూతభయాస్పదం బగు ప్రభూతపు సత్యము బొంకు నట్ల ప్రా
ణాతురుఁ డైనచో పరిణయంబున యందున పల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక! యిట్టివి ధర్మసూక్ష్ముల్.

రెండు ధర్మములు విప్రతిపన్నములై యున్నపుడు దేని ననుసరింప వలెను? ధర్మము ఒకటియే కదా! అం దేది "పరమ ధర్మమో" దానిని అనుసరింపవలెను. స్వార్థమును కుటుంబము కొఱకై, కుటుంబమును సంఘముకొఱకై. సంఘమును దేశము కొఱకై దేశమును విశ్వముకొఱకై, విశ్వమును సత్యముకొఱకై త్యజింప వలెను. ఈ త్యాగమే పరమధర్మము. చిన్న ధర్మమును పెద్ద ధర్మముకొఱకై త్యజించుటయే ధర్మాద్వైతము. ఏదియో యొక ధర్మము చేయుట గాని, ఏ ధర్మమును స్వీకరింపక యుపే క్షించుట గాని కర్తవ్యము గాదు.

కేవలనిష్కర్మత మో
క్షావహమగు నేని గిరులు నవనీజములున్
భూవర ముక్తిం బడయం
గా వలవదె యడవి నునికి కైవల్యదమే!

తిక్కన మహాకవి మానవుడు కర్మవీరుఁడై జీవితరణ క్షేత్రమున విజయుఁడు కావలె నని యుద్బోధించెను. కర్మసన్యాస మునకు విపరీతార్థము ప్రవచించి, కేవల సన్యాసమే మోక్షావహ మని భారత మాదేశింప లేదు. జీవితమునందుండి మానవుడు ముక్తుఁడు కావలెను. జీవితమునుండి తరించుటకు మార్గము జీవితమే. కర్మయోగమే. కర్మవీరతయే.

ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుం డగుచు కార్యకర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము
దలకొనినం గర్మశమము దానై కలుగున్.

అని తిక్కన సందేశము.

తిక్కన మహాభారతము చేఁబట్టుటకు కారణము మహాభారతవేదాంతము, అతని జీవితవేదాంతములో సంగమించుటయే. తిక్కన మానవజాతి కందింపఁ దలపోసిన ధర్మాద్వైతమునే భారతము ప్రబోధించుచున్నది. అందుచే రెండు శతాబ్దులు నిల్చి యున్న మహాభారతమును దిక్కన మహాకవి తిరిగి చేఁబట్టుట కేవలము యాదృచ్ఛికము గాదు. తిక్కన సమకాలీన జగత్తునకు విశ్వమానవలోకమునకు అందింపఁ దలపోసిన జీవిత వేదాంతమే అం దిమిడి యున్నది.

తిక్కన అనుష్ఠానవేదాంతి. తెలుఁగు జాతి క్రియాశూరులై కర్మవీరులు కావలెను అదియే మానవపరమధ్యేయము. అనుష్ఠానపరమైన కర్మయోగమే ధ్యేయమైన నేది యాచరణీయమో ముందు తెలిసికొన వలెను. మానవుఁడు తొలుత జ్ఞానియై, తత్త్వజ్ఞానము నలవరచుకొని, విప్రతిపన్నములైన ధర్మముల మధ్య పరమధర్మము నేరుకొని అనుష్ఠింపవలెను జ్ఞానము వెనువెంట కర్మానుష్ఠానము. ఈ అనుష్ఠానము మాత్రము బ్రహ్మార్పణ బుద్ధితో, అహంకారత్యాగముతో సలుప వలెను. తిక్కన సందేశమునఁ గర్మాచరణమే యోగసాధన. జీవితమే కురుక్షేత్రము. కురుక్షేత్రము ధర్మక్షేత్రము. సంకులధర్మసమర క్షేత్రము.

ఈ ధర్మాద్వైతమును ఒకనాఁడు వేదవ్యాసమహర్షి భారత వర్షమున నెలుఁగెత్తి చాటినాఁడు అందుచే భారతవర్షము కర్మభూమి, పుణ్యభూమి యని ప్రసిద్ధి నొందినది. తరువాత అపర వేదవ్యాసుడు తిక్కన మహాకవి తెలుఁగు భూమిలో ధర్మాద్వైత ప్రతిష్ఠాపకుఁ డయ్యెను. అందుచే దేశభాషలలో నెక్కడఁ లేని ప్రాధాన్యము; ప్రతిష్ఠ; తెలుఁగు భారతము సంపాదించుకొనఁ

గలిగినది. భారతదేశజాతీయగ్రంథము భారతము. భారతధర్మము అవగత మొనర్చుకొనిన కవిత్రయమువారి చేతిలో తెలుఁగు భారతము పడుట తెలుఁగు వారి అదృష్టము. తెలుఁగు భూమిలోఁ గూడ జాతీయగ్రంథము భారతమే.

ఈ ధర్మాద్వైతమును ఈ సమన్వయవేదాంతప్రబోధము ఆంధ్రభూమిలోనుండి ఆంధ్రవాఙ్మయములోనుండి వెలువడుటలో మిక్కిలి యౌచిత్యమున్నది. తెలుఁగుదేశము భారతవర్షములో నడిబొడ్డున నున్నది. ఔత్తరాహుల భక్తి, దాక్షిణాత్యుల కర్మకౌశలము, అటు ఆవేశము: ఇటు ఆలోచన; అటు భావావేగము: ఇటు క్రియాశూరత తెలుగునాట సంగమించుచున్నవి. ఈ మహాకవి ఆదర్శాంధ్రుఁడు. తెలుఁగుఁదనము మూర్తీభవించిన మహాకవి. అటు హరిహరనాథోపాసనచే భక్తిని ఇటు భగవద్గీతాపరమైన భారతరచనతో ధర్మాద్వైతమూలకమైన అనుష్ఠానవేదాంతము ప్రబోధించిన భక్తుఁడు; కర్మవీరుఁడు.

భక్తికిఁ గొందఱు తేలిక అర్థము చెప్పుచున్నారు. కాని తిక్కన జ్ఞానయోగియై అనుష్ఠానవేదాంతియైన భక్తుఁడు. తిక్కన భక్తి, జ్ఞానులకుఁ గర్మవీరులకు మాత్రమే అందునది.

పోతన మహాకవి;

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"
"కమలాక్షునకుఁగాని కాయంబు కాయమే
పవనగుంఫితచర్మభస్త్రి గాక"

అని భక్తితన్మయుఁడై పలుకఁ గలిగెను.

భక్తిరసతరంగితహృదయులై పులకాంకురప్రకరములతో తెలుగువారీ మహాకవి పద్యములను నిత్యపారాయణము చేసినారు. ఈ భక్తి ఆవేశప్రధాన మైనది. తిక్కన భక్తిలో ఆలోచన, ఆచరణ ముఖ్యము. తెలుగు దేశములో భారతమున కంటె భాగవతము జనరంజకముగా నుండుటకు హేతువు అనుష్ఠానము గానముకంటె, కర్మయోగము భక్తిమార్గముకంటె, కష్టమగుటయే. తెలుగువారు తిక్కన సందేశమును గ్రహింపవలె నన్న ఆవేశము నణంచి ఆలోచనతో క్రియాశూరులు కావలెను.

రాజరాజ నరేంద్రుఁడు మహాభారత మాంధ్రీకరింపు మని కోరినపుడు, నన్నయ చెప్పిన సమాధానము గమనింపఁదగినది.

"అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషసారము ముదంబున బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రము దరియంగ నీదను విధాత్రునకైనను నేరఁ బోలునే"

నన్నయమహాకవి తాను భారతభారతీసముద్రము దరియంగ నీద లేనని యారంభించుటకు ముందే తెల్పెను. అంతమాత్రమే గాదు. అది విధాత్రున కైనను నేరఁబోలదు. ఒకవేళ భారతభారతీ సముద్రము నీదఁ గల బ్రహ్మయున్న నతఁడు కవిబ్రహ్మయే గావలెను గదా. అట్టియెడ నన్నయ తన తరువాత రెండువందల సంవత్సరముల పిమ్మట నుద్భవించు కవిబ్రహ్మగూడ భారత భారతీసముద్రము దరియంగనీదబోలఁ దని ముందుగనేవిధించెనా?

తిక్కన మహాకవి, నన్నయ మహాకవి వాక్కుమీఁదగల గౌరవముచేఁ బదునైదు పర్వములు తెనిగించి యరణ్యపర్వ శేషము పూరింపక విడిచిపుచ్చవలెననియే విడిచిపుచ్చెనా?

కొందఱు నన్నయ అరణ్యపర్వము తెనిగించుచు మర ణించె ననియు అందుచేఁ దరవాతి కవు లెల్లరు మహాభారతము స్పృశింప లేదనియు వింత వాదము లేవదీసినారు. అయిన, ఆ రెండు వందల యేండ్లలో నెవరైన తిక్కన వలె విరాటపర్వ మునే యారంభముగాఁ గొని భారతము నేల తెనిగింప లేరు? ఆ రెండు శతాబ్దులు, ఆంధ్రవాఙ్మయచరిత్రలో, సాంఘికరాజ కీయరంగాలలో శైవయుగము. శైవకవులు భారతము స్పృశింపక పోవుటకుఁ గల కారణములు తేట తెల్లములే.

తిక్కన అరణ్యపర్వమును విడిచి పుచ్చుటకు మరి యొక కారణముగూడ నుండ వచ్చును. నన్నయ ఆ పర్వమును రాజ రాజనరేంద్రున కిదివరకే యంకిత మొనర్చియుండెను. తిక్కన దానిని తెనిగించిన రాజరాజున కంకిత మీయవలదా? హరిహర నాథున కిచ్చిన భుక్తశేషము గాదా? ఎఱ్ఱాప్రెగ్గడ తెనిగించి నపుడు అందుచేతనే అరణ్యపర్వమును రాజరాజనరేంద్రునకే అర్పించెను. తిక్కన దత్తశేషము ఈశ్వరార్పణ చేయుట కిష్ట పడక వదలి వేసె నని చెప్పవచ్చును.

కొందఱు నన్నయ్యయే అరణ్యపర్వము నిశ్శేషముగా రచించె నని, యవతారికలోని తిక్కన పద్యము నాధారముగాఁ గొని చెప్పుచున్నారు.

"ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్"

తిక్కన మూఁడుకృతులు అని సమూహముమీఁద చెప్పెను గాని రెండుకృతులపై చిల్లర యని చెప్ప వలెనా? అదియునుగాక, తిక్కన నాటినున్న యరణ్యపర్వము, నేబదిసంవత్సరముల లోపున నెఱ్ఱాప్రెగ్గడ కాలము నాటికి అంతరించిపోవునా? ఒక్క ప్రతిలో నటులైననగుగాక, యావదాంధ్రమునఁగల ప్రతు లన్నియు నేక కాలముతో శారదరాత్రు లనుపద్యము తరువాత మాత్రమే పోవునా? లేవా, ఎఱ్ఱాప్రెగ్గడ పూరించుటయే యసత్యకథనము కావలె! చరిత్ర యంతయు దీనికిఁ బూర్వపక్షమే.

తిక్కనమహాకవి, నన్నయభట్టు మహాకవిని, అవతారికలో మిక్కిలి భక్తితో స్మరించెను. "ఆంధ్రకవిత్వవిశారదుండు విద్యా దయితుండు మహితాత్ముఁడు" నన్నయభట్టు. కొందఱు తిక్కనకు నన్నయభట్టునెడ గల భక్తిని శంకించుచున్నారు. ఇట్టి కుశంక ఉభయకవులకు ద్రోహము. మహితాత్ముఁడైన నన్నయభట్టు మీఁద గాని ఆ విద్యాదయితుఁడు తెనిగించిన కృతులమీఁద గాని గౌరవము తిక్కనకు లేనిచో నతఁ డామూలచూడముగ భారతము తెనిగించియుండును. పదునైదుపర్వములు తెనిగించిన తిక్కన మహాకవికి మఱి మూఁడు పర్వములు బరువా!

తిక్కనకు నన్నయ మహాకవిమీఁద, ఆ మహాకవి రచించిన రతభాగముపై మిక్కిలి గౌరవ మనుటకు సారస్వత సాక్ష్య మున్నది. "అనుకరణమే యే రచయితయెడ నైనను ప్రదర్శింపఁగల అత్యుత్తమగౌరవము" అని యొక ఆంగ్ల సుభాషితము గలదు. తిక్కన ఎన్నియో చోట్ల నన్నయ ననుక రించి, ఆ మహాకవికి మన్ననఁ జెలిపెను. నన్నయ దిద్దిన యొరవడినే యనుసరించి, తిక్కన మహాభారతము "తెనుఁగు

భాస వినిర్మింపఁ బూనెను. కవిత్రయము వారి యాంధ్రమహా భారతము వ్యాసమహాభారతమునకు కేవలానువాదము గాదు. యథోచితానుసరణము.

తిక్కన ఉత్తరరామాయణము నిర్వచనముగా వ్రాయుటకు గద్యపద్యసంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యము గాదను శివకవుల యాక్షేపణప్రభావమే కారణము. కాని, నన్నయ మహాకవి ప్రభావము తిక్కనపై భారతరచనను సంపూర్తిగఁ బ్రసరించెను.

తిక్కన మహాకవి భారతమున నన్నయ 'చంపూ' పద్ధతినే యనుసరించి. "పద్యముం గద్యములన్ రచియించెదన్ గృతుల్" అని నిర్వచనభోరణి మార్చుకొనెను.

అంతియ గాక శివకవుల ప్రచారసాహిత్యదృష్టినిమార్చి, నన్నయసాహిత్యదృష్టినే తెలుఁగు నాట పునఃప్రతిష్ఠ గావించెను. తిక్కన కృత్యాదిని గావించిన వేదవ్యాసమహర్షిస్తోత్రమునకు నన్నయ కావించిన వేదవ్యాసప్రశంసయే మేలు బంతి. నన్నయ జనమేజయసర్పయాగఘట్టమున ఆస్తీకునిచేఁ బల్కించిన పద్యము

"విద్వన్ముఖ్యుఁడు వేదమూర్తి త్రిజగద్విఖ్యాతతేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్యబ్రహ్మసంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁ డయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా
ధ్విద్విష్ణుండవ నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా!

తిక్కన కృత్యాదిపద్యమున నన్నయ వాడిన "ద్వ" కారప్రాసమును శార్దూలవృత్తమునుగూడ గ్రహించి, కృష్ణద్వైపాయన ప్రశంస సల్పెను.

విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రవరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహిత నిష్ఠం బూని కావించె ధ
ర్మైకద్వైవిస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్

దీనినిబట్టి నన్నయపద్యము తిక్కన యంతఃకరణము నావేశించి, యెట్లు పునరవతారము నెత్తెనో స్వయంవ్యక్తమగు చున్నది.

నన్నయ సభాపర్వమున దుశ్శాసనుఁడు ద్రౌపదికి సల్పిన పరాభవమును

"ఆ వనజాననం గురుకులాపశదుండు కడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్రవారిధా
రావళిఁ జేసి పావనము లైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమ మంది చూడఁగన్

అని వర్ణించిన పద్యము తిక్కన మనఃఫలకముపై నెట్లు హత్తుకొనెనో గుర్తింప వచ్చును. తిక్కన యీ సన్నివేశమునే ద్రౌపది నోట శ్రీకృష్ణునకుఁ జెప్పించిన పద్యము స్మరణీయము.

నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టి ననుఁ బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణిఁ బట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చె కులాంగన నిట్లొనర్తురే.

ఇందలి పకార ప్రాసము, 'రాజసూయావభృథంబునందు' శుచియై పెనుపొందినవేణి మున్నగు పదగుంఫనములు ప్రాతఃస్మరణీయుఁడైన నన్నయకు తిక్కన దెలిపిన మన్నన.

వేదవ్యాస, నన్నయ ప్రశంసల తరువాత తిక్కన కృత్యాది యందుఁ దన స్వప్నవృత్తాంతము పేర్కొనును.

తిక్కన స్వప్నవృత్తాంతము మహాభారతరచనమున, ఆంధ్రవాఙ్మయమున, మిక్కిలి ప్రాముఖ్యము వహించినది. ఎందరో కవులు, తిక్కన ననుకరించి తమ గ్రంథారంభము నొక స్వప్నకథతో ముడి వెట్టినారు.

ఆంధ్రవాఙ్మయమున నెన్నియో గ్రంథములకుఁ దత్కవుల స్వప్నములే యాద్యప్రకృతులు. ఏ ముహూర్తమున తిక్కన కా స్వప్నము వచ్చినదో తరువాత యుగయుగాంతరములు స్వప్నకథ సాహిత్యసంప్రదాయమై నిలిచి, కవులు కలలు గనుచునే యున్నారు. కలలు కవులను వెంబడించుచునే యున్నవి.

తిక్కనకు స్వప్నమున హరిహరనాథసాక్షాత్కారము కలిగినది. ఈశ్వరసాక్షాత్కారము సంభవమని అధునాతనులు కొందఱు నమ్మక పోవచ్చును గాని స్వప్నసాక్షాత్కారమును నమ్ముట కెవరి కెట్టి యభ్యంతర ముండ నవసరము లేదు. మనోధర్మపరిజ్ఞాతలు స్వప్నమన స్తత్త్వము పరిశోధించి కొన్ని సిద్ధాంతముల నేర్పరచి యున్నారు.

తిక్కనకు స్వప్నమున సాక్షాత్కరించిన హరిహరనాథుఁ డతనికిఁ బూర్వపరిచితుఁడే. అంతకు ముందే తిక్కన హరిహర నాథునిగూర్చి

"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే"[1]

అని సంస్కృతశ్లోకమునఁ బ్రస్తుతించి యుండెను. స్వప్నమున హరిహరనాథుని తిక్కనకుఁ దండ్రియగు కొమ్మన పరిచయము గావించును.

కరుణారసము వొంగి తొరఁగెడు చూపున
శశిరేఖ సమృతంబు జాలువార
హరినీలపాత్రిక సురభిచందనమున
గతి నాభి ధవళపంకజము మెఱయ
సుస్థిమైన చెలువున నెఱసిన లోకర
క్షణ మసంగ గళంబు చాయ దోఁపఁ
బ్రహ్మసూత్రిఁ దోతెంచు భాసుబింబము నా ను
రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప
సురనదియును గాళిందియుఁ బెరసి నట్టి
కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి
నా మనంబు నానందమగ్నముగఁ జేయ
నెమ్మి సన్నిధి సేసె సర్వేశ్వరుండు.

అని తిక్కన వర్ణించెను. అప్పుడు,

జననమరణామయమైన సంసారదురిత
ముంచు నగపడ కుండంగఁ దొలఁగు తెరువు
గను వెలుంగు నీ కిచ్చితి ననిన లేచి
నిలిచి సంతోష మెద నిండ నెలవు కొనఁగ,

---

1. ఓ ప్రభూ! అలంకారార్థము నీవు ఎముకల దండ కోరుకొందువా? కౌస్తుభము కాదటె యందువా? నీకు కాలకూటము రుచించునా? లేక యశోదా స్తన్యమా? వచింపుము.

మేలుకాంచి తిక్కనమహాభారతము నాంధ్రభాష వినిర్మింప నుద్యమించెను.

కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు నట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్"

అని యారాధనపరిణమైన దీక్షతోఁ బదునేను పర్వములఁ దెనుఁగుబాస "జనసంప్రార్థ్యంబులై పెంపునం దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్" అని తిక్కన మహాభారతము నారంభించెను.

"ఆంధ్రావళి మోదముం బొరయ" "మహాకవిత్వదీక్షావిధి" "నా నేర్చిన భంగి చెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్" "ధర్మాద్వైతస్థితి" "ఆరాధనవిశేషము" మున్నగు ప్రయోగములు విశేషార్థవంతములు. తిక్కన ఆత్మీయతా దీపకములు.

మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుఁడైన తిక్కన శైవము విడిచి 'విష్ణురూపాయ నమశ్శివాయ' యని హరిహరనాథోపాసన సల్పి మహాకవిత్వదీక్షావిధి నొందుటకు అతని మనస్తత్వమునఁ గలిగిన దివ్యపరిణామవికాసమునకు, దోహద మొనర్చిన కారణము లెవ్వియో అనుశీలనార్హములు. అప్పుడు అతని స్వప్న కథలోని అంతరార్థము స్వయం వ్యక్తమగును.

హరిహరనాథుని గూర్చి తిక్కన మననము చేయుచునే కొంత కాలము గడపి యుండవలెను. తిక్కన రచించిన

ధ్యానశ్లోకమే యందులకు నిదర్శనము. తిక్కన నిదిధ్యాసయందు స్థిరరూపము దాల్చిన హరిహరనాథుఁడే స్వప్నరూపమున నాత నికిఁ బ్రత్యక్ష మయ్యెను.

హరిహరనాథునిగూర్చి తిక్కన వ్రాసిన కృత్యారంభ కృత్యంత్యపద్యముల నొకచోఁ జేర్చిన నది యాంధ్రవాఙ్మయము నందు మాత్రమేగాక ప్రపంచవాఙ్మయమునందు గూడఁ బేర్కొనఁ దగిన మహోదారవేదాంతకవిత్వగ్రంథ మగును.

"ఓంకారవాచ్యునకు నన
హంకారనిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా
లంకారోల్లాసనిత్యలాలిత్యునకున్"

ఆ హరిహరనాథుఁడు భావనాతీతుఁడు. శ్రుతిసీమంతమణి. ఆ హరిహరనాథునిగూర్చిన సంబోధనఁ బట్టి తిక్కన మనఃపరిపక్వత యూహింపవచ్చును.

నాదామృతధారాసారరూప! వేదవ్యాసవ్యంజితవిహార!
సంతతానందసాంద్రా!

మహాగాయకునకుఁ బరబ్రహ్మము నాదమే. ఆతఁడు నాదబ్రహ్మోపాసకుఁడు. తమ యుచ్ఛ్వాసనిశ్వాసముల నాద బ్రహ్మము నుపాసించి, తమ గుండెను నాదబిందుకళాస్వరూపుని నయనద్యుతులతో శ్రుతి గల్పుకొని ధన్యులైనారు త్యాగరాజువంటి గాయకులు. కాళిదాసమహాకవి ఈశ్వరస్తవము సల్పుచు

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ

అని కీర్తించెను.

మహాకవికి పరమేశ్వరుఁడు అర్ధనారీశ్వరుఁడై 'వాగర్థముల' వలె సాక్షాత్కరించినాఁడు. నిజమైన కవికిఁ బరబ్రహ్మ వాగర్థముల వలెనే సాక్షాత్కరింపఁ తప్పదు. పరమేశ్వరునకు వాగర్థములకు అభేదమేర్పడినది. కాళిదాసకవి కవితలో తాదాత్మ్యము చెందినాఁడు.

అట్లే తిక్కన మహాకవికిఁ గల్గిన హరిహరనాథసాక్షాత్కారము ననుశీలించినచో నాతని యాత్మీయత అవగతమగును. తిక్కన హరిహరనాథుఁడు "నాదామృతధారాసార రూపుఁడు. నాదము అమృతధారావాహినియై తత్సారము రూపము గొన్నది. నాదమందలి అమృతత్వమును అక్షరరూపమున ప్రస్తరించి సారవంతము చేయుటయే కవిత. తిక్కన హరిహరనాథుని రూపమునఁ గవితోపాసననే సల్పెను. తిక్కనకు హరిహరనాథుఁడుగూడ నాదామృతధారాసారరూపుఁడుగనే సాక్షాత్కరించెను. అట్లే హరిహరనాథుని తిక్కన 'వేదవ్యాసవ్యంజిత విహార' అని స్తుతించెను.

ఇచ్చటఁగూడ తిక్కన ధర్మాద్వైత మభివ్యక్తమగుచున్నది. స్థూలదృష్టికే హరిహరు లిద్దరు. సూక్ష్మదృష్టికి ఒక్కరే. స్థూలదృష్టికి వేదములకు స్మృతులకు నచ్చ టచ్చట వైరుధ్యమేర్పడుచున్నది. సూక్ష్మదృష్టికి వేదోక్తధర్మ మొక్కటే. వేదవ్యాసుఁడే వేదముల నిరూపించి, పురాణముల సృష్టించినాఁడు. అంతట నంతర్వాహినిగా నున్న ధర్మ మొక్కటే. అతఁడే యీ ధర్మాద్వైతము ప్రస్ఫుటము చేయుటకై పంచమవేదమైన మహాభారతము వ్రాసెను. తిక్కన దృష్టిలో ఈ ధర్మాద్వైతమునకు హరిహరనాథుఁడు ప్రత్యక్షదైవతము.

'సంతతానందసాంద్రా!' తిక్కన ప్రతిపర్వాంతమునందలి యాశ్వాసాంతపద్యముల "ఆనంద" శబ్దమును వాడెను. ధర్మాద్వైతసాధకునకీ వికారమయమైన జీవితము, ద్వంద్వబద్ధమైన ప్రాణికోటి అవ్యవస్థితమైన సృష్టి యంతయు, రూపాంతరము నొంది ఆనందమయముగనే సాక్షాత్కరించును. ఈ ఆనందోపాసన జీవన్ముక్తులకే సాధ్యము. తిక్కన జీవన్ముక్తుఁడు. "జన్మాంతర దుఃఖముల్ దొలఁగు నట్లుగ ధర్మాద్వైతస్థితి భారతామ్నాయము రచించి ఆనందోపాసన సల్పెను.

నిత్యప్రకాశుఁడు యోగానుభావ్యుఁడు నైర్గుణ్యగణ్యుఁడు కేవలభావానందమయుఁడునైన, హరిహరనాథుఁడు కౌస్తుభము నస్థిమాలగాఁడ ధరించి నెడ నెడ సాక్షాత్కరించును. అవాఙ్మానసవేద్యమైన పరతత్త్వము నభివర్ణించుటకు, మాటలు తెల్పలేని మహత్త్వము ప్రతిపాదించుటకు, కవియోగులు ప్రపంచమందెల్లెడ ఛాయావాదమును స్వీకరించిరి. ఈ ఛాయావాదము నందలి ప్రయోగము లనుభవైకవేద్యములు.

తిక్కన యాత్మీయతలో నిట్టి మహోజ్జ్వలపరిణామ వికాసము భారతరచనకు ముందు, నిర్వచనోత్తర రామాయణమునకుఁ దరువాత, నేర్పడినది. ఈ మధ్యకాలమున మనుమసిద్ధి గతించినాఁడు. తిక్కన యజ్ఞము చేసి సోమయాజి యయ్యెను. దేశమునందుఁగూడ ఎన్నియో చారిత్రకపరిణామము లేర్పడినవి. అవియన్నియు మననశీలియైన తిక్కన మానసికపరిణామ వికాసమునకు దోహదము కల్పించి యుండవచ్చును.

మనుమసిద్ధి యవసానకాలమున జరిగిన యుద్ధము కాటమ

రాజు కథగా ద్విపదలోఁ బ్రతిష్ఠిత మైనది. ఆ ద్విపదపంక్తు లలనాటి సాంఘికరాజకీయస్థితిగతుల బ్రతిఫలించు అద్దాలమేడలు. ఆ యుద్ధమును గూర్చి, ఆ యుద్ధమునఁ బాల్గొనిన మహావీరుల గూర్చి, దేశములో వ్యాపించిన చాటువులుగూడ తిక్కననాటి వీరపురుషుల యుగము కన్నులఁ గట్టు నట్లు వర్ణించుచున్నవి. కాటమరాజు కనిగిరి సీమలోని ఎఱ్ఱగడ్డపాడున కధిపతి. పెద్దిరాజు కొడుకు. యాదవవంశీయుఁడు. ఇతఁడు అనావృష్టి కారణమున దక్షిణముననున్న మనుమసిద్ధి యడవుల పుల్లరి చెల్లించి పశువుల మేపుకొనుటకుఁ బుచ్చుకొనెను. కాని, కాటమరాజు పుల్లరి చెల్లింప లేదు. మనుమసిద్ధి అన్నంభట్టును, రాయబారిగాఁ బంపి పుల్లరి చెల్లింపఁ గాటమరాజు నడిగెను. కాటమరాజు, మనుమసిద్ధి శత్రువులతోఁ గలిసి పుల్లరి చెల్లింప నిరాకరించెను. మనుమసిద్ధి మహారాజుగారి వేశ్య పెంపుడు చిలుకను కాటమరాజు పసువుల కాపరులు పట్టుకొని యల్లరి చేసిరనిగూడ జనశ్రుతి కలదు.

ఇట్లు కాటమరాజు కథ చిన్ని తగవుగా నారంభమై చివరకు మహారణముగా పరిణమించినది. తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేఁగి చొక్కరాజు, పెద వరదరాజు, అర్లుకొండ అచ్చిరాజు, ఆదిపన్నె మాదిరాజు, గయకొండ గంగరాజు, ఉర్లకొండ సోమన్న, ఉదయాద్రి అమ్మయ్య, చెన్నపట్టణము చంద్రశేఖరుఁడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పాప తిమ్మరాజు, వెలకంచి వెంగళపతిరాజు, పఱిభగిరి పట్టణము పద్మశేఖరుఁడు, మున్నగు వీరులు మనుమసిద్ధి పక్షము చేరిరి. మనుమసిద్ధి సేనలకు ఖడ్గతిక్కన

సేనాపతియై నడిపించెను. ఖడ్గతిక్కన కవితిక్కన పెద తండ్రి సిద్ధనమంత్రి కొడుకు.

కాటమరాజు పక్షమునఁగూడ పల్నాటి ప్రభువు పద్మనాయఁడు, పల్లికొండ ప్రభువు చల్లపిన్నమనాయఁడు, దొనకొండ అయితమరాజు, ఎఱ్ఱయ్య, భట్టావుల రాజు, కరియావుల రాజు, వల్లభన్న, నాళకూళ్ల నాయఁడు, ముమ్మయ్య నాయఁడు, పుత్తరాజు, మున్నగు వీరులు చేరిరి.

కాటమరాజు సేనలకు సేనాధిపతి బ్రహ్మరుద్రయ్యయను నారాధ్యబ్రాహ్మణుఁడు. ఉభయసైన్యములు పాలేటియొడ్డున నున్న పంచలింగాల కడ నెదుర్కొనినవి. ఘోరయుద్ధము జరిగినది, ఇరు పక్షముల భటులు, వీరులు మరణించిరి.

చిట్ట చివరకు మనుమసిద్ధి పక్షమున, యుద్ధభూమిని ఖడ్గతిక్కన యొక్కఁడే మిగిలి యుండుట పిన్నమనాయఁడు గాంచి

"పోరు నిలుపుమోయి భూసురోత్తముఁడ
సరి గాదు మాతోఁడ సమరంబు చేయ
అగ్రజుల్ మీరు యాదవులము మేము
ఉగ్రము మా మీఁద నుంపంగరాదు."

అని పలికె నని కథ.

ఖడ్గతిక్కన చేయునది లేక, గుఱ్ఱమును మరలించి యిల్లు చేరినంత, వీరపత్నియగు నాతని భార్య, యతనికి స్నానోదకములతో పాటు పసుపు ముద్దనుగూడఁ బెట్టి నులక మంచము చాటుంచి,

పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులంమ్మా
మగు రాడు వార మైతిమి
వగ పేటికి జలక మాడ వచ్చిన చోటన్

అని అధిక్షేపించెనట.

వీరమాతయగు తల్లిగూడ నన్నము పెట్టుచు విరిగిన పాలు పోసి

అసదృశముగ నరివీరుఁ
బసమీఱఁగ గెలువ లేక పంచక్రియన్ నీ
వసి వైచి విఱిగి వచ్చినఁ
బసులున్ విరిగినవి తిక్క పాలున్ విరిగెన్.

అని పరిహసించె నట.

అటు పిమ్మట, ఖడ్గతిక్కన యేకాకియై యుద్ధభూమిని జేరి విజయమో వీరస్వర్గమో యని కోరి, వీరస్వర్గ మలంకరించెనని చెప్పుదురు. ఆ యుద్ధము, ఖడ్గతిక్కన పరాక్రమము, ఆ నాడు మిక్కిలి ప్రఖ్యాతి వహించి, ప్రజల మనస్సులపై మిక్కిలి ప్రభావము వహించె ననుటకు, చాటుపద్యములు నిదర్శనములు. ఖడ్గతిక్కన మరణముగూర్చి

ధైర్యంబు నీ మేనఁ దగిలి యుండుటఁ జేసి
చలియించి మందరాచలము తిరిగె
గాంభీర్య మెల్ల నీ కడన యుండుటఁ జేసి
కాకుత్స్థునకు వార్ధి కట్టు వడియె

జయలక్ష్మి నీ యురఃస్థలినె యుండుటఁజేసి
　　హరి పోయి బలి దాన మడుగుకొనియె
నాకార మెల్ల నీ యందె యుంచుటఁ జేసి
　　మరుఁడు చిచ్చునఁ బడి మడిసి చనియెఁ
దిక్కనదండనాథ దేవేంద్రపురికి నీ
వపుగు పెరిగి, సగము తిరుగు టుడుగు
నబ్ధి కట్టు విడుచు, నచ్యుతు క్రొద మాను,
మసఁడు మరలఁ గలుగు, మగలరాజ

అని యొకకవి చెప్పిన చాటుధార. ఖడ్గతిక్కన భార్య సహగమనము సల్పి, వీరస్వర్గ మలంకరించిన భర్త ననుగమించెనని కథ.

ఖడ్గతిక్కన నిత్యజీవితము నింకొక చాటుపు మనోజ్ఞముగ వర్ణించుచున్నది.

వీరనినాదంబు వేదనినాదంబు
　　పాయక యే ప్రొద్దు మ్రోయుచుండు
భూసురపఙ్క్తికరంబు నేసలు చల్లంగఁ
　　బాయ కెన్నియొ కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలు పోసిన జలంబు
　　సతతంబు ముంగిట జాలువారు
రిపుల కొసగిన పత్రికల పుత్రికలను
　　బాయక కరణముల్ వ్రాయుచుంద్రు
మానఘనుఁడైన తిక్కన మంత్రి యింట
మదనసముఁడైన తిక్కన మంత్రి యింట

మహితయశుఁడైన తిక్కన మంత్రి యింట
మంత్రి మణి యైన తిక్కన మంత్రి యింట.

కేతనకవిగూడ దశకుమార చరితమున ఖడ్గ తిక్కనను వర్ణించెను.

వేడిన నర్థార్థి వృథపుచ్చనేరని
దానంబు తనకు బాంధవుఁడు గాఁగ
నెదిరిన జమునైన బ్రదికి పోవఁగ నీని
శౌర్యంబు తన కిష్ట సఖుఁడు గాఁగ
శరణు చొచ్చిన శత్రువరు నైన రక్షించు
కరుణయె తనకు నంగదము గాఁగఁ
బలికినఁ బాండవ ప్రభు నైన మెచ్చని
సత్యంబు తనకు రక్షకుఁడు గాఁగ
జగతి నుతికెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తిరాజమూర్తి
గంధవారణబిరుదవిఖ్యాతకీర్తి
దినపతేజుండు సిద్ధయ తిక్కశౌరి.

సిద్ధయ కుమారుఁడైన తిక్కనకు, కవి తిక్కనకు భేదము తెలియుటకై యతని సమకాలీనులతని ఖడ్గతిక్కన యని పిలిచిరి.

కాటమరాజుతో జరిగిన యుద్ధము తరువాత తిక్కన మనస్సు కురుక్షేత్రయుద్ధానంతరము వేదవ్యాసమహర్షి మనస్సు వలె నుండియుండును. మహర్షి మనస్సునుండి "జయ" ప్రబంధ ముద్భవించినట్లే మహాకవి గంటమునుండి మహాభారతము ప్రస రించినది.

ఈ యుద్ధము శాలివాహనశకము 1170 కాళయుక్తి సంవత్సరము కార్తికశుద్ధపంచమి గురువారము నాఁడు జరిగినట్లు కొండయ్య కొడుకెవ్వరో రాపయ్య వేయించిన శిలాశాసనమునఁ గలదు. కాని, కాళయుక్తి సంవత్సరము 1180 సంవత్సర మయినది. ఆ సంవత్సరమునే స్వీకరించినచో క్రీస్తుశకము 1258–59 సంవత్సరప్రాంతమున నీయుద్ధము జరిగిన దని చెప్పవలసి వచ్చును. మనుమసిద్ధి మహారాజు కూడ, ఈ యుద్ధము జరిగిన కొలది కాలముననే మరణించెనని చెప్పుదురు.

తిక్కన మహాభారతము కాటమరాజుతో యుద్ధము ముగిసిన తరువాత, ఖడ్గతిక్కన మనుమసిద్ధి మరణించిన తరువాత కొంతకాలమున నారంభించెనని చెప్పవచ్చును.

తిక్కన భారతము రచించు నాటికి పండువృద్ధని పైతిప్పాము. అతనికి కుమ్మరి గురునాథుఁడు లేఖకుఁడై యుండగా భారతము నాశువుగాఁ జెప్పెనను జనశ్రుతి యొకటమ్మని కథ కూడఁ బ్రచారములో నిల్పినది. కుమ్మరి గురునాథుని గంట మాగకుండ తిక్కన కవిత చెప్పుట సమయము.

కురుక్షేత్రయుద్ధాంతరమున పదునొకండక్షౌహిణీబలమెల్ల సమసిపోయిన పిమ్మట తిక్కన దుర్యోధనుని స్థితి సంజయుని నోట ధృతరాష్ట్రున కెరింగించుచు

పలపలని మూఁకలోఁ గాక
నిలువక గుజ్జంబు డిగ్గి నీ కొడుకు గదా

1. నెల్లూరు శాసనములు 527 పుట.

కలితభుజుండై యొక్కఁడు
దొలఁగి చనియె.

అని కంద పద్యము మూఁడున్నరపాదములు చెప్పి, యింక చెప్ప వలసినది లేక, పాదపూరణమునకై యేమి చెప్పవలెనో తోచక "ఏమి చెప్పుదుం గురునాథా!" యని సంప్రశ్నించె నని గురునాథ మేమియు నెరుగఁగ అట్లే వ్రాసినను నది కురునాథుఁడైన ధృతరాష్ట్రుని సంబోధనగాఁ గథతోపాటు కందపద్యముతోఁగూడ నతికి పోయిన దని చెప్పుదురు.

వేదవ్యాసుని భారతరచనమును గూర్చికూడ నిట్టి కథ గలదు. అచ్చట గణపతి యతనికి లేఖకుఁడు, గంట మాఁగకుండ వ్రాయుట తుల్యసమయము. వ్యాసుఁడు గణపతిని శ్లోకము నర్థము చేసికొనిన పిమ్మటనే వ్రాయవలె నని నిర్ణయించెను. అందుచే నెడనెడ వ్యాసఘట్టములు. వానిని గణపతి యవగాహన మొనరించుకొనులోపల వ్యాసుఁడు కవిత చెప్పుచుండెడివాఁడు. వ్యాసునకు గణపతి వలె నపరవ్యాసుఁడగు తిక్కనకు గురునాథ మేర్పడెను. అందులకుఁ బూర్వోక్త పద్యముకాంతఁ జక్కఁగఁ గలిసి వచ్చినది. ఇందలి సత్యాసత్యము లెటులున్నను, కథ మాత్రము రక్తి కట్టినది.

తిక్కన నాటి మహాయుద్ధములు రాయబారములు రాజనీతి వీరధర్మము, మహాభారతయుగమును భారతయుద్ధములను స్ఫురణకుఁ దెచ్చును.

మనుమసిద్ధి రాజ్యభ్రష్టత, తిక్కన రాయబారము కాకతి గణపతిదేవచక్రవర్తి సాయము, అన్నంభట్టు రాయబారము,

ఏకైకవీరుఁడు ఖడ్గతిక్కన యెక్కటి పోరు మున్నగునవి మహా భారతవీరయుగమును స్ఫురింపఁజేయు సన్నివేశములు. ఈ విధముగా కవికి కావ్యమునకు, కవికాలమునకు కావ్యయుగమునకు, బింబప్రతిబింబభావము సమకూరినది. తిక్కన మహాభారతము నందిట్టి ఆత్మనివేదనమే సలిపెను. అందుచే ఆంధ్ర మహాభారతము స్వతంత్రసృష్టియై యందు తిక్కన స్వీయానుభవము జీవనాడివలె స్పందించుచుండును.

కావ్యములయందలి పాత్రలు బహుళముగా తోలుబొమ్మలు. ఆ పాత్రలు మాటాడునపుడు వెనుకనుండి కవి వాక్కే వినిపించుచుండును. దానికిఁ గారణము కవిజీవితమునకు కావ్యవృత్తమునకు జీవదనుబంధము లేకపోవుటయే. అట్టి కవులు పాత్రలను నిర్మింపఁగల కవికుంభకారులే గాని ప్రాణప్రతిష్ఠ సలుపఁ గల కవిబ్రహ్మలు కాఁజాలరు. తిక్కన తాను సృష్టించిన పాత్రలకు జీవరేఖలు తీర్చిదిద్ది ప్రాణప్రతిష్ఠ సలుపఁగలిగిన కవిబ్రహ్మ. ఉత్తమ కవు లందరి కీ ప్రజ్ఞ యుండును. తిక్కనలో నీ ప్రజ్ఞ విశేషము. తిక్కన సృష్టించిన ద్రౌపది, పాండవులు, దుష్టచతుష్టయము, భీష్మద్రోణాదివీరులు, ఉత్తరుని వంటి ఉపపాత్రలు కూడ సాహితీప్రియంభావుకుల మనఃఫలకముల శాశ్వతముగా హత్తుకొని యుండుటయేగాక ఆంధ్రవాఙ్మయప్రపంచమున చిరంజీవములు.

తిక్కనకుఁ బ్రథమమున విరాటపర్వముమీద నభిమాన మెక్కువగఁ గోచరించును. "హృదయాహ్లాదిచతుర్థ మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి"గ విరాటపర్వము తీర్చిదిద్దెను. తిక్కన

కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వ ప
ర్వార్థయుక్తి సేయునట్టి యెడల
యత్న మించు కంత యయినను వలవదు
వలసి నట్లు చెప్ప వచ్చియుండు

అని విరాటపర్వము నారంభించెను. ఈ పద్య మరణ్యపర్వశేష మును బట్టియే వ్రాయక తప్పినది గాదు. నన్నయ మూఁడు పర్వ ములు సంపూర్తిగఁ జెప్పిన యెడలఁ బూర్వపర్వకథ ప్రసక్తియే లేక కథ యతుకు లేక కలిసిపోవును. అయినను తిక్కన, యరణ్య పర్వశేషము పూరింప నిష్టము లేక విరాటపర్వము నారంభించుట కుపపత్తిగ కథ జగత్ప్రసిద్ధి యని చెప్పి యుపక్రమించెను.

అయినను ధర్మరాజు ముఖమున, విరటు కొలువు కూట మున నతిలోకశూరులై, సెగడిన తన తమ్ము లెట్లు మెలఁగ గలరో యను విచారమునఁ, బూర్వకథను వివరించెను. ధర్మరాజు

కడిమిమై సౌగంధికమున యక్షుల మద
మడఁచి కృష్ణకుఁ బువ్వు లట్లు దెచ్చెఁ
గిమ్మీరదానవు నమ్మేయి నిర్జించి
విగతకంటకము గావించె వనము
బకదైత్యుఁ దొడరి యా భంగి రూపఱఁ జేసి
రక్షించె నేకచక్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జటాసురు నదరి
దండితుఁ జేసి మనఁ బెట్టించుకొనియె
వితడు పుట్టిన కోలెను నెసక మెసగు
దర్పముననె వర్తిల్లు నుదగ్రహృదయుఁ

దకట యిరు చిత్తమున కెక్కునట్లు గాఁగ
మెలఁగి యే విధంబునఁ గొలుఁచు వాఁడు

అని భీముని గూర్చి,

ఖాండవ మేర్చె, దేవతలఁ గాసని యీశ్వరుఁ గాంచె, దోర్బలో
ద్దండమహాసురప్రకృతి దర్ప మడంచి ప్రియం బొనర్చె యా
ఖండలుఁ డున్న గద్దియ సగంబున నుండె, మహానుభావుఁ డీ
లండొక మర్త్యుఁడెరి యనువార్తత నెమ్మెయి గొల్చు వాఁడొకో

అని అర్జును గూర్చి సంతాపము చెందును. ఈ పద్యము లందలి ఘట్టము లన్నియు భీమార్జునపరాక్రమసలు మాత్రమే గావు. ఖాండవదహనము, కిరాతార్జునీయము, సౌగంధికాపహరణము, బకాసురవధ మున్నగు మహోజ్జ్వలసన్నివేశములందు నన్నయ మహాకవి పరివర్ణించిన పరిశీధను దంచి తిక్కన సమర్పించిన సరససాహృదకవితాకర్పూరనీరాజనములు.

నన్నయ ఉత్తమకథకుఁడు. అక్షరరమ్యత ప్రసన్నకథా కవితార్థయుక్తిలోఁ బాండవుల శైశవకథ రాజ్యత్యాగము వర్ణించెను. నన్నయ చిత్రించిన పాండవులు పరమపవిత్రులు. వారి హృదయములు సుకుమారకోమలనిర్మలములు. "మేను లేత, ఉల్లము మెత్తన". అజ్ఞాతవాసములోఁ బాండవుల జీవితములో నూత్నఘట్ట మారంభమైనది. వారు జీవితసమరము నెదుర్కొనుట కుద్యుక్తులు కావలెను. భీముఁడే గాక పాండవు లందఱు "పుట్టిన నాటను గోలెను నెనక మెనఁగు డర్పమునన వర్తిల్లు నుదగ్ర హృదయులు ఒరు చిత్తమున కెక్కునట్లు' ఎట్లువర్తింతురో

తన భారతభాగమున నని తిక్కనమహాకవియే తన భారము వివరించుకొనెను. తిక్కన భారతభాగమున పాండవులు క్రొత్తవేషములు వేసి, తమ స్వభావములు మార్చి నూత్న భూమికలు ధరించిరి. తిక్కనకు నాటకీయశైలి. కథలోఁ గలిగిన మార్పుగూడఁ జక్కఁగఁ గలిసి వచ్చినని. నన్నయకథాకథన శైలితోపాటు తిక్కన నాంధ్రవాఙ్మయమునకు నాటకీయమైన భిన్న కవితాశిల్పము ప్రసాదించెను.

తిక్కన ఇంగితజ్ఞుఁడు. పాత్రల చిత్తవృత్తుల వర్ణించుట యందు మిక్కిలి గడుసరి. కథను నాటకీయముగ సంభాషణము ద్వారముననే నడపును. సంభాషణచాతురి యాతని కవితాశిల్పమునకు వన్నెఁ బెట్టినది. అంతి యలతి మాటలతో తెలుఁగు నుడికారపు వంపులు సొంపులు తామరతంపరగ నేరికూర్చి కమ్మని తీరు తియ్యములు తిక్కన కురిపించి తనకవిత తీర్చి దిద్దుకొనెను. నన్నయనాఁడు శకునితో మాయాద్యూతమున రాజ్యమెల్లను గోలుపోయిన ధర్మరాజు, అన్నమాట పటుగు దాటని యతని తమ్ములు అమాయిక కోమలులు, పరమ పవిత్రులు, తిక్కననాఁడు వేయని వేషములు లేవు పోవని గడుసరి పోకడలు లేవు. చిత్రవిచిత్రవిభ్రమములు నేర్చి గడిదేరిరి.

ధౌమ్యుఁడు పాండవులకు లోకజ్ఞాన ముపదేశించెను. రాజగృహంబు కంటె నభిరామముగా నిలు గట్టఁ గూడదు.

వసుమతీశు పాల వర్తించు నేనుంగు
తోఁడ నైన దోమతోడ నైన
వైరమగు తెలుఁగు వలవదు తారెంత
పూజ్యులైన జనుల పొందు లెస్స.

రాజుల మనస్తత్త్వము తిక్కన మరపురాని మాటలతో మనోజ్ఞముగ వర్ణింపఁ గలిగెను. తిక్కన వంటి మనోధర్మ పరిజ్ఞాత యైన కవి ప్రపంచవాఙ్మయమున నరుదు.

అరణ్యవాసమునకు జను నప్పుడు కుంతి పాండవుల నందఱిగూర్చి ద్రౌపదితోఁ జెప్పుచు సహదేవుని గూర్చి

కడు పసి బిడ్డ వీఁడొకటి
గాదపు నా నెఱుఁగండు ముందర రె
య్యెడ నొక పా టెఱుంగఁ డెవ యంతయుఁ
గోమల మెప్పుఁడైన నేఁ
గుడువఁగ బిల్తుఁ గాని తనకుం
గల యాకటి ప్రొద్దెఱుంగఁ డీ
కొడుకిటు పోకకున్ మనము
గుందెడు నిన్ గని యూఱడిల్లెడున్

అని చెప్పెనట. ఈ మాట ద్రౌపది వెనుచూపు తలపుఁగఁ బూర్వ కథావృత్తాంతమును భీమునకుఁ దెల్పును. ఆ ఘట్టమునే తిక్కన వెనుదిరిగి కుంతీమనస్సును మథించి హృద్యముగ వర్ణించెను. కుంతి మనోవేదన, ఆమెకు మాటలలోఁ గల నేర్పు, పరేంగిత జ్ఞానము, ఆ మాటలు ద్రౌపది మనస్సులో ప్రసరించిన ప్రభావము మహాద్భుతము. కుంతి మాతృహృదయము, ద్రౌపది లోని స్త్రీత్వము, చక్కగ నభివ్యక్త మైనవి.

ఈ ఘట్టము నన్నయ మహాకవి ప్రసన్నకథాకవితార్థ యుక్తి, అక్షరరమ్యతతో గంభీరముగ కదలిపోయినది.

"తడిసిన యేకవస్త్రపరిధానముతోడ విముక్తకేశియై
తొడరుచు దుఃఖభావమున ద్రోవది వోయె మహాహవంబునం
బడిన నిజేశమిత్త్రసుతబంధుజనంబుల శోకవేదనం
గడుకొని యిట్ల యేగుదురు కౌరవ భామినులన్విధంబునన్."

ధౌమ్యుఁడు గూడ "రౌద్రయామ్యసామోద్గీతి" నరిగెను.

నన్నయ పాత్రములలో పవిత్రత, తిక్కన పాత్రములలోఁ బ్రగల్భత గోచరించును.

యతివేషమున ధర్మరాజు విరటుని కొల్వుఁ జేరినపుఁడు "ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది" "ఎఱిగింపుఁ డున్నరూపు" అని విరటుఁడు ప్రశ్నించును.

శకుని చేతిలో సమాయికముగ మాయాద్యూతమున నోటు వడిన ధర్మరాజు తిక్కన చేతిలో గడిఁదేరినాఁడు. విరటుని ప్రశ్నల కంతు చిక్కకుండ తిక్కన ధర్మరాజు చెప్పిన గడుసరి సమాధానములు మరపునకు రానివి.

"ఉన్న రూప పలుకు నన్నరు లెక్కడఁ
గలరు తోఁచి నట్లు పలుకు వలుక
నైన చంచ మయ్యె నంతియ కా కంత
పట్టి చూడఁ గలరె యెట్టివారు"

అని మందహాసంబు సేయుచు మఱియును

నానావిధభూతమయము
మే నతిచంచలము మనము మెయికొని నిక్కం
బే నరునకుఁ జెల్లింపం
గా నగు సత్యంబు నడపు క్రమ మట్లుండెన్"

అని సత్యము దప్పకయే "ద్విజుఁడ గురువిషయజాతుఁడ" నని చెప్పి తప్పించుకొనఁ గలిగిన ప్రగల్భుఁడు తిక్కన ధర్మరాజు.

ఈ ప్రగల్భత ధర్మరాజునకే గాక తిక్కన భీమార్జున నకుల సహదేవులకుఁ గూడఁ గల్గినది. భీముఁడు,

"దేవా నా౦వజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత నొండుమై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చు న
ట్లే వండం గడు నేర్తు బానసమునం దిచ్చోటనే గాదు న
న్నే వీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్భంగులం జూచినన్"

అని యర్థాంతరస్ఫురణము చిందులాడఁ బల్కెను. బంత భీము నకుఁగూడ మహాకవి తిక్కన ఎంతటి మాటల నేర్పు, ప్రగల్భత నేర్పఁ గలిగెను! అర్జునుఁడు పేడి రూపమునఁ బోయిఖాండ

"ఆడుఁ దనంబు నిక్కమున కారసిచూచిన లేమ పుంస్త్వముం
బోడిమి తప్పియున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్యమై
వాఁడిమి గల్గు శాపమున వచ్చె" అని చతురముగఁ బల్కెను.

నకులుఁడుగూడ నన్నలకుఁ దీసిపోలేదు.

"ధర్మసుతుండు పెంచె ననుఁ దాన తురంగమశాస్త్రశిక్షకుం
గర్మఠుఁ జేసె యాత్మతురగంబుల కెల్లను నన్ను యుక్తిగా
నర్మిలి నిల్పి యాఁగిముఁ బ్రియంబును నా మెఱ నాడు దాటిరిం
బేర్మి వహించుచుండ నడపెం దన తమ్ములలోని వానిగన్"

అని అంతు చిక్కకుండగ నసత్యము చెప్పకుండగనే చెప్పి తప్పించుకొనెను. తిక్కన మహామంత్రి నడపెడి పాత్రములు మాటలలో నొరులకుఁ జిక్కుదురా!

సంకేతసమయము ప్రకారము కీచకుఁడు సత్త్రసశాల చేరును. మగఁడు వేసికొని ద్రౌపదివలె భీముఁ డాతని నిరీక్షించుచుండెను.

"కీచకాధముండు గిమ్మిరవైరిపైఁ
గేలు సాఁచి యా విశాలనయన
గాఁ దలంచి మేను గఱు పార" దరిఁజేరి సరససల్లాప

ముల నారంభించెను. భీముఁడు

"నా యెడలు నేర్చి నవ్వున
నీ యెడ లెట్లగునో దాని నీ వెఱిఁగెదు న
న్నే యబలల తోడిదిగాఁ
జేయఁ దలంచితివి తప్పు సేసితి గంటే

నను ముట్టి నీవు వెండియు
వనితల సంగతికిఁ బోవువాఁడవె"

అనుచుఁ గ్రక్కున నతని దల వట్టుకొనెను.

తన యగపా టూరు లెఱుఁగుదు
రని సూతుఁడు సమయభంగ మగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢమర్దనప్రహారములఁ దగన్

మల్లయుద్ధనైపుణ్యము మెఱయఁ జేసిరి.

ఈ రౌద్రబీభత్ససన్నివేశమునకు అంతర్వాహినిగ వెల్లి విరిసిన తిక్కన నిశితనిర్భరహాస్యచాతురి అత్యద్భుతము.

ఉత్తరకుమారుఁడు చక్కఁగఁ గను విచ్చి పేడిఁ జూచ రోయు" వీరుఁడు, "ఎత్తునఁ గొందుఁ గొరవుల నెల్లను మార్కొని భేని గోవులం దెత్తు ముహూర్తమాత్రమున" నని "అంతిపురంబు

లోనఁ గల యంగన లెల్లను నెమ్మనంబునన్ సంతస మందఁ పల్కిన వాక్యార్థము "కౌరవసేనఁ జూచి పతకం" దొడఁగి రథము నాప, సారథియగు నర్జును వేడెను.

"విప్పచ్చుంతు తేరుపోవ నిచ్చుటయు నాననంబు వల్లటిల్ల మానసంబు తల్లడిల్ల నా భూవల్లభకుమారుండు

దవ్వుల విటిగినఁ బౌరులు
నవ్వుదురటె మేలు మేలు నను నాఁగకు నీ
క్రొవ్వాఱుంగ దేనిఁ దలపకు
మెవ్విధి జనితేని యనుచు నెత్తిన భీతిన్
శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్.
ధరణికి లంఘించి వెసం
బురి దెసకును లజ్జ వీటిఁ బోవం బాఱెన్"

అర్జునుఁ డప్పుడు పదశతమాత్రపలాయితుండగు భూమింజయు సెయివి పట్టుకొనిన నతండు

వెల వెల బాఱుచు వెగడొందుఁ బెదవుల
తడి యాఱ నెంతయుఁ దల్లడిల్లుఁ
జల్లన నంగంబులెల్ల నిండఁ జెమర్చుఁ
బదములుఁ గరములుఁ గుదియ వడఁకు
హృదయంబు దట తట నదరంగఁ బలుకులు
దీనదృష్టుల మోముఁ దేటి చూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడువు మని.
ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప

నిష్కళంకశుద్ధహేమంబు నిర్మలోజ్వ
లాప్తవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశశతంబు నొక యూరుఁ బురము నొప్పి
నవుడ యిచ్చెద నీకను నార్తుఁడగుచు.

తిక్కన ఉత్తరకుమారపాత్రమునకుఁ బ్రాణప్రతిష్ఠ నలిపి యతని నాంధ్రవాఙ్మయమున చిరంజీవిని సల్పెను. ఇచ్చట తిక్కన చిత్రకారునకుఁగూడ నగమ్యమైన ఉత్తరకుమారుని క్షణక్షణపరిణామవిహ్వలమైన యాకృతిని మనోజ్ఞముగఁ జిత్రింపఁ గలుగుటయే గాక ఇంగితజ్ఞులకుఁగూడ నందని యతని చిత్తవృత్తి నత్యద్భుతముగ వర్ణింపఁ గలిగెను. ఈ ఘట్టమునందు తిక్కన నిశితనిర్భరహాస్యచాతురి జీవత్పాత్రచిత్రణము గంగాయమునల వలె సంగమించినవి. ఉత్తరకుమారుఁడు జీవత్పాత్రము. నేటికిని సజీవుఁడు. కనులు విప్పి చూచిన, వీనులు విప్పి వినిన, నేటికి మన కెందఱో ఉత్తరకుమారులు కనుపించుచుందురు. ఉత్తరకుమారప్రజ్ఞలు వినిపించుచునే యుండును.

ఉత్తరుని సారథిగాఁ గైకొని వచ్చుచున్న నర్జునుఁజూచి, శిష్యవత్సలుఁడగు ద్రోణుఁడు అజ్ఞాతవాససమయభంగము శంకించి నితరు లెఱుఁగకుండు నట్లుగ భీష్మ వదనంబు వీక్షించి పలికిన పలుకులలోని సుకుమారమైన యర్థాంతరస్ఫురణము మనోజ్ఞము.

"వెరవరి గాక వీఁడు కురువీరులకుం బొడసూపు వాఁడె య
చ్చెరు వొక క్రమాని పేర నిట సేరగవచ్చుచు నున్న వాఁ డహం
కరణమ కాని యొండొకటి గానఁడు మూర్తివిశేష మారయన్
సురపతి యట్ల వీని మది చొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడుఁ"

ఆ మాటలు విని ద్రోణుఁడు సందియము మాన్ప భీష్ముఁడు దుర్యోధనునితోఁ బలికినట్లు సగూఢార్థస్ఫోరకముగ

"తలఁపఁగ రిపులకు సమ్మగు
కొలఁది గడచి వచ్చితిమి యకుంఠితబాహా
బలము నెఱపఁ దటి యయ్యెను
జలింపవల దింక మనకు శత్రులవలనన్"

అని పల్కెను. ఇట్టి గడుసరితనము తిక్కన భారతమునం దెల్లెడఁ గానుపించునదే. అర్థాంతరస్ఫురణ కెయ్యెడ తిక్కన శ్లేష వాడ లేదు. ప్రయోగసామర్థ్యమువలన నేర్పడిన శబ్దశక్తినే యుపాసించి ధ్వనిప్రధానమైన యుత్తమకావ్యసృష్టి సల్పెను.

అజ్ఞాతవాసానంతరము పంచపాండవులు విరటుఁడు రాక మునుపే కొలువు కూటము చేరి "ధర్మరాజు సింహాసనమున, భీమాదు లాత్మసముచితరుచిరాసనములఁ, బంచాగ్నులనుబోలె" గూర్చుండిరి. విరటుఁడు వచ్చి, యెల్లిద మని భావించి

"ఇది యేమి కంక నీవు
న్మదవృత్తిని శంకఁ దక్కి నా గద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి
వదియును గాకిపుడు దిగ వహంకారమునన్".

అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కిట్లనియె

నడచిపియలు సేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన మనుజపతులఁ
దగు నాజ్ఞ సూయాణముగ నొనరించె
మంచిగ నేల నాలుఁగు సెఱఁగులకును

ప్రీతార్థిజనుల సమేతసత్యాగపక్ష
జములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కు లన్నింటను దేలఁ బారు పూఁత గా
వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు
రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య
సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ
రాజు సుమ్ము మత్స్యావనీరమణ యితఁడు

ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబు సేసె వీ
ర్యాతిశయార్థి వాసవు మహాసన మైనను నెక్క నర్హుఁడు
ద్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీ చిఱుత గద్దియకుం దగఁడే నరేశ్వరా!

ఇందలి నాటకీయత; సంభాషణచాతురి; సీసపద్యము నందలి యుయ్యాల యూఁగు; కమ్మని తేట తెలుఁగు నుడికారపు నయగారములు ఔచితీపాలనము తిక్కన సర్వతోముఖప్రతిభకు నిదర్శనములు.

పై సీసపద్యము కీచకవధయందు ధర్మరాజునుగూర్చి ద్రౌపది భీమునితో ననిన పద్యమును స్మరణకుఁ దెచ్చుచున్నది.

ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వాని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపుఁ గఱపు
నెవ్వాని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద లీనుచుండు

నెవ్వాని గుణలత లేఁకు వారాసుల
కడపటి కొండపైఁ గలయఁ బ్రాఁకు
నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు

సీసపద్యమున నే చరణమున కాచరణమే స్వయంసంపూర్ణ మగు నర్థసమృద్ధితో నుయ్యాల తూగుతో నడిపించుట తిక్కన యారంభించెను. శ్రీనాథుని చేతిలో సీసము సిద్ధిఁజెందినది.

పెద్దన శ్రీకృష్ణదేవరాయల నభివర్ణించుచుఁ జెప్పిన సీస పద్యములకు తిక్కన ధర్మరాజుపైఁ జెప్పిన సీసపద్యములే ఒజ్జ బంతులు. మనుచరిత్రపీఠికలో శ్రీ కృష్ణదేవరాయల వంశాభి వర్ణన ముదాహరణము.

"కలశపాథోరాశిగర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్న తల్లి
యనఘాత్ము ఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టు ననర్ఘ్యంపుఁ బువ్వు
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాని
పుట్టు కామని లేని మెట్ట పంట
కటికి చీఁకటి తిండి కరముల గిలిగింత
నెవ్వాఁడు తొగ కన్నె నవ్వఁ జేయు
నతఁడు వొగడొందు మధుకైటభారి మఱఁది
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు

మిసిమీ పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగుఁదొరజోడు రేవెలుంగు"

మఱియు

ఉదయాచలేంద్రమ్ము మొదల నెవ్వని
కుమారతకుఁ గ్రౌంచాచలరాజ మయ్యె
నావాడపతిశకంధరసింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఖరతరాసి
కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని
కసివారుగా నేగు నట్టి బయలు
సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖి
ప్రబలరాజాధిరాజవీరప్రతాప
రాజపరమేశబిరుదవిభ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యు
డొక్క నాఁడు కౌతూహలం బుప్పతిల్ల".

పెద్దన, తిక్కన సీసపద్యపు మూసలనే యనుకరింపఁ గలిగెను గాని యాతని సీసములందలి కవితాశిల్పము నంతటిని సమగ్రముగ సంగ్రహింప లేదు.

కవితాశిల్పము వాగర్థముల యతిలోక దాంపత్యము. వాగర్థముల కలయిక అర్ధనారీశ్వరుఁడైన పరమేశ్వరునిలోని అద్వైతయోగము వంటిది. కవి వాగర్థములను జోడుగుఱ్ఱముల నేక కాలమున స్వారి చేయు నేర్పు నలవరచుకొనవలెను. రెండు గుఱ్ఱములును ఆరితేరినవే కావచ్చును. కాని అవి ఒకే వేగమున

పరుగెత్తవలెను. ఆ పరుగులో గిట్టల చప్పుడులోఁ గూడ అపశ్రుతి వినిపింప రాదు. ఇది కవికి అసి ధారావ్రతము. భాషను మించి భావము, వాక్కును మించి అర్థము, పందెపు పరుగు తీయునపుడు ఏ గుఱ్ఱము గెలిచినను కవితారథమునకు ప్రమాదపతనము సంభవింపవచ్చును. ఎట్లో రెండు గుఱ్ఱములు కలిసి రథము నీడ్చినను ఊపు, కుదుపు మాత్రము తప్పదు.

నన్నయ వాగర్థముల జోడు గుఱ్ఱముల స్వారిలో ఆరితేరిన మహారథికుఁడు. నన్నయ కవితారథ మెంత నిమ్నోన్నత భూములలో గమించుచున్నను ఆ జోడు గుఱ్ఱములు, వాగర్థములు; భాషా భావములు; ఒకే వేగములో పరుగిడును. ఆ గుఱ్ఱముల గిట్టల చప్పుడుగూడ ఒకే శ్రుతికి అనుస్యూతమై, మృదంగ సుస్వనమువలె తాళలయాన్వితముగ వినిపించును. నన్నయ కవితారథములో కుదుపు లేదు; కంపము లేదు; ఒడుదుడుకులు లేని మల్లెపూల బాటపై మెత్తగఁ గదలిపోవును.

బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరిత్స్వతీ
సహితమహామహీధర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన యు
య్యహిపతిమష్కృతాంతకుఁడనంతుఁడుమాకుబ్రసన్నుఁడయ్యెడున్

నన్నయ పద్యములు వేదఋక్కులు. కవితాగమనము సామగానము.

తిక్కన పద్యశిల్పమునఁ గూడ వాగర్థములు జోడు గుఱ్ఱముల స్వారి వలెనే నడచును.

"ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నణఁగు"
"నడదివియలు చేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన మనుజపతుల"

అన్న పద్యములందు వాగర్థముల అనుకూలదాంపత్యము వర్ణనాతీతము.

ధర్మరాజు వాకిట మత్తేభముల దానోదకముచే బురదయైనది. సామంతరాజుల భూషణముల రాపిడిచే నేర్పడిన బంగారు ధూళిచే నా బురద యణఁగుచున్నది.

ధర్మరాజు ఆ నగరియందు మణికిరీటములు దాల్చిన మనుజపతులనే జంగమణిప్రదీపస్తంభములుగ నిలిపెను. ఇందు భాష : భావము గంగాయమునల వలె సంగమించినవి.

పెద్దన రచించిన "కలశపాథోరాశిగర్భవీచిమతల్లి కడుపార నెవ్వాని గన్న తల్లి" అన్న పద్యమునందు వాగర్థముల జోడు గుఱ్ఱపు పందెపు పరుగున వాగశ్వమే గెలుపు నందినది. ఆ సీసపద్య మంతటిని ఒక్క ముక్కలో "చంద్రుఁడు" అని అన వచ్చును. పదముల అల్లి బిల్లి అల్లిక సల్పిన యింద్రజాలమది. అది "అల్లసానివాని అల్లిక జిగిబిగి". ప్రబంధకవులు సౌందర్యలాలసులు. తెలుఁగు ప్రబంధములు సాహిత్యోద్యాన వాటికలు. అందలి పద్యము లన్నియు పెంపుడు లతలు; పెంపుడు చెట్లు. ఉద్యానవాటికలలో ఉల్లాసము కొఱకు పువ్వులు పూయని ఆకు చెట్లను నాటి నట్లే, ప్రబంధములందుగూడ పదాడంబరముతోఁ గూడిన పద్యములు కవులు వ్రాసినారు. కనుకనే,

మనుచరిత్రోద్యానవాటికాముఖద్వారమున ముచ్చటతో "కలశ పాథోరాశి" సీసము పెద్దన నాటుకొన్నట్టి ఒక పూవులు పూయని పెంపుడు ఆకు చెట్టు.

ప్రబంధకవుల పద్యములు బహుళముగా పుష్పాలు కన్పింపని ఆకుల పొదలు. తిక్కన పద్యములు ఆకులు కన్పింపని పూల గుత్తులు.

వసుచరిత్ర వంటి సుందరకావ్యము సమకాలీనమైన విఠలరాయాలయమును స్ఫురింపఁ జేయును. విఠలరాయదేవాలయ మందలి శిలారథము, సప్తస్వరమండపము ఉజ్జ్వలశిల్పముల కెనయై వసుచరిత్రలోని కవితాశిల్పము సాక్షాత్కరించును. విఠలరాయాలయమందు దేవతాప్రతిష్ఠ జరుగ లేదు: ఆలయ శిల్పములు దేవుని మాటగూడ మరపింపఁ జేయును. తిక్కన మహాభారతము హరిహరనాథదేవాలయము. అచ్చట దేవాలయ ప్రాధాన్య మేమియు లేదు. దేవాలయమే గోచరింపదు. హరిహరనాథుఁడు విగ్రహరూపమునఁ గన్పింపడు. పరంజ్యోతియై సాక్షాత్కరించును. "రసో వై సః"- అతఁడు రస స్వరూపుఁడు అన్న వేదవాక్యార్థము సార్థకముగ స్వీకరించిన తిక్కన మహాభారతమున రసస్వరూపమున నున్న పరంజ్యోతి సాక్షాత్కరించును.

భాష : భావము! వాక్కు : అర్థము కావ్యప్రపంచమున శరీరము: ప్రాణము వంటివి. అవి అవినాభావసంబంధము కలవి. ప్రాణము లేని శరీరము శవము. శరీరములేని ప్రాణము దయ్యము. శరీరప్రాణముల రమణీయసమ్మేళనమే సృష్టిశిల్పము: రమణీయకావ్యశరీరమును నిర్మించుటయందు, చక్కని చిక్కని

పద్యముల వ్రాయుటయందు చాలమంది కవులు కృతకృత్యులు కాఁగలరు. కాని తిక్కన కావ్యశిల్పమున ప్రాణప్రతిష్ఠ నల్పిన కవిబ్రహ్మ.

కొందఱు కవు లీ కావ్యశరీరమునకు సాహిత్యాలంకారముల సమకూర్తురు. సముచితాలంకరణము సౌందర్యావహమే గాని, ప్రకర్షాన్వితమైన అలంకారలాలసత ఆడంబరమే యగును. వ్యావహారికజగత్తునందు వలె సాహితీజగత్తులోఁ గూడ ఉత్తములు నిరాడంబరమూర్తులే. శరీరసౌందర్యముకంటె ఆంతరాత్మ పవిత్రత గొప్పది.

కవిత్రయమువారు కావ్యమున అంతరాత్మపవిత్రత, పిమ్మట శరీరసౌందర్యము, నెంచిరి. తరువాత ప్రబంధకవులు శరీరసౌందర్యము పిమ్మట ఆత్మికసౌందర్యము నెంచిరి.

కవి అంతరాత్మ కావ్యములో నావిష్కృత మగును. తిక్కన భారతము ననువదించినను, స్వీయజీవితానుభవనివేదనమే సలిపెను. తిక్కనయుగము భారతయుగమునకు ప్రతిబింబమే. తిక్కన యోధుఁడు. ఎన్నియో యుద్ధములఁ జేసినవాఁడు. చూచిన వాఁడు. యుద్ధతంత్ర మతనికి వెన్నతోడఁ బెట్టిన విద్యయే. ఖడ్గతిక్కనవంటి వీరుల వంశమునఁ బుట్టినవాఁడు. కులక్రమానుగతమైన మంత్రిపదవి నిర్వహించి రాయబారముల జయప్రదముగ నడపి రాజనీతినే వృత్తిధర్మముగ స్వీకరించినవాఁడు. తుదకు సోమయాజియై హరిహరనాథోపాసన సల్పిన తిక్కన్న.

మహాభారతసార మన దగిన రాజనీతి, యుద్ధతంత్రము, బ్రహ్మవిద్యోపదేశము తిక్కన ఆత్మీయతలో లీనమై యున్నవి.

తిక్కన భారతరచనమున నలిపినది తన యాత్మీయతావిష్కరణమే. సంజయ శ్రీకృష్ణుల రాయబారముల చిత్రించుటకు తిక్కనకు సహజాధికారము కలదు. సంజయుఁడు ధర్మరాజుతో

"పాలీక కౌరవులు దు
శ్శీలతఁ జెఱుఁ దంఁచి రేనిఁ జెప్పెద రుధిరా
ఖీలాన్నంబుకంటెను
మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్

నీ విభవం బహింసయు ననింద్యచరిత్రము కాక యన్యమే" అని. మఱియు

అల్పులకు మ్రింగఁ జేఁదైన హాలహలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగి కొనఁగ
నీలగళు నెన్ని నిన్నెన్నఁ బోలు నట్టి
నీవు సొలినఁ గా కేల నెగడుఁ జేరు"

అని ధర్మపన్నముల నుపన్యసించును. అట్టి మాటలకెదురు చెప్పుట దుర్ఘటము. కాని ధర్మరాజు సద్యఃస్ఫూర్తి కొనియాడ తగినది.

"అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయు మోముఁ జూచి యి
ట్లను నది యెల్ల నీ పలికి నట్టిద ధర్మువు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చిన నధర్మములై చెడుఁ గొన్ని ధర్మ వ
ర్తనములుగాక తోఁచి తుది ధర్మములై చనుఁ గొన్ని కర్మముల్"

అని ధర్మరాజు "తుది ధర్మములై చనుఁ గొన్ని కర్మముల" నిరూపించి యాభాసధర్మముల నిరాకరించెను.

ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దన భంగపాటును జెప్పుకొను ఘట్టము తిక్కన చిత్రించిన యుజ్జ్వలసన్నివేశములలో నొకటి. ద్రౌపది పాత్రోన్మీలనమున తిక్కన చూపిన ప్రజ్ఞ పేర్కొనఁ దగినది.

ధర్మనందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు.

అంతలు నేసి పో నడచి యక్కట సంజయు చేతఁజెప్పి పు
త్తెంతురె యిట్టి యూరట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు డా
నంతన యూళు లేవురకునైదు సుయోధనుఁ డిచ్చు నొక్క యీ
కంత కృపావిహీనమతి నాతఁడు నొంమనె యన్నదమ్ములన్

సంధిసంధాతగా వెడల నున్న శ్రీకృష్ణునితో ద్రౌపది పలికిన పలుకులలో నెంతటి యెత్తి పొడుపు. ఎంతటి బీభత్సనిర్భరనిశిత హాస్యలాఘవము!

"ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందులేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూను గాక య
చ్చోటన సంగరంబులగు చొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానల నుండ నచ్యుతా"

ద్రౌపదిలో స్త్రీసహజమైన భీరుత్వము గన్పింపదు. "అని అట్లుగ్గడించి

ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నా వినిపిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ ఏగ్గన లేచి యార్తయై
గోవిందు ముందటం బెట్టి యిట్లనియె

ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవులకరఁ దీఱు మాటల
యవసరమునఁ దలఁప వలయు నచ్యుత వీనిన్
ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
తొలుతగాఁ దోతిలో దుస్ససేను
తను వింత లింతలు తునియలై చెదరి రూ
పాఱినఁ గని యుడుకాఱఁ గాక
యుబుసాఁ బొనుపడు నట్టి చిచ్చే యివి
పెనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
కవ్వడి విక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములు పడిన నర్మసందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁ బడయమైతిమేనిఁ గృష్ణ''.

పాపము ధర్మరాజు మాత్రము రాజరాజు పీనుఁగుఁ గన్నార
గాంచఁ దలపోయదేమి!

"ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభంబైన దాని నొందఁ గూర్పను మా
కీ పుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా"

అని "యీ సుయోధనుతోడి పోరాట దక్కి యనుభవింతుము మా యంశమగు ధరిత్రి" యని చెప్పియుండెను. ఒకవేళ సంధి సుయోధనునకు సమ్మతమైనను ద్రౌపదికి మాత్రము సమరమే కావలిసినట్లున్నది. "ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంట్రుకల్ దా వల చేతఁ బూని" నల్ల త్రాచు వలె దిగ్గన లేచినది. తిక్కన వర్ణన ఏ చిత్రకారుఁ డనుకరింప గలడు!. తిక్కన స్థిరభంగిమల గాక చరద్భంగిమలనే నిశిత దృష్టితో నేరుకొనును. ఎంతటి వీరపత్నియైన ద్రౌపది కంతటి పగయా! రక్తదాహమా! భారతకాలమునఁగూడ నట్టి స్త్రీ ద్రౌపది యొక్కతెయే యేమొ! తిక్కన తనవదినెయైన ఖడ్గతిక్కన భార్యను, పెత్తల్లియైన ఖడ్గతిక్కన తల్లిని స్వయముగ నెరిఁగిన వాఁడే కదా. 'పరచి వచ్చిన పతికి పసుపు కుంకుమఁబెట్టు' వీరపత్నుల స్వగృహమందే కన్నారఁ గాంచిన తిక్కనకే ద్రౌపది పాత్రి నట్లుల్లేఖించుటకు సాధ్యమైనది.

శ్రీ కృష్ణుని రాయబారమునఁగూడ తిక్కన ఆత్మీయతా ముద్రి స్పందించుచుండును.

ధర్మరాజు శ్రీకృష్ణుని రాయబారిగ వరించి

.మ మ్మెఱుఁగు దెవరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా

క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు

పో మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్

అని చెప్పి వీడ్కొలుపును.

అవునేతిగుండెగల ధర్మరాజునకుఁ దిక్కన చేతిలో ఎంతటి రాజనీతిచతురత వాగ్విన్యాసము అబ్బినది! మనుమసిద్ధి మహారాజు తిక్కన మహామంత్రిని గణపతిదేవచక్రవర్తి కొలువు కూటమునకు రాయబారిగఁ బంపి నపుఁడీ మాటలనే యనెనేమో! ఈ మాటలలో ఆత్మవృత్తము జీవనాడి వలె స్పందించుచున్నది. ఈ పద్యములోని ప్రత్యక్షరము వెనుక రక్తపు అటుపోటుతోఁ గూడిన గుండె సవ్వడి వినుపించుచునే యున్నది.

అలతి అలతి మాటలు, అల్పాక్షరముల ననల్పార్థరచన కీ కందపద్య ముదాహరణప్రాయము. నిరతిశయస్వాభిమాన పూరితుఁడు సర్వతంత్రస్వతంత్రభావుఁ డగు చౌడప్పగూడ

ముందుఁగఁ జను దినములలోఁ

గందమునకు సోమయాజి ఘను డందురు నేఁ

డందఱు నను ఘను డందురు

కందమునకుఁ గుందవరపు కవి చౌడప్పా!

అని తిక్కన కందపద్యరచన పేర్కొనక తప్పినది గాదు.

శ్రీకృష్ణుఁడు రాయబారియై "సంధికిఁ బురుషకార మొన ర్చెద నోపినంతయున్" అని కౌరవసభ కేగెను.

ఆ కొలువు వారు కరమ చ

లాకృతి నొక పలుకు లేక యుండఱు వింజం

బా కిడిన కరణి నవశ ము

దాకారితచిత్తవృత్తులై యుండఁగన్

జలదస్వనగంభీరత
నెలుఁ గొప్పగ దంతదీప్తు లెసంగ ముకుందుం
డలరు చెప్పు నఖిలజనం
బులు విన ధృతరాష్ట్రునావిభున కిట్లనియెన్
జననాథ నీ యెఱుంగని
పనులు గలవె యైనఁ దగవుఁ బరమహితంబుం
దన వారికిఁ జెప్పగఁ దగు
నని వచ్చితి భారతాన్వయము ప్రియమందన్

"కౌరవపాండవుల్ తెఱఁగు నైకాని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీ నృపకోటి కుర్వికిం
బోరితమైన నింతరును బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి యవశ్యముఁ బొం దొనర్పవే"

అని సభాసదుల నుద్దేశించి

"సారపు ధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకు చేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాఱినదైన యవస్థ దక్షులె
వ్వార లుపేక్ష సేసి రది వారలు చే టగుఁ గాని ధర్మ ని
స్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవ ముండెడున్"

అని హెచ్చరించెను.

ధర్మగ్లాని యేర్పడి నపుడు తాటస్థ్యము వహించి మిన్న కుండుట గూడ దోషమే. తిక్కన క్రియాశూరతనే చైతన్య పూరితమైన ధర్మముగాఁ బ్రబోధించెను గాని కర్మసన్యాసము బోధింప లేదు. ఎట్లయినను ధర్మము జయించితీరును. "యతో ధర్మస్తతో జయః" ఎంతటి ఆశాసందేశము! మానవుఁడు

కర్మవీరుఁడై "పురుషకారమే యేకైక పరమ పథమని గుర్తింప వలెను. తిరిగి ధృతరాష్ట్రి సంబోధించి

వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూనియు న్నా రటుఁ గాక మీ కది మనంబున కప్రియ మేని యింతకుం బోరికె వచ్చుచుండెదరు ... ... ... తెరం... ... ... ... కారయు పథ్య మేది యనునవ్విధ మేర్పడ నిశ్చయింపుమా!

పాండవులు శాంతశూరులు. ఎంతటి విరోధాసమైనను సత్యమే. శ్రీకృష్ణుని కారాజనీతి. వాగ్విన్యాసము, శీవి, పూలయిలో తేని ఉన్మీలనము తెలుఁగులోఁ దిక్కన క్రొత్తగాఁ గల్పించినవే.

శ్రీ కృష్ణుని నోట నా మాటలు విన్న ధృతరాష్ట్రుఁ దేమన గలఁడు ! సరాసరి లే మనుకొనిరి? అనుకరణసాధ్యము గాని తిక్కన మాటలనే యుదాహరించుట మేలు.

అనవుడు రోమహర్షణము లంగములం బొడమఁ సదస్యు లె ల్లను బ్రియ మంది నెమ్మనములం బురుషోత్తముఁడింత యొప్పఁబ ల్కెనె మఱి మాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వ డిం దనువరి యెవ్వఁ డంచు నచలాకృతులై నెఱి నూరకుండగన్

కాని సుయోధనుఁడు "వాడి సూది మొన యింతుక మోపిన యంత మాత్రయును ... భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె" అని తన నిశ్చయము తెలిపెను

"అనిన విని కిన్కఁ బూనిన యుంతి నగవు
చెలువు మొగమున కొక క్రొత్త పొలుపు పొనర్పఁ
బుండరీకాక్షుఁడగు పెల్లఁబోయి యప్పు
డరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు"

నవ్వు మొగమున కొాక క్రొత్త పొలుపు దెచ్చును. నిజమే; నవ్వు తెలుప లేని భావమేది?

నవ్వు నవరసఖని.

నవ్వు అగాధహృదయవిషయసూచిక.

తిక్కన ఎన్నివిధముల నవ్వులనో గుర్తించెను. తిక్కన వాడిన నవ్వుల నేరికూర్చిన అతఁడెట్టి మనోధర్మపరిజ్ఞాతయో తెల్లమగును.

"కలకల నవ్వు" "పక పక నవ్వు" "పిన్న నవ్వు" "కన్నుల నవ్వు" "వెకిలి నవ్వు" "అనావరదరహాసము" "నవ్వు గాని నవ్వు" "దరస్మితము" "సుందరమందహాసము" మున్నగునవ్వుల నెన్నిటినో తిక్కన ప్రయోగించెను. నవ్వు ఆనందము కంటెను ఒకప్పుడు దుఃఖమునే యెక్కువ సూచింప వచ్చును. అది ఏడుప లేని నవ్వు కావచ్చును. తిరస్కారము చూపు, నవ్వు; మాటల కంటె ఈటెలకంటె ఎక్కువ వాడి కలది.

తిరస్కారము గాని అనురాగము గాని మాటలకంటె కన్నుల నవ్వులే బాగుగ వ్యక్తీకరింపఁగలవు. అట్టి నవ్వు గ్రుచ్చి కొనిన ఆ గాయము మాన్పుటకు మందు లేదు. శిఖండి భీష్ము నెదుర్కొని నపుడా మహావీరుఁడు "మరలి చూడ కతని నుద్దే సించి పలికె దరహాసముతో"-"నీవు శరకోటి వెసం బరఁగించి తేని నే నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ!" జగదేకవీరుఁడగు భీష్ముని నవ్వున కెవరు భాష్య మొనరింపఁగలరు?

భీష్ముఁడు బాణముల నేయకున్నను శిఖండి యొడలు భగ్గుమన్నది. భీష్ముని బాణముల కా నవ్వున కున్న శక్తి

యుండునా? అంపకోల పైఁబడుచున్నను ఎత్తిన ధనువు తునియ
లైనను తిక్కన చిత్రించిన వీరులు "అల్లసి నవ్వొలయగ" మరి
యొక ధనువు నెత్తుకొని యుద్ధమున కుపక్రమించిన యుదాత్త
మూర్తులు.

ద్రోణుఁడు, అభిమన్యుని పొగడు చుండెను. "అతని
వెలుఁక బాటి యతిదీనముగు నాననమున నవ్వు గాని నవ్వు
మెఱయ" దుర్యోధనుఁడు ద్రోణుని సమీపించి "ధనువు వట్టిన
వారికెల్ల నొజ్జయైన గురుని యుపేక్షఁజేసి తనకున్ సమ
రోద్ధతి చెల్లె గాక యిఁక వెరవిడి గాన లేడు తన వీరమఁగాఁ గొని
విఱవీగెడున్" అని పెదవి విరుచును. ఏ చిత్రకారుఁడైన దుర్యో
ధనుని పెదవుల విరిగిన ఆ 'నవ్వు గాని నవ్వు' చిత్రింపఁగలఁడా?
భువనేశ్వరములో ప్రేమలేఖను వ్రాయుచున్న శిల్పప్రణయిని
పెదవులపై చిందులాడు చిరు నవ్వు; "మోనోలిసా" అను చిత్రి
లేఖనమున వయస్విని కెమ్మోవిపై 'లియోనార్డో డావిన్సి'
చిత్రించిన దరహాసముద్ర; గాంచి ప్రపంచము మురిసిపోవు
చున్నది. అక్షరప్రపంచమునందు తిక్కన చిత్రించిన చిరునవ్వులు
జగన్మోహనములు. విచిత్రమనోవిశేషవిషయసూచికలు. అగాధ
హృదయంగమములు. అత్యద్భుతములు.

షేక్స్పియరుమహాకవి యొకచో "కులుకు నవ్వుల
వెన్నెల వెలుఁగులు వెల్లివిరియు పెదవుల వెనుకనే విషము
తొలుకు హృదయము దాగియుంత వచ్చును" అని హెచ్చరిం
చెను. ఇతరుల కున్నది; తనకు లేదు అను దేవిరింపు కంపు
గుండెతో కుమిలెడి కుత్సితాధరములపై విరిసెడి అసూయాశా

పాశావిలమైన ఆకలి చిచ్చరకంటి చిరునవ్వు, శ్మశానమున విరిసిన వెన్నెలవలె బీభత్సావహముగనే యుండును.

నవ్వునకు తిక్కనవంటి వ్యాఖ్యాత "న భూతో న భవిష్యతి", అనిపించును.

శ్రీకృష్ణుఁడు రాయబారము తరువాత రహస్యముగ కర్ణుని గలిసికొనును అందు శ్రీకృష్ణుని నేర్పు. కర్ణుని యుదాత్తసమాధానము మహాభారతమందలి యుజ్జ్వలఘట్టములలో నొకటి.

ఒకరుని చేతి ప్రోపున దదున్నతి ప్రాపును గాంచి యెల్ల వెంటకును గొఱంత లేక పొగడందగు సంపద నొంది యట్టి దాతకుఁ దుదిఁ గీడు సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత పుట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా!

అని విదురుఁడు ప్రకరణాంతరమునఁ జెప్పిన మాట తలపునకు వచ్చును.

తిక్కన కర్ణుని పాత్రోన్మీలనమున నిచ్చట మెరుగు మాయని వెలుఁగు రేకల దిద్దెను.

"పాంచాలరాజపుత్రియు నంచితముగ నిన్నుఁ బొందు" నని పాండవపక్షమున కాహ్వానించు శ్రీకృష్ణునకు "మదిఁ గడు వాఁడి గలదె నీకు వారిజనాభ!" అని కర్ణునితోపాటు అందరాశ్చర్యము పొందక తప్పదు. కర్ణుఁడు

"ఏను నర్జునుండు నెక్క టెక్కటిఁ దం
పడకయున్న నగరె పుడమి జనము
లందు నేదు వచ్చు టతని కపకీర్తి
యనిన నాకు వేఱె యడుగ నేల?

అనియుఁగాక ధర్మతనయుని గూర్చి,

"అట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ యెల్ల"

అనియుఁ జెప్పెను. కర్ణుని స్వామిభక్తికి ఔదార్యము మెరుగు పెట్టినది

కర్ణుఁడు భీష్ముఁడు సేనాపతిగా నున్నపుడు యుద్ధము చేయ లేదు. భీష్ముఁడు తన్నర్ధరథుఁ డని గణింపుటచే రోషమునఁ గర్ణుఁడు అస్త్రసన్యాసము సల్పెను. భీష్ముఁడు శరతల్పగతుఁ డయ్యెను. కర్ణుఁ డా మహావీరునిఁ జూడ నేగెను. తిక్కన యా సన్నివేశము నత్యద్భుతముగఁ జిత్రించెను.

"తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తి వినయంబులు దోపం బాదప్రణామం బాచరించిన" భీష్ముఁ డతని నొక్క కరంబు చాఁచి కౌగిలింపఁజేసి, మున్నతని నాడిన నిష్ఠురములు శిక్ష గాని రోషంబు గాదని పలికి

"నీ యుదయము దైవికగ
ర్భాయత్తము నీవు పుత్త్రు లసదృశులు గాం
తేయుఁడవు గాని విను రా
ధేయుండవు గావు నీవు ధీరవిచారా!

ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెరిగించె నేనును భవదీయతేజోవిశేషంబునను గనుంగొని యుండుదు గావున నక్కౌంతేయులఁ గలిసియుండు" మనెను.

అర్ధరథుఁ డని కర్ణు నెన్నిన భీష్ముని ఘాటు లేనా యివి! భీష్మునకు లోలోపలఁ గర్ణుఁడనిన నెంత గౌరవమున్నది! కర్ణుని

సమాధాన మా గౌరవము సార్థకము చేయుటయే గాక యను
మడింపఁ జేసినది.

"కౌంతేయుఁడ నగుదు నిది
యంతయుఁ దొల్లియును వింటి నాయ్యెలచే ని
ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ
సంతానముతోడి పొత్తు సనునే నాకున్

వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గడంగు వారలం
బోర జయింప రామియును బుద్ధి నెరుంగుదు నైనఁ గౌరవ
శ్రీరమణుండు నేయి తగు మన్నన లెల్లఁ దలంచి చూచినన్
పౌరవపేక యే విడిచిపోవుట ధర్మమె వీరధర్మమే?
దైవాధీనము సర్వమున్ మన మతిం దప్పింపగా వచ్చునే
నీవింకన్ నను నొంచు పల్కుర పరానీకంబుపైఁ బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబునన్
భావింపన్ విహరించెదం మురరిపుం బార్థుం దలంకించెదన్
అన విని భీష్ముఁ డిట్టు లను నంతకుఁ జాలు చెపుంగనే సుయో
ధనునకు నెన్న నీదు భుజదర్పము కాదె సహాయ మెద్ది యా
తనికిఁ బ్రియంబు దాసిన యుదాత్తమతిం దగ నాచరింపు నీ
మనమున సంతసిల్లు మన మానము మాను మనుజ్ఞ యిచ్చితిన్"

ఈ సమావేశమువలన భీష్మ కర్ణు లిరువురి పాత్రములు మెఱు
గెక్కినవి.

భీష్మపతనానంతరము దుర్యోధనుఁడు కర్ణునితో "సర్వ
యోధసంభావితుఁడైన శాంతనవు బాహువుల మాటున నస్మదీయ
సేనావిభవంబు నెల్లఁ బదినాళ్లును నీ మది కెక్కె నాడు యోధావళి
నింకఁ బృతనాధిపుఁగాఁగొన నెవ్వఁ డర్హుఁడో" నిరూపింపుమని

పేడెను. కర్ణుఁడు తన్నుఁ దా వరించుకొన లేఁడుగదా. అతఁ డెవరి మనస్సు నొవ్వకుండ కార్యవాదియై యంద ఱుబ్బునట్లుగ ద్రోణుని సేనాపతిగ వరించెను.

"అధిప నీ మోహరంబునందు సేనా
పతిత్వమునకుఁ దగిన వారు గలరె
అందఱు సమవిక్రమాది గుణంబుల
మానసీయు లుద్భటులైన నెల్ల
వారి ముఖ్యులఁ జేయవచ్చునే యొక్కరు
నైకొన్న మత్సరగ్రస్తబుద్ధి
నన్యులు విపరీతులై కలంగక యుండు
వారు గావలయు నెవ్వరును ద్రోణు
డనినఁ గాదన రాదండ్రు యుష్మదాధి
పత్యమునకు నాచార్యుండు బ్రాహ్మణుండు
వివిధరణకోవిదుఁడు వయోవృద్ధుఁ డధిక
బలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని".

యుద్ధభూమిని వీరులఁ బలువురఁ గూడఁ గట్టుకొని నడిపింపఁగల దక్షుల నోటినుండి వెడల వలసిన మాటలఁదూచి వేయఁ గలిగిన యుద్ధనీతివిశారదుఁడు తిక్కన.

యుద్ధనీతియందు వ్యూహనిర్మాణవిజ్ఞానమందు తిక్కనకుఁగల ప్రత్యక్షానుభవ మాతని యుద్ధపంచకమందలి ప్రత్యక్షరమునందుఁ దొలుకాడుచుండును.

తిక్కన యుద్ధవర్ణనములు పేర్కొనఁ దగినవి. యుద్ధభూమిని జీవితకాలములోఁ జూచి యెఱుఁగని వారి వర్ణనల తెఱఁగు వేరు. తిక్కన యుద్ధభూమిని కన్నులకుఁ గట్టినట్లు

చిత్రించుటయే గాక "దారుణప్రియదర్శనంబయ్యె" "రమణీయ భయానకమయ్యె" "నెత్తుట దోగిన మేని కమనీయరుచి" అని వర్ణించును. అఖిలఘోరదారుణబీభత్సదృశ్యములు తిక్కన కెట్లు రమణీయములుగా సాక్షాత్కరించినవో!

రుక్మరథుం డను వాఁడు వాంఛుపాత్రుం డపడ తొమ్మిది యమ్ము లురమ్మున నాటించి వెండియు నేయం గడంగునెడ సుభద్రాసూనుండు

శరముతోడ నొక్క కరము చాపముతోడ
నొకటి బొమలు గదిసి యున్న యుగ్ర
రేఖతోడఁ దల ధరిత్రిపైఁ బడ నేసె
రయము మెఱయఁ బటు శరత్రయమున

రుక్మరథుఁడు విల్లెక్కుపెట్టి బాణప్రయోగమునకు సంసిద్ధుఁడై యున్నాడు గనుక, యతని తల "బొమలు గదిసియున్న యుగ్రరేఖతోడ" క్రిందఁ బడి బిగిసిపోయినది. తెగిన తల యందు బొమలు గలిసియున్న యుగ్రరేఖనుగూడఁ దిలకింపఁ గలిగిన తిక్కన సశితదృష్టి ప్రత్యక్షరణక్షేత్రపరిచయము పేర్కొనదగినది.

మరణించిన అభిమన్యుఁడు

"ఉన్నతగతి నెడి యుర్విపైఁ గడు విన్న
నై పడియున్న సుధాంశుభంగి" నుండెను.

నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె నక్కుమారోత్తముఁ డందుఁ జంద్రు క్రియ నొప్పె సితాయుధఖండభూషణో దాత్తమణిప్రతానములు తారల చందము నొంది యందమై యత్తటి నుల్లసిల్లె వసుధాధిప చూపర పిండు చూడ్కికిన్

కరికళేబరములు ధరణీధరములు తురంగ
గాత్రమ్ములు గ్రాహసమితి
నరశరీరములు మీనములు నాక్షేయక
క్షురికాది శస్త్రంబు లురగకులము
రుధిరార్ద్రశిరములు రుచిరప్రవాళముల్
ప్రేవుల ప్రోవులు ఫేనతతులు
నెత్తురు వెల్లువ నీరులు భూషణ
స్తోమాస్థిచయముం దుమురు లిసుక
గాగ నంబురాశి కరణి సంగ్రామ భూ
భాగ మొప్పు మిగుల భవ్యమోగ
నిద్రనున్న విష్ణునకుఁ బాటి యగుచు శో
భిల్లె నమ్మురారి యల్లుఁ డంత.

అభిమన్యుఁడు గూలినప్పుడుగూడ నంత "అందమై" యుద్ధభూమి తిక్కనకుఁ గనుపించినది. యుద్ధభూమిని తిక్కన ప్రేమించినట్లు కనఁబడుచున్నది.

దుశ్శాసనుఁ జంపి నెత్తురు త్రావుచున్న భీమసేనుఁడు "రక్తంబు చాయ దలిర్పం చను పుగసుందరముగా" నేతెంచెను.

సంగ్రామరంగమునఁ దొడలు విరిగి పడియున్న దుర్యోధనుని అశ్వత్థామ కృపాచార్య కృతవర్మలు గాంచిరి.

కడుబెట్టిదంబగు గాలివేఁ గూలిన
మహనీయ సాలభూరుహము పోల్కిఁ
బ్రబలకిరాతమార్గణముఁ ద్రెళ్ళిన
రాజితవన్యవారణము మాడ్కిఁ

గల్పాంతవాయువుస్ఫురణంబున
    నివిరిపోయిన మహార్ణవము కరణిఁ
గాలపర్యయమునఁ గూలి మేదిని మీఁదఁ
    బడిన పూర్ణేందుబింబంబు పగిది
ధరణిఁ బడి యుండియును నొప్పు దరుఁగకున్న
యన్నరేశ్వరుఁ గనుఁ గొని యడలు నెడల
తోడ మేనులు దూలఁగఁ దొట్రు పడుచుఁ
జేరి యాతనిచుట్టు నాసీనులైరి.

విధివిలాసవిభ్రమము విచిత్రము. సమనొకంతకౌ హిణు లంతరించినవి. రాజరాజు ఊరుభంగమున కదల లేని స్థితిలో, మిగిలిన మువ్వురు వీరులలో అశ్వత్థామను సేనాపతిగ నభిషేకించి పంపెను. ఒకనాడు పాండవపక్షపాతియగు అశ్వత్థామ అనాడు దుర్యోధనునికంటె నెక్కుడుగాఁ బాండవుల ద్వేషించి, భూమి నపాండవ మొనరింప శపథము పూనెను.

మహాభారతము మానవజీవితము వలె మహావిచిత్ర విరోధాభాససమ్మేళనము. కర్ణుఁడు కుంతీపుత్రుఁడై సహోదరులతో యుద్ధమునకు దిగక తప్పలేదు. అతనికి గత్యంతరము లేదు. విచిత్రవిధివిలాస మది. కసిగందుగ నున్నపుడు గంగలో విడిచి పెట్టిన కర్ణుని సన్నిధికే కుంతి పుత్రభిక్ష నర్థించుచుఁ జేరవలసి వచ్చినది. శల్యుఁడు పాండవులకు మేనమామయై గూడ దుర్యోధనుని సేనలోఁ జేరక తప్పినది గాదు. భీష్మద్రోణుల మాట చెప్ప నేల? రః ముప్పురు స్వపక్షపరాజయమే కోరుకొని ప్రాణములు సంతోషముతో వదలిరి. సత్యసంధుఁడగు ధర్మరాజు గూడ "అసత్యమాడక" తప్పినది గాదు. జగదేకధనుర్ధరుఁడైన అర్జు

నుండే శ్రీకృష్ణనిర్యాణానంతరము కిరాతులచేత భంగపడవలసి వచ్చినది.

మానవజీవితములోని పతనోత్థారములు మానవహృదయములోని చీఁకటి వెలుఁగులు పూర్ణపురుషాయుష మనుభవించి స్వానుభవమున గ్రహించిన మహానుభావుఁడు తిక్కన, మహాభారతములోని ఈ యుద్ధసన్నివేశముల సమబుద్ధితోఁ జిత్రింపఁగలిగెను,

అర్జునుఁడు సేనాపతియై విజృంభించుచున్న కర్ణుని గాంచి
పట్టపగటింటి సూర్యునిఁ బగిది గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచునున్నవాఁడు
మన రథం బొప్పు మాధవ మరలనిమ్ము
బ్రదికియుండిన శుభములు వడయ వచ్చు

అని తప్పుకొని పోవలసి వచ్చెను.

యుద్ధానంతరము తర్పణములు విడుచునప్పుడు కుంతీదేవి ధర్మరాజుతోఁ గర్ణుఁడతని కగ్రజుఁడేయని వెల్లడించును. ధర్మరాజు మనస్సులో రేగినవి ఝుంఝుమారుతములు, బ్రద్దలైనవి అగ్నిపర్వతాలు, ఉద్భవిల్లినవి భూకంపములు! అది జీవితము. స్త్రీపర్వమునందు వివిధములైనఛందస్సులలో మానవజీవితానుభవ వైవిధ్యమును తిక్కన వర్ణించెను.

యుద్ధానంతరము శాంతిపర్వమునందు మానవజీవితమునందలి పతనోత్థారముల సమీక్షించు నీతులను నిర్వికల్పసమచిత్తవృత్తితోఁ దిక్కన నివేదింపఁ గలిగెను. అందలి యుపాఖ్యానములు స్వయంసంపూర్ణములైన పద్యకథానికలు. తిక్కన ఉత్తమకథానికల నెన్నిటినో పద్యరూపమున వ్రాసెను.

మూషికమార్జాలసంవాద మట్టి పద్యకథావళులలో నొకటి. ఆ మార్జాలము గాని, మూషికము గాని, మేధ వికసింపని మూక జీవములు గావు. నిత్యజీవితములో మన కెందరో యట్టి మానవ మార్జాలమూషికములు కనుపించుచునే యుండును.

అడవిలో మాలని యుచ్చులో రోమశుఁడను పిల్లి పడెను. ఆ చెట్టుక్రింది లాఁగలనున్న యెలుకను భక్షింప గూబ, ముంగిస యే తెంచినవి. ఎలుక, యురి కొరికి రక్షింతునని చెప్పి పిల్లి యొడి చేరినది. పిల్లికి భయపడి గూబ, ముంగిస, పారిపోయినవి కాని వెనువెంటనే యెలుక, యురి త్రాళ్లు కొరికి పిల్లిని విడిపింప లేదు. మాలని రాకవఱకు వేచియుండి, యప్పు డురి కొరికి వేసినది. మాలనిఁ జూచి భయపడి పిల్లి చెట్టెక్కిపోయినది. ఎలుక కన్నమున దూరినది. మాలఁడు నిరాశతో నిష్క్రమించెను. పిల్లి, ఎలుకను బయటికి వచ్చి, తనతో స్నేహము పలుపుమని యెంతయో వేడికొనెను.

బలవంతుఁడైన శత్రుని
వలనఁ బ్రయోజనము గలిగి వలను కలిమి డాఁ
గలిసియు నది గడవనఁగాఁ
దొలఁగ వలయు నమ్మె నేనిఁ దుదిఁ గీడొలయున్.
బలు పగఱ వలని యాపద
దలఁగుటకును రిపుని హీనతరుఁడైనఁ దనుం
గలిపికొని బ్రదుకుటకు ని
య్యెలుకయుఁ బిల్లియును వెరవు లెఱిఁగించెఁ దగన్.

మానవుఁడు పురుషకారి కావలెనని మహాభారతరచనమున తిక్కన ఉద్బోధించెను. ఆ సందేశమే ఆయుగధర్మము.

ఆ యుగముద్ర తిక్కన సమకాలీనుల కావ్యములందుఁ గూడఁ గన్పించును. బద్దెనృపాలుఁడు వ్రాసిన నీతిసారముక్తావళి యందుగూడఁ దిక్కనయుగముద్ర గన్పించుచుండును.

నయమున గాని భూమిప్రజ నమ్మదు; నమ్మిన గాని యర్థసం
చయమును దంత్రవృద్ధియును చాలదు; చాలినఁగాని శత్రులన్
బయి చని యోర్వరాదు: ప్రతిపక్ష మడంగినఁ గాని భూమి య
క్షయముగ నేల రా దనిరి; కావ్యచతుర్ముఖ బద్దెభూపతీ.

అతఁడే సుమతి శతకముగూడ రచించి నట్లు చెప్పుదురు.

తిక్కన యుగమువారు జీవితము నొక లలితకళగా, మహోద్యమముగ, వీరక్షేత్రముగఁ బరికించిరి. పురుషార్థముల నన్నిటియందుఁ దుల్యగౌరవము కలిగి యుండిరి.

"పాలకుమీ రణమందున" అను సుమతిశతకపద్య పంక్తి "ముగురాడువార మైతి" మను ఖడ్గతిక్కన భార్యమాట- భారతవీరుల చరిత్రలు- తిక్కన రాయబారము అంతయు ఒకే శ్రుతిలో వినిపించును.

చారుచర్యయను సమకాలీన గ్రంథమందు బ్రదుఁకు నెట్లు తీర్చి దిద్దుకొని సుఖతరము చేయవచ్చునో గలదు. కేతన, మంత్రి మిత్రుఁడు, కృతిపతియగు తిక్కన ప్రోత్సాహముచే "విజ్ఞా నేశ్వరీయము" మితాక్షరికిఁ దెలుఁగుసేత యొనరించెను. మారన మార్కండేయపురాణము రచించి బ్రదుకు కవ్వలిసీమల బ్రస్థా నించెను.

తిక్కన, వ్యక్తిమాత్రమే గాఁడు. అత డొక మహా వ్యవస్థ. మహాజీవదుద్యమము. సమకాలీనగ్రంథము లందలి

ఆత్మీయతాముద్ర గన్పించినట్లే, యాతని మహాభారతము నందలి నాటి మహోద్యమములు కావ్యరీతులు నంతర్గతమైయున్నవి.

తిక్కనకవితాశిల్ప మర్వాచీనకవులపై మిక్కిలి ప్రభావము వహించినను, నెవరికిని సంపూర్ణముగ సిద్ధింపలేదు. తిక్కన ప్రత్యక్షశిష్యుఁడైన మారనకే గురుశిల్పము కొంతపరకైన సిద్ధింప లేదు. మారన "నవీనపరాశరసూనుఁ దిక్కకవీంద్రుని గొల్తు" నని దూరముగ నిలిచియే నమస్కరించి తన తెన్నునఁబోయెను.

శ్రీనాథుఁడు "నిర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కన సోమయాజికి" నమస్కరించి "వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్క మాటు" అని యథార్థము వచించెను. ఒక్కొక్క మాటు శ్రీనాథునివంటి వారు తిక్కన, రసాభ్యుచితబంధము ననుకరింపఁ జూచిరిగాని యాతని కవితా శిల్పము నంతటిని సమగ్రముగ నెవ్వరు ననుకరింప లేకపోయిరి. కొంద రాతని స్వప్నకథను మాత్ర మనుకరింపఁగల్గిరి. మరి కొందరు "హా యను ధర్మరాజతనయా యను'' వంటి పద్య ముల చిత్రముల మాత్ర మనుకరింపఁ గల్గిరి.

నాచన సోముఁడు వేంకటనాథుఁడు హరిహరనాథుని కంకిత మొనర్చుట ననుకరింపఁ గల్గిరి.

"అలికంబున నక్షిని డాచిన సర్వజ్ఞుఁడ"ని ప్రస్తుతి గనిన నాచన సోముఁడు, తిక్కన సజీవపాత్రచిత్రణము, మనోధర్మపరి జ్ఞానము, పదప్రయోగము, పలుకుబడులు, సంభాషణచాతురి ననుకరించి భారతమునకు ఖిలపురాణమైన హరివంశము వ్రాసి యతని ప్రక్క, పీట వేయించుకొనఁ జూచెను.

నాచనసోముఁడు "హరి మేలంచు హరుం మే లనుచు నేలా తర్కముల్" అని తగవరిగ నిల్చెనె గాని యతనికి తిక్కన హరిహరనాథవేదాంతమందలి "ధర్మాద్వైతము" పట్టు వడలేదు. సంభాషణచారిమలోఁ గూడ తిక్కన ఆత్మసంయమము నౌచితీపాలనము నాచనసోమునకుఁ బట్టు వడ లేదు.

ఊర్వశి, నరకుని బారినుండి తప్పించుకొనఁ జూచి "సంతలో జవ్వన మమ్ముకొన్న ముదిసాని ననుం గవయం దలంచితే" యని తప్పించుకొనఁజూచును. "ఎంత తరిగిన మిరియాలుం జొన్నలకున్ సరిరావే" యని గవయం జూచును. ఈ రాక్షసశృంగారసంభాషణలోఁ దిక్కన నిశితత్వమున్నది గాని నిగ్రహము లేదు.

సజీవపదప్రయోగమునందు జీవత్ పాత్రచిత్రణమునందు, సంభాషణచారిమయందు, మనోధర్మ పరిజ్ఞానమునందు చలచ్చిత్ర భంగిమల వర్ణించుటయందుఁ దిక్కన కవితా శిల్పము పట్టువడిన వాడు పింగళి సూరన. "కంకల నవ్వినట్లు; తెలిగన్నుల నిక్కము చూచినట్లు తోఁబలుక కడంగినట్లు"న్నది ప్రద్యుమ్నుని చిత్రము. పింగళి సూరనకుఁ దిక్కన వేదాంతముగాని ఆధ్యాత్మికోన్నతి గాని లేవు.

ఆత్మికనైర్మల్యమునందు ధూర్జటి, తిక్కనను దలపింపఁ జేయును.

"ఏలీలన్ నుతియింప వచ్చు నుపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్యశ
బ్దాలంకారవిశేషభాషల కలభ్యంబైన నీ రూపముం
జాలుం జాలు కవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ లజ్జింపరు గాక మాదృశకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా"

అని అలపించిన ధూర్జటి ఆత్మనివేదనము తిక్కన హరిహరనాథోపాసనను దలపింపఁ జేయును.

భక్తివైరాగ్యములయందు పోతన తిక్కనను దలపింపఁ జేయును. "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబుల" కాసపడని వైరాగ్యమువలన పోతన మహాకవికి గుండెలోఁ గోవెల గట్టి యారాధించు భక్తు లెందరో గలరు. "ఇమ్మనుజేశ్వరాధములు" అని పారుష్యతరంగితమైన వాక్కుగూఁడ లేక త్రిగుణాతీతుఁడైన మహాతపస్వి తిక్కన. కవులు భ్రష్టతపస్వులు- "యోగభ్రష్టో కవిశ్రేష్ఠః"—యోగి పదమునుండి అవతరించిన కవు లున్నారు గాని తిక్కన కవిపదమునుండి యోగిపదమున కారోహించెను.

తన పూరిగుడిసెనుగూడ మహాప్రాసాదముగనే స్వీకరించి సంతృప్తినే చెందఁగల వైరాగ్యసంపన్నుఁడు మహానుభావుఁడు. తన మహాప్రాసాదముగూడ పూరిగుడిసెయట్టులే భావింపఁగల సమబుద్ధిభూషితుఁడు మహామహితాత్ముఁడు. తిక్కన యట్టి మహామహితాత్ముఁడు.

తిక్కన మహాయోగి గనుక, మహాకవిగా గౌరవింపవలెనని కాదు. తిక్కన ప్రధానముగాఁ గవి. వేదాంత మతని కవితాప్రవంతికి అంతర్వాహిని మాత్రమే. అందుచేఁ దిక్కన భారతము ప్రబంధ మండలిగ రచించెను. భగవద్గీతాసారమును విడువకుండఁ జెప్పినను, యథాక్షరానువాదము సలుపలేదు. వేదాంతముగూడఁ, కాంతాసమ్మితముగ మహాభారతమునఁ జెప్పి, తిక్కన పురుషార్థముల కర్థవివరణ సల్పిన మహాకవి యయ్యెను.

తిక్కన విదురుని నోటఁ దాదాత్మ్యసిద్ధితోఁ బల్కించిన పల్కులు చిరస్మరణీయములు.

మాలకరి పుష్పములు గోయు మాడ్కిఁ దేటి
పువ్వుఁ దేనియఁ గొనియెడు పోల్కి నెమరు
గంద కుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడవఁ జనదు.
పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు తెవులు లేని వేదనం బడు నధిపా
ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైన వారి కడఁకువ
యును వినయము నివియి తెచ్చు నుర్వీనాథా
క్షమియించు వారిఁ గని చా
లమి పెట్టుదు రైననుం దలంప సమాన
క్షమయ కడల మేలగు తొడ వు
త్తమపురుషుల గోరువారు దాల్తురు దానిన్.
చెల్లియుండియు సైరణ చేయు నతఁడుఁ
పేద వడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గల భంగి నిచ్చు నతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య.

నన్నయకూడ, "మితహితసత్యవాక్య"మును బ్రశంసించి "వాక్పారుష్యము సన్నె మహాదారుణమది విషముకంటె దహ

నము కంటెన్'' అని ధర్మరాజు నోటఁ బలికించెను. ఎదిరి కందకుండగఁ, దేటి తేనె గైకొను నట్లు కర్తవ్యము నెరవేర్చు కొనవలెనని తిక్కన యుద్బోధించెను. ఇంతటి తియ్యని గుండెల నుండి స్రవించుట చేతనే నన్నయ తిక్కనల వాణి యుగయుగాంతరములు తేనె సోనల నొలుక గలుగుచున్నది.

వర్డ్సువర్తుకవి, భావావేగమును అనుస్మరణపూర్వకముగా పునస్సృష్టి సల్పుటయే కవిత యని ప్రవచించెను. రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో "ప్రతిభ" ను భావయిత్రి-సమాధి- కారయిత్రిగ, ప్రస్తరించెను. భావయిత్రి కవికి గల నవనవోన్మేష ప్రజ్ఞావీక్షణ. కారయిత్రి ఆ దర్శనపు ప్రదర్శనోన్ముఖసాఫల్యము. ఈ రెంటికి మధ్య "సమాధి" అపరిహార్యమైనది. చాలమంది కవులలో భావయిత్రి కారయిత్రి శక్తులు పుష్కలముగ నుండియు సమాధి కొఱవడుటచే మహాకవులు కాలేక పోవుచున్నారు.

కవి తనయావేగమును నిగ్రహించి సమాధిబద్ధముచేసి పునస్స్మరణరూపముగనే కవిత చెప్పవలెను.

ద్రౌపది కీచకవధానంతరము తన భావావేగమునకు "గఱువతనమను బలితంపుఁ గట్టు వెట్టి ధీరయై'' చనును.

మనమున నెలమి నొం పొడవి నెమ్మొగమునఁ
దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి
లలి నుల్లసిల్లుచు లలితలోచన దీప్తు
లడర సుంకించిన నాఁగి యాఁగి
సంతసంబున బాలిశములగు చెయ్వులు
దొడరఁ జూచినఁ జేయ కుడిగి యుడిగి

మనమున నుబ్బుమై మాట నాలుకను రాఁ
గడఁగిన నాపక కడపి కడపి
ధీరమై యిట్లు సముద్రపూరమునకు
గణుపతనమను బలితంపుఁ గట్టు వెట్టి
పెంది మెఱుఁగనియదివోలె వికృతి లేక
యెల్ల నెప్పటి యట్టుల యరుగుటయును.

కవితోద్వేగమునకు గణుపతనము తోడు గావలెను. కవి తన భావస్రవంతికి ఆనకట్ట కట్టవలెను. కవితాప్రపంచమున కూడ ఆత్మసంయమమే విశ్వవిజయము.

తిక్కనలోఁగల భావనిగ్రహము భావసమాధి ఆంధ్రవాఙ్మయము నందతనికి మహోదారస్థానము గల్పించుచున్నవి. సహజముగ ఉద్రేకస్వభావులగు కవులలో నిగ్రహశక్తి యుండుట మిక్కిలి యరుదు. భావోద్వేగము, ఊష్మలత లేనిదే కవియే కాలేడు. తిక్కనకున్న యీ నిగ్రహశక్తి ప్రపంచవాఙ్మయము నందు మిక్కిలి అరుదు.

కవి ఆత్మీయత కావ్యములోఁ బ్రతిఫలించును. కావ్యములోఁ బ్రతిఫలించునది కవి భౌతికరూపము గాదు. కవి యిష్టానిష్టములు భౌతికజీవితము మానసికతత్త్వము మున్నగునవి కావ్యమువలనఁ దెలియ వచ్చును. కాని సూక్ష్మదృష్టి గల సహృదయుల మనోనేత్రమునకు కవి యంతరాత్మ విశ్వరూప పరిదర్శనము సాక్షాత్కరించును. అంతరాత్మనుబట్టియే కవికి గౌరవము కలుగును. కవి వ్రాసిన కావ్యములన్నియు ననుశీలించిన తరువాత సాహితీప్రియుం భావుకుఁడైన సహృదయుని హృదయమున నేర్పడు గౌరవముద్రను బట్టియే కవికి విలువ

గట్టవలెను. అనిన, సహృదయుఁడైన రసజ్ఞుఁడు తన అంతఃకరణమునే సాహిత్యతులాధారముగ నొనర్చి కవిని తూయవలయును. అందుచేఁ గవు లందరకు లోకములో నొకే తూనికయుండుటలేదు. తూకము సరిగా రాకపోవుటకుఁ గారణము తూచిన వస్తువులోన దోషమే గాక తులలోని దోషముకూడ కావచ్చును. తూకపు రాళ్లలోని వ్యత్యాసము గూడ కావచ్చును. అందుచే ఈ సాహిత్యతులాధారమునకుఁ బూనుకొను రసజ్ఞుని హృదయ మెంత సుకుమారకోమలమైన నాతని తూకమంత నికరముగా వచ్చును. కళ యొక హృదయము, సానుభూతి గల మఱియొక హృదయముతోఁ జేసికొను నివేదనమే గనుక ప్రమాదగర్భితమైనను నీ తులాధారమునకు దిగవచ్చును.

శిరీషకుసుమపేశలసుధామయోక్తుల మనుచరిత్రరచించిన పెద్దన సుకుమారకోమలహృదయము ఆ కావ్యమునందే ప్రతిఫలించినది. "నిరుపహతిస్థలమ్ము రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడె మాత్మకింపయిన భోజనము" ఇత్యాది భోగములఁ గోరుకొనిన ఆంధ్రకవితాపితామహుని అంతరాత్మ ఆక్రోశము శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరము హంసగీతి వలె వినిపించినది.

ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందు కొనువేళఁ బురమేగ
పల్లకిఁ దన కేలఁ బట్టి యెత్తె
ఓరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదంచుఁ దాన పాదములఁ దొడగె

గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
　　నడిగిన సీమలయందు నిచ్చె
ఆంధ్రకవితాపితామహ అల్లసాని
పెద్దనార్య యనుచు నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ ననుచు.

అని వాపోయెను. శ్రీనాథుఁడు గూడ "కస్తూరికే రాజు ప్రస్తుతింతు" "హేమపాత్రాన్న మెవ్వని పంక్తిఁ గుడుచు" "రత్నాంబరంబు లే రాయఁ డిచ్చు" అని అవసానకాలమున అలమటించెను. వారు పుట్టుకవులు. వాల్మీకి శోకము శ్లోకరూపము గొన్నట్లు వారి మనోవేదన మహాకవిత యైనది. కాని వారి ఆత్మీయతలో రాజసంబంధము తొలుకాడుచునే యున్నది.

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
　సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
　సమ్మెటపోటులం బడక సమ్మతి నీ హరి కిచ్చి చెప్పె నీ
　బమ్మెర పోతరా జొకఁడు భాగవతమ్ము జగద్ధితమ్ముగన్"

అని పోతరాజు,

"రాజుల్ మత్తులు వారి సేవ నరకప్రాయంబు వారిచ్చు నం
　భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
　బీజంబుల్ తదపేక్ష చాలు పరితృప్తిం జెందితిన్ జ్ఞానల
　క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా"

అని ధూర్జటి, ఆలపించినారు.

పెద్దన, ధూర్జటి కవుల అంతరంగములలోఁ గల వ్యత్యాసము, వారి వ్యక్తిత్వములలోఁ గల యంతరమును బట్టి

ఆత్మీయతకు విలువకట్టగలవారికెల్ల తేటతెల్లము. ఈ నాడు ఏ మహాద్భుతదైవయోగముననైనను, పెద్దన ధూర్జటి మహాకవు లిరువురు మా యింటికి దయచేసినచో పెద్దనకు కర్పూరతాంబూలము నుపహార మొసంగెదను. ధూర్జటికి సాష్టాంగనమస్కారము సమర్పించెదను. అనగా కవి గొప్పతన మతని యంతరంగముయొక్క విలువమీదనే యాధారపడి యుండునని సిద్ధాంతము గాదు. కవితాశిల్పమునందు సిద్ధహస్తులైన మహాకవుల నిరువురి జూచునప్పుడు మాత్రమే యీ యంతఃకరణగౌరవము చూడవలెను. అందుచే నరాంకితము చేసిన కవు లందరికంటె ఈశ్వరాంకితము చేసిన కవులు గొప్పవారని చెప్పుట కూడదు.

తిక్కన మొదట నరాంకిత మొసఁగి తరువాత హరిహరనాథాంకితముగ మహాభారతము రచించెను. తిక్కన హరిహరనాథోపాసనలో రాజసతామసవాసనలు లేవు. తిక్కన యంతరాత్మ శుద్ధసాత్త్వికసమాధిసంపన్నమై యతని యాత్మీయత యోంకారమయమై వెల్లివిరిసినది. " నాసేర్చిన భంగి చెప్పి పరమేశ్వరుఁ బ్ర సన్ను జేయుద భక్తికోటికిన్" అన్న నిరహంకారసత్త్వమూర్తి ఆరాధన విశేషముగ మహాభారతము తెలుఁగున వినిర్మించెను.

మహాకవిత్వదీక్షావిధినంది పదునేనుపర్వములఁ దెనుఁగుఁ బాస జగద్ధితముగ వినిర్మింపఁ బూనిన తిక్కన జీవితములో సపరసంధ్యాసమయ మది. ఐతిహ్యముకూడఁ దిక్కన పూర్ణపురుషాయుషజీవి యనియు, గన్నులు గనిపింపని వృద్ధాప్యమున గురునాథుని లేఖకునిగ స్వీకరించి భారతము చెప్పెనని కమ్మని కథలు చెప్పుచున్నది. అప్పటికి తెలుఁగు మహాభారతము రెండు వందలయేండ్లనుండి మూలఁ బడి యున్నది. పండువృద్ధు

తిక్కన పదునేనుపర్వములు పరిపూర్తిఁ జేయఁ గలఁడా? మ్రుగ్గిన పండు ఎప్పుడు రాలిపోవునో! మహాకవిత్వదీక్షావిధి నొంది మహాకవి తిక్కన సల్పిన సాహిత్యతపస్సు ఫలించినది. పదునేను పర్వములు జనసంప్రార్థ్యంబులై యుండఁ దుద ముట్టన్ రచియించి యొప్పెను.

చిట్టచివరి పద్యము చెప్పు నపుడు తిక్కన యనుభవించిన యానందతన్మయ మెట్టిదో! ఊహింపవచ్చును. మహాభారతము సంపూర్తి చేసి ఫలప్రతిపాదనఁ జెప్పినపిదప శౌనకాదిమునులు కథకుఁ డగు సూతు నర్చించిరి. ఇది చివరి మాట.

"పరమపదప్రాప్తిహేతువగు భారతసంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరము సొంపునఁ జెప్పిన వాఁడు మోదసం
భరితతఁ బొంది యక్కథకు నర్చితుఁ జేసె ధర్మిలిన్

ఈ చంపకమాలలో ఈ మూడు పాదములతో మహాభారతము పదునేనుపర్వములు పూర్తియైనవి. చతుర్థపాదపూరణమునకై ఇక నేమి వ్రాయవలెను? వెను వెంటనే
హరిహరనాథ సర్వభువనార్చిత నం దయఁజూచు మెప్పునన్"
అని కృతార్థుఁడై తిక్కన, హరిహరనాథునకు ధన్యవాదము లర్పించెను. చరమపాదమునందలి ప్రత్యక్షరమునందు పదునేను పర్వముల 'తెనుంగు బాసఁ దుదముట్ట; బుధసంతోషంబు నిండార' రచించి నట్టి తిక్కన జీవితసాఫల్యము, తెలుఁగు వారి కేర్పడిన ధన్యత్వము తొలికాడు చున్నవి. ఈ చివరి పాదమున తిక్కన మహాభారతరచన సంపూర్తి చేసిన శుభముహూర్తమున ననుభవించిన నిర్భరానందతన్మయత్వము నేటికిని తెనుఁగుదేశమున వెల్లివిరియుచునే యున్నది.

అక్బరు చక్రవర్తి మొగలుసామ్రాజ్యసంస్థాపనాయకుఁడైన "తాన్‌సేను" గానామృతంపూరంలో నోలలాడి అనన్యసామాన్యమైన యతని గానవిద్యాధినివేశము ప్రస్తుతించెను. తాన్‌సేను వినయముగా నది యంతయు గురుకటాక్షమని చక్రవర్తికి విన్నవించెను. అక్బరు చక్రవర్తి. గాయక చక్రవర్తి యగు తాన్‌సేను గురుదేవుని సన్మానింప గోరి మొగలు దర్బారునకు రప్పింపుమని కోరెను. సుందగంభీరముగ "మాగురుదేవు లెచ్చటికిఁ గదలరా"రని తాన్‌సేను నోట సమాధానము వెలువడినది. రసజ్ఞమూర్తియగు అక్బరుసార్వభౌముడు తాన్‌సేను గురుదేవుని సందర్శించుట కేగెను. గురుదేవుఁడు కోటలో నొక కోవెలముందు వీణ మేళవించి భక్తిరసతరంగితహృదయముతోఁ బులకాంకుర ప్రకరముంలో భగవన్నంకీర్తన సల్పుచుండెను. అక్బరు చక్రవర్తి ఆనందతన్మయుఁడై "తాన్‌సేన్! గాయక చక్రవర్తివైన నీకు నీ గురుదేవుల గానకళలో సహస్రాంశమైన యబ్బ లేదేమి? వింతగా నున్నదే" అని ఆశ్చర్యము వెల్లడించెను.

తాన్‌సేను వినయగంభీరముగ బదులు చెప్పెను. "ఏలిన వారు చిత్తగింతురుగాక. నేను ఢిల్లీశ్వరునికొఱకై పాడుచున్నాను. మా గురుదేవులు జగతీశ్వరుని కొఱకై గానము సల్పుచున్నారు." సరసుఁడైన సార్వభౌముఁడా యంతరమును గుర్తించి, తన వజ్రహారమును గురుదేవునకు సమర్పించెను. చక్రవర్తి చూచు చుండగనే గురుదేవుఁడా వజ్రహారము నరనోగకన్నులతో గానము నాలించుచున్న లేడి పిల్ల మెడలో వేసెను. లేడి పిల్ల చెంగు చెంగున దాపుననున్న అరణ్యములోనికి గంతు లెత్తినది.

చక్రవర్తి నిర్విణ్ణుఁడయ్యెను. గురుదేవుఁడు నిత్యానందనిర్వికల్పుఁడయ్యెను. చెట్లు చిగురించినట్లు మొగ్గలు నవ్వినట్లు పువ్వులు పులకించినట్లు నదులు ప్రవహించినట్లు గురుదేవుఁడు గానము సల్పినాఁడు. తిక్కన కవిత చెప్పినాఁడు. తాన్‌సేను గాయకుఁడు. అతని గురుదేవుఁడు గానము. సర్వేశ్వరులకొఱకై గానము సల్పువారు కవిత చెప్పువారు గాయకులు కవులు. తిక్కన విశ్వేశ్వరునికొఱకై "ఆరాధన విశేషము"గ భారతము వ్రాసెను.

తిక్కన కవిమాత్రుఁడు గాఁడు.

తిక్కన కవితయే.



## ఎఱ్ఱన

ఎఱ్ఱాప్రెగ్గడ దక్షిణాపథచరిత్రలో మిక్కిలి ప్రాముఖ్యము వహించిన యుగసంధితో సాహిత్యజీవితము నెరపెను. తిక్కన కాకతీయసామ్రాజ్యము పరాకాష్ఠ నంది, తెలుఁగు దేశమంతయు గణపతిదేవచక్రవర్తి వెల్ల గొడుగునీడను అలపు దీర్చుకొనుచున్న విశ్రాంతిసమయమున మహాభారతము పదునేనుపర్వములు తుద ముట్ట తెనుఁగుబాస వినిర్మించెను. తిక్కన నాడు కాకతి ప్రభువుల డెబ్బది యైదుగురు "వీరసామంతులు" గజ రథ తురగ భట సాహిణులు "ఏకశంఖంబులు, వెట్టి గొడుగులు, హనుమంతు పడులు, రెడ్డికెంబు, గండభేరుండతలాటములు, అరిరాయ గజాంకుశంబులు, పసుపుపావడలు, డాలుడమారంబులు, ముత్యాల జగ జంపు పంచె వన్నె వాద్యంబులు గలిగి, ఏకాంగి వీరులై సాహిత్యవినోదులై స్వామిద్రోహరగండలై శత్రుమహీపాలకశిరః కందుకక్రీడావినోదులై" దక్షిణాపథమున సనాతనసంస్కృతి ప్రతిష్ఠించిరి. ఉత్తరాపథమంతయు నాక్రమించి తురుష్కుల సభ్యతా సంస్కృతీఝంఝామారుతములు వికటాట్టహాసవిలయతాండవము సల్పుచు వింధ్యపర్వతముల త్రోసికొని వచ్చుచున్నను, వీర సామంతులు విజృంభించి దక్షిణాపథమున సనాతనసాహిత్య సంస్కృతులకు వింజామరలు పట్టిరి. ఈ వీరయుగమే తిక్కన మహాభారతములో, హేమాద్రి చతుర్వర్గచింతామణిలోఁ బ్రతిఫలించినది. పూర్ణజీవితానుభవమునాశించిన యుగ మది.

కాని తిక్కన నిర్యాణానంతరము కాలము మారిపోయినది క్రీ॥ శ॥ 1296 సంవత్సరమున దేవగిరిలో చంద్రవంకటావుటా రెప రెప లాడినది. "మాలిక్ గర్‌షాస్ప" సేనాని రామచంద్రు నోడించి, దేవగిరి కొల్లగొట్టి, రాజకన్యకను పరిగ్రహించి ఢిల్లీ చేరి, జలాలుద్దీను సుల్తానును హత్యచేసి తానే అలావుద్దీను బిరుదులోసుల్తానయ్యెను. అల్లావుద్దీను కాకతీయసామ్రాజ్యముపై చాల సారులు దండయాత్రనంపెను. ప్రతాపరుద్రుని నాయకులలో నొకఁడగు పోతుగంటిమైలి

"ఉప్పరపల్లొద్ద నుద్ధతి పైఁబడి ఢిల్లీ తురుష్కుల త్రుళ్ళడంచె" అని క్రీ॥ శ. 1304-వ నాటి శిలాశాసనమునఁ గలదు. వెలుగోటి వారి వంశావళిలో పెన్న ధరణీపుఁడు, రాణి రుద్రమదేవి మంత్రి రేచర్ల ప్రసాదాదిత్యుని కొడుకు "సన్నద్ధప్రసరత్తురుష్కపృతనా సందోహనిర్మూలనోత్పన్నానూనయశుండ"ని వర్ణితము.

ఇట్టియుద్ధములు క్రీ॥ శ. 1323 సంవత్సరమందు ఓరుగల్లు పతనమువరకు సాగినవి.

ఎఱ్ఱాప్రెగ్గడ క్రీ॥ శ. 1325 నుండి 1353 సంవత్సరము వరకు రాజ్యము సల్పిన ప్రోలయవేమారెడ్డికి రామాయణము, హరివంశము కృతినిచ్చి యాస్థానకవియై యుండుటచే, నతఁడు క్రీ॥ శ॥ పదుమూడవశతాబ్ద్యంతమున జన్మించియుండునని యూహింపవచ్చును.

ఎఱ్ఱాప్రెగ్గడ బాల్యమునుండి దక్షిణాపథమున తురుష్కదండయాత్ర లారంభమయ్యెను. అందుచే వెఱ్ఱిన దక్షిణాపథమంతయు నట్టుడికి పోయిన దినములలోఁ బెరిగెను.

క్రీ॥ శ 1323 లో ఉలూఘ్‌ఖాన్ (తరువాతి మహమ్మదు చక్రవర్తి) ఓరుగల్లు జయించిన తరువాత క్రీ. శ. 1324 సం॥లో రాజమహేంద్రవరమునందలి మసీదు నిర్మించి శిలాశాసనము వేయించెను. అప్పటికి ఎఱ్ఱాప్రెగ్గడ పూర్ణయౌవనములోనుండి యుండును.

కాకతీయప్రతాపరుద్రుఁడు రాజ్యభ్రష్టుఁడై, తెలుఁగు దేశము స్వాతంత్ర్యము కోలుపోయి ప్రజలెంత కష్టనష్టములు పడుచున్న దినములలో ఎఱ్ఱాప్రెగ్గడ భారతము రచించెను. ధర్మరాజు రాజ్యభ్రష్టత పాండవుల కష్టములు చిత్రించుటకు ఎఱ్ఱనకు భవ్యకవితావేశము కల్పించినది, సమకాలీనులైన తెలుగువారి దుఃస్థితియే. అంతకుముందు తెలుఁగు దేశము స్వాతంత్ర్యము కోలుపోలేదు. చరిత్రలో తెలుఁగువారికిఁ దగిలిన మొట్టమొదటి దెబ్బ అదియే.

ఎఱ్ఱాప్రెగ్గడ తన భారతభాగము సంచాపెలో మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ జెప్పిన కలియుగ ధర్మములు కన్నులకుఁ గట్టినట్లు వర్ణించును.

వివిధవ్యాఘ్రమృగోరగాకులములై విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలములై యరాజకములై నిర్మూలధర్మంబులై
ద్రవిళాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తినష్టంబులై
భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దస్యుగాంతంబునన్.

సంస్కృతభారతమున "తురుష్కవ్యాప్తి"లేదని వేరుగఁ జెప్పనక్కరలేదు. మూల భారతమున "ఆంధ్రులు" గూడ బర్బరపుళిందాదులతో గలసియుండిరి. ఎఱ్ఱన, సహజాంధ్రాభిమానముతో

"ఆంధ్రుల"ను విడదీసి "తురుష్కుల"ను గలిపెను. తురుష్క వ్యాప్తివలన భువిలో నెల్లెడ జనపదంబులు అరాజకములై పాడ గుట ఎఱ్ఱన కనులార గాంచియుండెను.

"వేదనిందసేయుదు"

"అడలు మిగులఁ గొని రాజులు
నడుఁకు నెంతయును భయ మొనర్తురు"

"అన్యోన్యపీడ" "ద్రవిణ విహీనులై దాత
యొక్కడు లేక, ఎదెగెడు వారును నెంతయు
గ్రూరులై చేసిన పాపంబు చేసెదరు నూవె"

అను ప్రయోగము లర్థవంతములు.

అల్లావుద్దీను మొదలగు తురుష్కరాజులు దక్షిణాపథము నందలి రాజుల ద్రవ్యము నపహరించుట, ప్రజల దోచుకొను టయే ప్రధానాశయముగా గలవారు. ఉలూఘఖాను మున్నగు సేనానులు రాజులయొద్ద కప్పముగా నపారధనరాసులు గొని పోయిరి. సేనలు భాగ్యభోగములతో వెల్లివిరిసినమహానగరముల దోచుకొనిరి. దేవగిరి, ఓరుగల్లు నగరములు విధ్వంసములైనవి. "పుడమి సమస్తంబు నరకభూయిష్ఠమగున్" అన్న మార్కండే యుని భవిష్యద్వాణి భూతార్థ మయినది. తెలుఁగుదేశము, తురు ష్కాక్రాంతమైనప్పటి స్థితి చెప్పు విలసతామ్రశాసనమును జదివి ఎఱ్ఱన కలియుగవర్ణనమును జదివిన, రెంటికిఁ గల కుటుంబసాదృ శ్యము తెల్లమగును.

"వనితాదుర్బలదీనబంధుజన సర్వస్వాపహారులొ సుహృ
జ్జనమాతాపితృపుత్త్రహంతలు యదృచ్ఛాకర్మశీలుర్ ధరన్

జనసంపూజితులై చరింతురు వినష్టశ్రీకులై విప్రులా
జనులం జేరి పరిగ్రహించెద రవజ్ఞాపూర్వదుర్వృత్తముల్.

ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం జౌర్యతో
హరులై సాధులఁ గ్రోచి చేకుఱు తదీయస్త్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరంబై పెల్లు చెల్లుం బర
స్పరయుద్ధంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణి నాశంబుగన్

దేవతాయతనంబులున్ జగతీసురావసథంబులుం
బావనాశ్రమధామములుం జెడి పాడగున్ పథవృక్షవ
ల్లీవనంబులు నాశ మొందుఁ గలిప్రచారమునందు దు
స్త్రీవిహారము మద్యపానముఁ జెల్లుఁ జెల్లగ నల్లెడన్

ప్రుక్కిడి చోరులు ముట్టి నిశ్శేష
ముగ ధనావళిఁ గొని మొగి వధింపంగ
ప్రుక్కి కాపులయట్ల హానులై చెదరి
సొంపటి యడవులు సొత్తురు జనులు

క్రమమున రాష్ట్రములును నగ
రములును నాశంబు నొందు రక్షచ్యుతులై
భ్రమియింతురు జను లతిదు
ర్గమగిరిసరిదంతికములఁ గడు నాతురులై"

"సుహృజ్జనమాతాపితృ పుత్ర హంతలు
యదృచ్ఛా కర్మశీలురు" - ధరన్ జనసంపూజితులై చరించెదరని ఎఱ్ఱన వ్రాయుచున్నపుడా మహాకవి మనస్సులో నల్లావుద్దీను తుఘ్లకు చక్రవర్తుల రాజ్యసంపాదన, శీలములే యాద్యప్రకృతులుగ భాసించినవి.

ఎట్టిన, దేవాయతనంబులు, జగతీసురావసథంబులు పోవగుట, అగ్రహారములు నశించుట, మద్యపానస్త్రీ విహారములు ప్రబలుట, అరాజకత్వమున రక్షచ్యుతులై జను లాతురులై అతిదుర్గమగిరిసరిదంతికముల( జొచ్చుట ప్రత్యక్షముగ( గాంచి, చెమ్మగిల్లిన కన్నులతో, చెమరించిన దేహముతో, కదలిన గుండెతో( బై పద్యములు వ్రాసెను.

కాని, తెలు(గుదేశము ముస్లిములక్రింద నెంతో కాల ముండలేదు. కోలుపోయిన స్వాతంత్ర్యమును సంపాదించుట కొఱకై కాకతీయసామ్రాజ్యమునందలి డెబ్బదియైదుగురు వీర నాయకులు కలిసి పునఃప్రయత్నము సల్పిరి. ఇదివరలో వీరెన్ని పర్యాయములో శత్రుభీకరులై విజయములు సాధించినవారే. హమ్మీరుని బిరుదావళిలో( బ్రత్యక్షముగ

“ప్రలయవఖానుని సప్తాంగహరణాకార
మలికనేమాలుని మానమర్దన” అనియున్నది.

ఉలూఘుఖానుని మూలకథావసము తెలు(గు వీరు లనేక పర్యాయములు జయించి యుండిరని ఊహింపవచ్చును. తెలు(గు వీరుల కత్తిసాము జగత్ప్రఖ్యాతి చెందినది. పట్టుబడిన పోతు గంటి మైలి, తెలుగు ఖడ్గములలో నెవ రుత్తమవీరులో( ముస్లిములే పోల్చుకొనలేక పోయిరి. ఢిల్లీలో నాజగదేకమల్లుర లెక్కటికయ్యము, కత్తిసాము సుల్తాను నిండుకొలువు ముందు డాకోలు నంచేర్పాటు చేసిరి. అల్లావుద్దీను సుల్తాను, మాలిక్ కాఫరులు తీర్పరులు.

ఢిల్లిలో సురథాను( డల్లావదీధరా
ధ్యక్షుండు ప్రత్యక్షసాక్షి గా(గ

మహనీయజయశాలి పలికి వేమారెడ్డి
జగదేకశూరుండు సాక్షి గాఁగ
జగతిపై డెబ్బదేడుగురు నాయకులు
నక్షీణబలయుతుల్ సాక్షి గాఁగ
సహజసాహసయుద్ధసన్నద్ధవరభటా
శ్రయమైన దాకోలు సాక్షి గాఁగ

సూర్యవంశోదయఖ్యాతుఁ డార్య తెలుఁగు
బిజ్జలనృపాలు గెల్చెఁ దద్భీమబలుఁడు
వైరిగజభీముఁ డమితసత్యప్రియుండు
ఘనభుజాశాలియగు పోతుగంటి మైలి.

కాలకర్మవిపరిపాకమున స్వాతంత్ర్యము గోలుపోయిన తెలుఁగు వీరు లంపరేకమైన ముస్లిముల జయించుట సుకరమే. ఇదివరలోఁ బ్రతాపరుద్రుని యొద్దనున్న వృద్ధవీరులు కొలని ప్రతాపరుద్రదేవుఁడు, అన్నమంత్రి, పోలయ నాయకుఁడు, ప్రోలయ వేమారెడ్డి యీ మహోద్యమమునకు దేశభక్తిపూరితులై ముందునకు వచ్చి నాయకత్వము వహించిరి.

పూర్వవైభవమును స్మరించి దేశమునుద్ధరించుటకై యువకులు, వీరులు నడుము కట్టుకొనిరి. ఆ మహోద్యమప్రవర్తయై ఎఱ్ఱాప్రెగ్గడగూడ నా మహానాయకులు కత్తితోఁ జేసిన ప్రబోధమునే తాను గంటము పట్టి సల్పెను. భారతవీరుల గాథలు, పాండవుల యరణ్యవాసము, వృత్రాసుర విజృంభణము, దేవతల సేనాధిపత్యము వహించిన కుమారస్వామి వృత్తాంతముల, నన్యాపదేశముగ ఈ స్వాతంత్ర్యప్రబోధమునే సలిపెను.

ముసునూరి ప్రోలయ నాయకుఁడు తెలుఁగునాయకులకు నాయకుఁడయ్యెను. తెలుఁగుదేశమంతయు తుగ్లకుపరిపాలన కెదురు తిరిగెను. అరవీటి సోమరాజు నాయకత్వమున పశ్చిమాంధ్రమున విప్లవము చెలరేగెను. క్రీ॥ శ 1328 ప్రాంతమున తెలుగుదేశము స్వాతంత్ర్యము వహించి ముస్లిముపరాధీనత నుండి విముక్తి బొందినది. తుగ్లకు చక్రవర్తి చేయునది లేక ప్రతాపరుద్రుని దగ్గర కోశాధికారులుగ దండనాథులుగనున్న హరిహర బుక్కరాయలు ఢిల్లీలో ఇస్లాము మతము స్వీకరించి చెఱసాల నుండఁగ, వారిని విడిపించి పశ్చిమాంధ్రమునకు రాజప్రతినిధులుగఁ బంపెను. వారు స్వదేశము చేరి, స్వాతంత్ర్య ప్రవక్త, వేదవ్యాఖ్యాతయైన విద్యారణ్యమహర్షివలన తిరిగి సనాతనమతమునందు చేరిపోయిరి.

దక్షిణాపథమంతయుఁ దిరిగి నవనవోన్మేషముగ పునరుజ్జీవింపఁ దొడగెను. వేదాంతియై షడ్దర్శనప్రవక్తయై, వేదవ్యాఖ్యాతయై పశ్చిమాంధ్రమున విద్యారణ్యమహర్షి సల్పిన కృషినే పంచమవేదము చేపట్టి పూర్వాంధ్రమున ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి నడ్పెను.

ప్రోలయవేమారెడ్డి - అతని తమ్ముఁడు మల్లారెడ్డి ఈ స్వాతంత్ర్యోద్యమమున కత్తిబట్టి నిలిచిన మహావీరులు, ఆనాడు తురుష్కులవలన విధ్వంసములైన దేవాలయములు పునరుద్ధరించి, అగ్రహారములు నిలిపి ప్రాచీనసాహిత్యసంస్కృతి సంప్రదాయములు పునఃప్రతిష్ఠ నలిపిన దేశభక్తులు. పశ్చిమ గోదావరి భీమవరసమీపమున నున్న మోగల్లు గ్రామమున ప్రతాపరుద్రుని కాలమున నున్న ప్రథమకవి శ్రీగిరి దేవయ్యనిగారికి భూదానము

పేర్కొను శిలాశాసనమును అనవేముడు వేయించెను. దీనినిబట్టి ముస్లిము దండయాత్రలో నష్టపడినవారికిఁ దిరిగి రెడ్డిరాజులు పట్టాలు నిచ్చిరని ఊహింపవచ్చును.

తురుష్కులు దేవాలయములఁ బాడొనర్చి, విగ్రహములఁ బగులఁగొట్టి, బ్రాహ్మణుల హింసించి, అగ్రహారముల లాగుకొనిరి. ప్రోలయనాయకుడు, రెడ్డి రాజులు దేవాలయములు అగ్రహారములు పునరుద్ధరించి, బ్రాహ్మణులఁ బోషించిరి. ఎఱ్ఱాప్రెగ్గడ భారతమున నీ పునరుద్ధరణమే

"ఆరామవ్రజచైత్రపద్మవనదేవాగారసౌఖ్యంబులై
భూరిబ్రహ్మతపస్విసంకులములై పుణ్యోత్సవారంభసం
భారోదారములై నితాంతఫలితప్రాజిష్ణుసస్యంబులై
యారూఢస్థితి నెల్లదేశములు నొప్పారున్ బ్రకాశంబుగన్"

అను పద్యమున ధ్వనించుచున్నది.

ముస్లిము దండయాత్రలకు మతప్రచారదృష్టి విశిష్ట మగుటచే వారి తీవ్రక్రోధమునకు బ్రాహ్మణులు దేవాలయములు గుఱియయ్యెను. ఆకారణముచేతనే దేవబ్రాహ్మణపునరుద్ధరణమునకు రెడ్డిరాజులు, నాయకులు బద్ధకంకణులైరి. తీవ్రహింసకు గురియైన వారియందు దేశమున సహజముగ సానుభూతి, జాలి కూడ నేర్పడినది. మార్కండేయుడు ధర్మరాజుతో

ధరణీసురులకు నెప్పుడుఁ
గరము ప్రియము సేయుమయ్య కౌరవపుం
శోత్తర విప్రులు సంతుష్టిం
బొరసినఁ జేకురు నశేషపుణ్యఫలంబున్" అని పల్కెను.

విద్యారణ్యునివంటి మహర్షులు స్వాతంత్ర్యోద్యమనాయకులు కన్నా మహాప్రవాతులై సనాతన సంస్కృతికి బట్టుకొమ్మలై నిల్చిరి.

క్రీస్తుశకము 1325 సంవత్సరమున మల్లవరము శాసనమున వేమారెడ్డి, అద్దంకి రాజధానిగ నేలుచున్నట్లు గలదు. ఒంగోలు మండలము మాజేశ్వరముననున్న శాసనమున క్రీ॥ శ. 1353 న వేమారెడ్డి యువరాజు అనపోతారెడ్డి పేర్కొనబడినారు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున

వితతయువరాజవిభవో
న్నతపోతయునై న్యనాథనయమార్గనమీ
హితసంతతసేవాదిం
సితపుత్రశ్రీసమృద్ధ శివగురుసిద్ధా.

అని వర్ణించెను. దీనినిబట్టి ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును క్రీ॥ శ. 1353 సంవత్సరమున కించుక ముందు ప్రోలయ వేమారెడ్డి కంకితమిచ్చెనని యూహింపవచ్చును.

ఎఱ్ఱాప్రెగ్గడ ప్రోలయ వేమారెడ్డి యాస్థానకవియైన సంవిధాన మొక మనోజ్ఞకథ. వేమారెడ్డి తమ్ముఁడు మల్లారెడ్డి రెడ్డి రాజ్యమున సేనానియై గుడ్లూరు, చదలువాడ ప్రాంతములు రాజ ప్రతినిధియై పరిపాలించెను. తెలుఁగు దేశమును తురుష్కులబారినుండి సంరక్షించిన మహావీరులలో మల్లారెడ్డి పేర్కొనఁదగిన వాఁడు.

మల్లారెడ్డి, ఎఱ్ఱన మహాకవిని "ఆరతశ్రీతోడనే సముపేతుఁజేసి" అన్నగారగు మహారాజు వేమారెడ్డికి బహుమానముగ సమర్పించెనని హరివంశ పీఠికలోఁ గలదు.

"నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాదరత
శ్రీ తోడన్ సముపేతుఁ జేసి యిదిమిం జేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిన్ బొందితి యింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్

అని వేమారెడ్డి పల్కెను.

ఎఱ్ఱన హరివంశమునకుముందే రామాయణము రచించెను. అందు పీఠికలో మల్లారెడ్డినిగూర్చి వేమారెడ్డినిగూర్చి చెప్పియుండును. దురదృష్టవశమున ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము మనకు లభించుటలేదు. అందుచేత ఆంధ్రవాఙ్మయమునకేగాక చరిత్రకుఁగూడ తీరనిలోటు ఏర్పడినది.

ఆంధ్రసాహిత్యచరిత్రలో మల్లారెడ్డి పేరు సువర్ణాక్షరములతో లిఖింపఁబడినది. రెడ్డిరాజుల చరిత్రలో కృతికర్తలై కృతిభర్తలై సాహిత్యాభిరుచితోపాటు అభినివేశము మేళవించి విద్వాంసులై చిరస్మరణీయకీర్తి సంపాదించుటకు రాచబాట వేసి మార్గదర్శకుఁడైనవాఁడు మల్లారెడ్డి. తెనుఁగు తల్లికి దాస్యవిమోచనము సల్పి. యెత్తిన కత్తి దింపని జగదేకవీరుఁడు మాత్రమే గాక, మహాకవికంటె మహారాజునకు సమర్పింపఁగల మంచి కానుక లేదని గ్రహించిన రసజ్ఞమూర్తి. మల్లారెడ్డి ఏ సుముహూర్తమున ఎఱ్ఱన మహాకవిని మహారాజునకు సమర్పించెనో యప్పటినుండి ఆదిలో అద్దంకి తరువాత కొండవీడు, రాజమహేంద్రవరము రెడ్డి రాజ్యమునకు రాజధాని దక్షిణాపథమునకు రస రాజధానిగ ప్రఖ్యాతివహించినవి. రెడ్డి రాజ్యమున నొక శతాబ్ది పాటు మల్లారెడ్డి పెట్టిన మేలుబంతివలన మంత్రులు, దండనాథులు, అవచితిప్పయసెట్టి వంటి వణిక్ప్రముఖులు రాజులతో

పాటు కవులకు కర్పూరనీరాజనములు, కస్తూరిహేమపాత్రాన్నములు, ముత్యాలశాలు కనకవర్షములతో మన్నించిరి.

బాహాదర్పమునం బ్రతిపక్షరణీపాలావలిం ద్రోలి యు
ద్వాహోదగ్రుఁడు మోటుపల్లిఁ గొని సప్తద్వీపసద్వస్తు సం
దోహంబున్ దనకిచ్చునెచ్చెలి సముద్రం బ్రీతి గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్

అని ఎఱ్ఱన మల్లారెడ్డిని హరివంశమున స్తుతించెను.

కృతిభర్త, మహారాజునకు వేమారెడ్డినిగూడ మల్లారెడ్డి సోదరునిగనే యెంచి వర్ణించెను.

ధీయుక్తమల్లరథినీ
నాయకమంత్రప్రయుక్త నయపూర్వక కా
ర్యాయత్త ఖడ్గవిభవ
స్ఫాయస్వవిభవాభిపోష భాసురవేషా!

వేమారెడ్డి క్రీ॥ శ. 1345 సంవత్సరములో అమరావతిలోని యమరేశ్వరునకు సోదరుఁడైన మల్లారెడ్డి పుణ్యముకొఱకైదు స్వర్ణశిఖరము లెత్తించెను. మల్లారెడ్డి అప్పటికి దివంగతుఁడై యుండును గాపున, హరివంశమునాటికి సజీవుఁడుగ నున్నట్లు గన్పించుచున్నది గనుక, హరివంశము రామాయణము క్రీ॥ శ. 1345 సంవత్సరమునకుఁ బూర్వము 1325 సంవత్సరమునకుఁ దరువాత రచింపఁబడినవని చెప్పవచ్చును. క్రీ॥ శ. 1325 సం॥ వేమారెడ్డి తొలి మల్లవరశాసనము తరువాత క్రీ॥ శ. 1332 సం॥ న కరికల్లు శాసనము మధ్య. శాసనములు గన్పింపుటలేదు. ఈ యెనిమిదేండ్ల మధ్య వేమారెడ్డి, మల్లారెడ్డి రెడ్డి రాజ్యసంస్థాపనమునందు నిమగ్నులైయుండిరని విశ్వసింప

వచ్చును. అట్లయిన రామాయణము, హరివంశము క్రీ॥శ. 1332-45 సంవత్సరముల మధ్య, రచింపబడి యుండును.

మల్లారెడ్డి చేపట్టుటకుఁ బూర్వమే ఎఱ్ఱాప్రెగ్గడ కవిగ ప్రఖ్యాతి వహించియుండవలెను. హరివంశమునందు రామాయణప్రశంస కలదు. హరివంశము భారతమునకు పరాంశము గనుక, కృతిపతి దానినిగూడ రచింపుమని కోరెను.

భారతపరాంశమని యిం
పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వా రమ్యకథఁ దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్.

దీనినిబట్టి పరాంశమునకు ముందు, పూర్వాంశమగు భారతము నాతఁడు రచించినట్లే గదా.

మహాభారతము నందలి యరణ్యపర్వశేషము పూరించి "కవిత్రయము"లో స్థానము పొంది సుగృహీతనామధేయుఁడైన ఎఱ్ఱన కవిని మల్లారెడ్డి చేపట్టెను. భారతరామాయణములు భారతభూమిని పరమపవిత్రగ్రంథములు గనుక వేమారెడ్డి. రామాయణము రచింప ఎఱ్ఱనను గోరియుండును.

భారతరచన నాటికి ఎఱ్ఱన గుడ్లూరులో నుండెను. ఈ గుడ్లూరు మల్లారెడ్డి పాలనక్రింవనున్న చదలువాడకు గురుము లూరికి సమీపమున నున్నదే. గుడ్లూరు నందే ఎఱ్ఱన, మల్లారెడ్డి స్నేహ మేర్పడి, తరువాత చదలువాడ చేరి, మడి మాన్యములు సంపాదించి, రాజధాని అద్దంకి చేరి ఆస్థానకవియై జీవితమున నపరసంధ్యలో చెదలువాడఁ జేరియుండును.

అందుచే నితని వంశస్థులు తరువాత చెదలువాడ వారైరి. విప్రనారాయణచరిత్ర రచించిన చెదలువాడ మల్లయకవి, ఎఱ్ఱన వంశీయుడు.

ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులు గాఁగ
వల్మీకభవు వచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధమ్ము చేసె
నారసింహుని పురాణ మొనర్చె హరి మెచ్చి
నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ రెంటను
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న
దురితహరు ప్రబంధపరమేశ్వరుని చెద
ల్వాడ నిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకును దరంబె!

తిక్కన నిర్యాణము, ఎఱ్ఱాప్రెగ్గడ జననము ఇంచుమించుగ నేక కాలమున జరిగియుండును. భారతము పూర్తిచేయు కారణజన్ముని యుదయము చూచియే మహానుభావుడు తిక్కన మహాకవి మరణించి యుండునని యనుకొనిన కథ రక్తిగట్టును.

పదునేనుపర్వములు తుదముట్ట తెనుగున రచించిన తిక్కన మహాకవినిగూర్చి స్వయముగఁ జూచినవారివలన బాల్యమునుండి ఎఱ్ఱన విని నన్నయ తిక్కనల సరస శాశ్వతముగ పీట వేయించుకొన తహతహలాడి ముందుగ భారతము చేపట్టెను.

హరివంశమునందుఁ దిక్కనగూర్చి ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి
"తన రావించిన సృష్టి తక్కొరుల చేతంగాదునా నేముఖం
బునఁ డాఁ బల్కిన పల్కు లాగమములై పొల్పొందునా వాణిస
త్తను నీతండొకరుండు నాఁ జను మహత్త్వాప్తిం గవిబ్రహ్మ నా
వినుతింతుం గవి తిక్కయజ్వ నిఖిలోర్వీదేవ వాచ్యార్చితున్"
అని ప్రశంసించెను.

ఎఱ్ఱన రచించిన భారతారణ్యపర్వశేషము రామాయణము, హరివంశము, నృసింహపురాణము, నే యానుపూర్విలో రచించెనను నది యొక సమస్య. హరివంశమునం దతని రామాయణ ప్రశంస గలదు. హరివంశము "భారత పరాంశ" మని యందే కలదు కావున పూర్వాంశమంతయు ముందే రచించినట్లు ధ్వని గలదు.

నృసింహపురాణమునందు

ఉన్నతసంస్కృతావిచతురోక్తిపథంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్టతిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"
అని కలదు.

దీనినిఁబట్టి నృసింహపురాణము భారతము తరువాతిదని చెప్పక తప్పదు. ఎఱ్ఱన నృసింహపురాణము స్వప్నాంకితముగఁ జెప్పెను. అందుఁగూడ స్వప్న వృత్తాంతము గలదు. తిక్కనకు వలెనే ఎఱ్ఱనకుఁగూడఁ బితామహుఁడైన యెఱపోతసూరి స్వప్నమునఁ గన్పడును.

గురుభజనపరాయణుఁడవు, సరసబహుపురాణధర్మశాస్త్రకథా వి
స్తరవేదివివి నయోదితభరితుఁడ వతులానుభావభవ్యుఁడవుమహిన్.

కావున, బ్రబంధరచనా
ప్రావీణ్యము నీకు సహజపరిణతసిద్ధం
బై వెలసినయది యొక కృతి
గావింప జగద్ధితంబుగా నేఁబనుతున్.
శ్రీమదహోబలేశ నరసింహుఁడు నా ప్రియ దైవతంబు మ
త్స్వామి తదీయకీర్తివిభవంబును దన్మహితావతారమున్
నీ మధురోక్తిగుంభన మనీషులు మెచ్చఁగఁ బ్రస్తుతింపు నీ
కేమెయి సంభవించు నఖిలేప్సితపుణ్యఫలోదయోన్నతుల్"

పితామహుని వచనానుసారము నృసింహపురాణము అహోబలనరసింహున కంకితము గావున నీ కవి గూడఁ దొలుత నరాంకితముగఁ దరువాత నీశ్వరాంకితముగఁ గృతి చెప్పెనని యొక వాదము, మరి కొందరు నృసింహపురాణము నాటికిఁ గవికే రాజాశ్రయము దొరకలేదని చెప్పుచున్నారు.

ఎట్లున నృసింహపురాణకృతికాలమునకే "ప్రబంధరచనా ప్రావీణ్యము", "సహజపరిణతసిద్ధంబైన" వాఁడు సరసబహుపురాణధర్మశాస్త్రవిస్తరవేది. కావున నప్పటికే భారతరామాయణ హరివంశములు రచించెనని చెప్పవచ్చును.

నృసింహపురాణరచనాకాలమునకు ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి యాత్మీయతలో నేర్పడిన క్రమపరిణామవికాసము తిక్కన మహాకవి వినయసంపదను దలపింపఁ జేయును,

"అని యీ క్రమంబునఁ బ్రధానదేవతాసంకీర్తనంబును మహాకవిజనప్రార్థనంబును సద్గురుచరణానుస్మరణకీర్తనంబును సమర్థించి కృతార్థతం బొంది కతిపయాక్షరపరిగ్రహ జనితంబైన నైసర్గికచాపలంబుకతంబున

మించిన పేర్కా వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు భంగి ప్రౌ
ఢాంచిత శబ్దసారసలు మహాకవు లాఘ్యులు కావ్యశయ్య గ
లించిన కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్''.

అప్పటికే ఎఱ్ఱన భారతము పూర్తిచేసి కవిత్రయములోఁ జేరెను. నన్నయ తిక్కనలు కవిరాజహంసలై భారతము వ్రాసిరి. తానుఁ గూడ నట్టి కవియశస్సు నర్థించుట క్రౌంచముకూయు నట్లే యని వినయముగఁ బల్కెను.

ఎఱ్ఱనకు మహాభారతముపై, వ్యాసునిపై, నన్నయ తిక్కనలపైఁ గల పూజ్యభావ మపారము.

భాసురభారతార్థముల భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గానట వీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లఁగఁ జేసినట్టి య
జ్ఞానకల్పులం దలఁతు నాద్యులు నన్నయ తిక్కనార్యులన్

అని అతఁడు నన్నయ తిక్కనలఁ బ్రశంసించెను.

తిక్కన మహాకవి సాహిత్యజీవిత మాతనికి గల్పించిన యంతఃపరిబోధము సుస్పష్టము. శంకరస్వామి శిష్యత్వము గూడ నతనికి పరిణత వయస్సునకే సంక్రమించియుండును,

యామము రెమ్మదింట నియతాకృతిఁ బ్రత్యహమున్ శివార్చనా
రామత మొప్ప నిత్యశివరాత్రి వ్రతంబుగఁ బూని భవ్యయో
గామృతతృప్తిమైఁ ద్రిజగదర్చితలీలఁ దనర్చు శంకర
స్వామి మునీంద్రు భక్తజనవత్సలు సద్గురు నాశ్రయించెదన్

నృసింహపురాణమున శంభుదాసుఁడగు నెఱ్ఱన శంకరస్వామి గురుస్తుతి సల్పి

"విష్ణుధర్మ ప్రశంసాపవిత్రమైన
యస్మదీయప్రబంధసామగ్రి వలన"

తన పితామహుండగు నెఱపోతసూరి యతులానందజలధి నోలాడునని యెంచెను. ఎఱ్ఱన గూడఁ దిక్కన వలెనే "విష్ణురూపాయ నమశ్శివాయ" యన గలిగిన మన స్తత్త్వము గలవాఁడు

"గిరిశపదభక్తిరసత
త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగా
బరఁగిన గోవిందగుణా
దరసంభృతసౌమనస్యధన్యుఁడ వెంతున్"

అతని పితామహు డెఱపోతసూరి ప్రవచన మది.

ఎఱ్ఱన గుడ్లూరు నందున్నపుడు భారతమున నరణ్యపర్వ శేషము రచించెను.

భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుఁ డిలఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసక మెసగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ
డెఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ
డయిన నన్నయభట్టమహాకవీంద్రు
సరసస్వారస్వతాంశపరిశస్తి దన్నుఁ
బొందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి.

ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్

ఎఱ్ఱన రచించిన రామాయణ ముపలభ్యమానముగాకున్నను లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడిన పద్యములలో సింహాద్రి కంఠస్తవమున్నది.

నిను సేవించినఁ గల్గు మానవునకున్ వీటిపఘాటీఘటీ
ఘనకోటీకటీకటీకటీవటీ దంభేవనాపేటీపటీ
రనటీహారిపటీసువర్ణమకుటీప్రస్ఫోటికాపేటికల్
కనదామ్నాయమహాతురంగ శిఖింగా నీంకంఠేశ్వరా!

ఎఱ్ఱన "లోకైకకవితుఁడైన నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశప్రశస్తి" దన్నుఁ జెందినదని మురిసి పోయెను. తక్కవితారీతియు "కొంత" దోప అరణ్యపర్వశేషము పూరించెను. సవినయముగ నన్నయ రీతి "కొంత" దోపనని మాత్రమే చెప్పుకొనెను.

ఎఱ్ఱన అరణ్యపర్వశేషమున నన్నయ ననుకరించుటకుఁ బ్రయత్నించెను. నన్నయ వృత్తరచన సమాసపదగుంఫనములు, పదలాలిత్యము, ప్రసన్నకథాకవితార్థయుక్తి "కొంత" వరకు నెఱ్ఱనకుఁ బట్టువడినవి. ఎఱ్ఱన భక్తితో నరణ్యపర్వశేషము నన్నయ పేరుమీదనే రాజరాజనరేంద్రునకే కృతి యిచ్చినట్లు వ్రాసెను. తిక్కన యే హేతువుచే నరణ్యపర్వశేషము పూరింపక విడిచెనో యా హేతువుచేతనే నెఱ్ఱన దానిని రాజరాజున కంకితముగ నన్నయభట్టు పేరుమీదనే వ్రాసెను. భారతము ప్రబంధమండలి

ఒక్కొక్క పర్వమొక్కొక్క ప్రబంధము. అరణ్యపర్వ మిది వరకే రాజరాజార్పితము. నన్నయ, రాజరాజనరేంద్రుఁ డనిన నెఱ్ఱనకు విశేషభక్తియుండి యుభయుల, కృతిపతి కృతికర్తలుగా నిలిపి నిష్కామసేవగ నరణ్యపర్వశేషము రచించెను.

దీనివలన నన్నయ యరణ్యపర్వము పూర్తిగ రచించె ననియు "మూఁడుకృతు"లతఁడు రచించినట్లు తిక్కన మారనల సాక్ష్యము నుదాహరించి యెఱ్ఱన శిథిలభాగముల మాత్రమే పూరించెనని యొక వాదము తలసూపినది. కాని, వ్రాత ప్రతులన్నిటి యందు శారదరాత్రు లను నన్నయ పద్యము తరువాత ఎఱ్ఱా ప్రెగ్గడ కవిత్వారంభమని యున్నది.

"స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ నెలంగఁగా
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్

అని నన్నయ కవితాగానమున ఆలపించిన శ్రుతి నందుకొన గల్గి నాఁడు.

నన్నయ మధ్యాక్కరల యతిస్థానమునకును నెఱ్ఱన మధ్యాక్కరల యతిస్థానమునకును గల భేదము గమనింపదగినది. తత్కవితారీతి కొంత దోప మధ్యాక్కరాదివృత్తముల నెఱ్ఱన యెత్తినను స్వీయముద్ర వేయక వదలలేదు. నన్నయ యక్షర రమ్యతనుగూడ నెఱ్ఱన చక్కగఁ బట్టుకొనెను.

అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీప్తికా

చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్త వివిక్తనిజప్రభావభా
వాంబరవీధివిశ్రుతవిహారి ననుం గృపఁ జూచుఁ భారతీ!

భారతమునందలి యీపద్యము, రామాయణము నందలి నీల
కంఠేశ్వర స్తవము ఎఱ్ఱన యాయా గ్రంథములకు ముందే రచించి
యుండును. ఈ పద్యములు నన్నయ పద్యములవలె, నినదించు
చుండుటచే నతనికి "నన్నయభట్టకవీంద్రునరససారస్వతాంశ
ప్రశస్తి" సమకాలీనులవల్లనే లభించినవి.

ఎఱ్ఱన యరణ్యపర్వశేషమునందు నన్నయ పద్యభాగము
లను పదగుంఫనమును విరివిగా వాడెను. దుర్యోధనుఁడు ఘోష
యాత్రానంతరము ప్రాయోపవేశము మాని కరిపురంబునకుఁ
బోవు నపుఁడు ఎఱ్ఱన పద్యము

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలచ్ఛటులనై నికమత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్భయదమనోహరప్రకటభంగులఁ దద్బలవార్ధి యుద్ధతిన్"

నన్నయభట్టు శిశుపాలవధ ఘట్టమున రచించిన

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలచ్ఛటులనై నికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజకుకురాంధకవాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుతనితాంతసమీరితమై క్షణంబునన్"

అను పద్యమును స్మరణకుఁ దెచ్చును.

ఎఱ్ఱన, నన్నయ భాషాగతిని తిక్కన భావగతిని ననుస
రించెను. తిక్కన సంజయుని నోట ధర్మరాజును "మెత్తనిపులి"

యని వర్ణించును. ఎఱ్ఱన ధర్మరాజు తిక్కన చిత్రించిన మెత్తని పులియే.

గంధర్వులను జయించి అర్జునాదులు దుర్యోధనాదుల యజ్ఞదీక్షితుఁడగు ధర్మరాజు సముఖమున నుంచిరి.

"యుధిష్ఠిరుండును ధార్తరాష్ట్రునకు బంధమోక్షణంబు గావించి యాతని కిట్లనియె.

"ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య దుర్జనుం
డన్నను సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁ గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గాంతలఁ గైకొని బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొండొక విషాదము బొందకుమీ మనంబునన్"

గంధర్వుల బాణములు చేయ లేని పని ధర్మరాజు మెత్తని మాటలు సల్పినవి. దుర్యోధనుఁడు ప్రాయోపవేశమునఁ బ్రాణ త్యాగమునకుఁ బూనుకొనెను.

ఎఱ్ఱన, నన్నయ తిక్కనల ననుకరించి తృప్తిపడిన వాఁడు మాత్రము కాడు. ఆంధ్రవాఙ్మయమున నన్నయ తిక్కనలతో పాటొక స్వతంత్ర కవితారీతి స్థాపించెను. నన్నయ ప్రసన్నకథా కవితార్థయుక్తికి తిక్కన పాత్రచిత్తవృత్తుల వర్ణనతోఁగూడిన నాటకీయశిల్పమునకు, మూలపురుషులైనట్లే ఎఱ్ఱాప్రెగ్గడ వర్ణనాత్మకశయ్యకు మార్గదర్శకుఁడై ప్రబంధపరమేశ్వరుఁ డయ్యెను.

సంస్కృతభారతమున దుర్యోధనుఁడు ఘోషయాత్రకు వెడలినపుఁ డతఁడు ద్వైతవనంబునం దనేకగోసమూహముల గాంచినట్లు మాత్రమే గలదు.

దుర్యోధనుఁ డెఱ్ఱన తెలుగు భారతమున
నానాసహస్రసంఖ్యానంబులై సంత
తానందవిగతభయత్వలీల
నక్కానసమున నేదిక్కు సూచిన నతి
సంకులంబుగఁ గుందశంఖచంద్ర
హారనీహారడిండీరపటీరము
క్తాహారహీరసంకాశములును
గాదంబకాదేయహాదంబినీనీల
జాలతమాలికాసన్నిభములు
పౌత్రిఖబంధూకపల్లవభాసితములు
వికచకాంచనచంపకవిస్ఫుటములు
నైన వర్ణంబు లొప్ప నేత్రాభిరామ
భంగి నలరారు గోగణంబులఁ గనియె

ఇట్లు ఆంధ్రమహాభారతమును జేపట్టుటచేత మాత్రమే గాక నన్నయ తిక్కన ఎఱ్ఱన మహాకవులు ముప్పురు మూఁడు భిన్నస్వతంత్రకవితామార్గములకు మూలపురుషులగుటచేఁ గవిత్ర యము వారి కాంధ్రసాహితీజగత్తునందుఁ బ్రధానపీఠములు లభించి నవి.

సాహిత్యశిల్పము ప్రస్తరించిన మూఁడు భిన్నరీతు లభి వ్యక్తమగును. కథాకథనశిల్పము. కథ పౌరాణికమైన రీవితో నైతిహాసికశోభతో ఉదాత్తరమణీయముగా చెప్పుట యొకటి. కథా కథనశయ్యకు నన్నయ మూలపురుషుఁడు.

మనోధర్మపరిజ్ఞానముతో శీలానుశీలనము సల్పుచు, సంభా షణమున కథను నడుపుచు, పాత్రల చిత్తవృత్తుల నిరూపించి

యాంగికాభినయము ప్రస్ఫుటమగునట్లు రచించుట, నాటకీయ కవితాశిల్పము. దానికి తిక్కన మూలపురుషుడు.

కథతోపాటు వివిధసన్నివేశములలోని సౌందర్యస్ఫోరకత్వము ద్యోతకమగునట్లు వ్రాయుట వర్ణనాత్మకశైలి. ఇట్టి వర్ణనాత్మకశయ్యకు ఎఱ్ఱన మూలపురుషుడు.

సాహిత్యసృష్టిలో శాశ్వతముగ సాక్షాత్కరించు మూడురీతులకు గవిత్రయము వారాధ్యులైరి. అందుచే గూడ కవిత్రయమునకు, భారతము చేపట్టుటచే యాదృచ్ఛికముగా మాత్రమే గాక, చిరంతనశాశ్వతకీర్తి దక్కినది.

ఎఱ్ఱన రామాయణమునందలి పద్యమునందు గూడ నతని వర్ణనాప్రియత్వ మభివ్యక్తము కాగలదు.

చెఱకుం దోటలఁ బెంచి శాలిమయసుక్షేత్రస్థలుల్ నించి య
క్కఱ లేకుండఁగఁ బూగనాగలతికాకాంతారముల్ ప్రోచి యే
డ్తెఱ నంతం గుసుమోత్పలాళి వనవాటీకోటిఁ బాటించి పె
న్నెఱువుల్ వాపెఁ బురంబు నల్దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్

ఎఱ్ఱనకు ప్రకృతిలోని సౌందర్యము, సృష్టిలోని విలాసవిభ్రమము తన్మయత్వము గల్పించును. సావిత్రీ సత్యవంతులు,

కమనీయకమలినీకల్లోలవీథుల
గవలు రాయంచల గములయొప్పు
బహుపుష్పపల్లవప్రకరచిత్రితములై
తనరారు తరులతాతతుల సొంపు
మకరందరసపానమదవిలోలంబులై
క్రాలెడి మొలదేటిగముల యులివు

బరిపక్వమంజుల ఫలరసోద్ధతములై
పలుకు రా చిలుకల పటురవంబుఁ
బ్రియుఁడు వేఱు వేఱ ప్రీతిమైఁ జూపుచుఁ
జెప్పుచును జనంగఁ జిగురుఁ బోడి
గనుచు వినుచు నిర్వికారసల్లాపమిం
పార నతని తెఱగు నరయుచుండె.

ఎఱ్ఱనకు నన్నయ తిక్కనలతోపాటు సరసనపీట వేయుటకాతని యాధ్యాత్మికోన్నతిగూడ హేతువే. నన్నయ "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" యను సీసమున మహాభారత మందలి "విశ్వజనీనత" వివరించెను. తిక్కన ధర్మాద్వైతమును వివరించెను. ఎఱ్ఱనగూడ వ్యాధగీత యని ప్రసిద్ధికెక్కిన ధర్మవ్యాధోపాఖ్యానమున భారతమునందలి వేదాంతపరమార్థము వివరించెను.

కౌశికుఁడను బ్రాహ్మణుఁడు సంతతవేదాధ్యయనతత్పరుఁడు, రెట్ట వేసిన కొక్కెర నలిగి చూచిన నది యప్పుడు నిశ్చేతనంబై నేలఁ గూలిన నతడు

"అక్కట నా హృదయము కడు
నక్కటికము లేనిదయ్యె ననిమిత్తమ యీ
కొక్కెర నిటు సేసితి నా
కెక్కడి శాంతి యని విమలహృదయుం డగుచున్"

కోమలహృదయుఁడగుటచేఁ బశ్చాత్తాపము చెందెను. కౌశికుని శీలము అద్భుతమిశ్రము. అతఁడు ప్రథమకోపియైనను జిజ్ఞాసువైన పవిత్రతపస్వి.

అతఁడు భిక్షాటనమున నొక పతివ్రత యింటిముందు నిలిచెను. ఆ సమయముననే యామె భర్త యాకటఁ దూలుచు

వచ్చెను. ఆమె యాతని రుచిరాన్నరసంబులఁ బ్రీతుఁ జేసి నొడి కపు సెజ్జ చేసి, తమ్ముఁలం బిడి చరణంబు లొత్తి, భిక్షార్థియైన మునీశ్వరు దలంచి భిక్ష గొనితెచ్చెను. కౌశికుఁ డుగ్రుఁ డయ్యెను.

"అడిగిన యప్పుడ తెచ్చెరఁ
గడపినఁ బో నవ్వ యేను గడు దుర్మతివై
పడఁతి నను నిలిపి భిక్షం
బిడక కడు నవజ్ఞ సేసి తేల మదమునన్"

అని, మఱియు

"నీ మగ డంత యెక్కుడె మనీషలు భూసురు లింత తక్కువే
కోపము యేల యిట్లు గడుఁ గ్రొవ్వునఁగానవు లోకవంద్యులన్"

అని హుంకరించును. అంత నా పతివ్రత

"క్రోధమోహనామములైన ఘోరశత్రు
లిరువు రెరియింప చుండుదు రెవ్వు నంత
రంగ మయ్యుభయంబు నడంగకున్నఁ
గందె యూరక బ్రాహ్మణ్యగౌరవంబు.

ధర్మంబు బహుమార్గదృష్టంబయి సూక్ష్మంబయి యుండు నీవు కేవలస్వాధ్యాయపరుండవు గాని ధర్మసూక్ష్మత యెరుంగవు" అని చెప్పి ధర్మవ్యాధుని కడకు బొమ్మనెను.

"నను మాఱుం దగు నీ కత
మున నా చిత్తము ప్రశాంతిఁ బొరసెఁ బురంధ్రీ
జనవినుత పోయివచ్చెద
ననుపమశోభనసమృద్ధు లయ్యెడు నీకున్"

అని కౌశికుఁ డామెను వీడ్కొని మిథిలానగరమున మాంసోప జీవియైన ధర్మవ్యాధుని కడ కరిగెను.

అతఁ డనేకధర్మముల నుపన్యసించిన తరువాత "ఏను భవదీయసమాగతిఁ జేసి ధర్మసుస్థిరమతి నైతి నన్ననుమతింపు గుణాకర పోయివచ్చెదన్" అని కౌశికుఁడు వీడ్కొనును.

ఇచ్చట, అధ్యయనముకంటె ఆచరణ ప్రధానమని క్రియాశూరతనే ఎఱ్ఱన ప్రబోధించెను. నన్నయ తిక్కనలవలె ఎఱ్ఱన గూడ మహాభారతతత్త్వము నాకళింపుఁ జేసికొనిన మహావేదాంతి.

కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు నె
క్కాలము నేరికిన్ ధ్రువము గాదు సుఖంబును దుఃఖమున్ మహీ
పాల బుధుండు తద్ద్వివిధభంగు లెఱింగి ప్రమోదఖేదసం
శీలుఁడు గాఁడు రెంటను ప్రసిద్ధఫలంబున నప్రమత్తుఁడై"

అని అరణ్యవాసముననున్న ధర్మరాజునకు కృష్ణద్వైపాయనుని యుపదేశము. ఎఱ్ఱన మహాకవి కీ వాక్యములలోఁ దాదాత్మ్యసిద్ధి లభించినది. భగవద్గీతాప్రబోధము స్మరణకు దెచ్చుచున్నది.

ఎఱ్ఱన భారతము పూరించి లబ్ధప్రతిష్ఠుఁడై, రామాయణము రచించి వేమారెడ్డి కంకిత మిచ్చెను. ఆ రామాయణము నందలి పద్యములు కూచిమంచి తిమ్మన, సర్వలక్షణసారసంగ్రహమున నుదాహరించెను. సుమారు రెండు శతాబ్దులవరకు నున్న ఎఱ్ఱన రామాయణము నే డుపలభ్యమానము గాక పోవుట మిక్కిలి శోచనీయము. "సర్వలక్షణసారసంగ్రహము నం"దుదాహరింపఁబడిన పద్యములు:-

నూఱు తెఱంగుల నెఱసులు
మీఱఁగ నీ విభ్రమములు మెఱయించి మునిం
గాఱియఁ జేయుము మేనక
చూఱ కొనదె యతని తెలివి సొమ్ములు మున్నన్

తాటం గ్రాఁగిన నేళ్ల తంపటఁ బాతాళంబు దాఁకన్ జనం
దూరం జల్మిరి భిన్ను దాఁకి తరగల్ తోరంబులై నల్గడల్
పారం జెల్లగ నేఱు లుబ్బరముగాఁ బైపైన నీరెక్కి దై
వారన్ పెర్వలు చెన్ను మీఱె సఖంప్రాణుల్ ముదం బండఁగన్

కోరలు నుగ్గు నుగ్గయిన గ్రూరఫణీంద్రు గతిన్ దరంగముల్
మాఱిన భూరి వారిధి ప్రపంబున రాహుకరాళవక్త్రమున్
దూఱిన తీవ్రభానుక్రియ దుర్బలనై న్వతఁ బుత్రహీనతన్
గీటి పరాభవాభిగతిఁ గీడ్పడి భూపతి నెమ్మనంబునన్

నూర్వురు నొక్కచందము మనోగతి నైరణ చేసె నన్ను నా
సర్వకులంబు నుత్తమయశంబున నుంచితి రమ్మలార! మీ
కుర్విని సాటి యే యబల లొండొరు దేవతలున్ బటుక్షమా
నిర్వహణం బొనర్చుటకు నేరమ మర్త్యులఁ జెప్ప నేటికిన్

సందడి యధ్వరక్రియ కసంగత మేని బలంబుతోడ బెన్
గ్రం దది యేల యేన తగఁ గార్ముకహస్తుఁడనై కడంగి మీ
ముంచట నిల్చెదన్ గ్రతువు ముట్టకయుండఁ బ్రచండదైత్యరా
జిందగ దవ్వుదొల వెసఁ జించెదఁ బెంచెద మీకు మోదమున్

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రొక సంకలితగ్రంథమున నెత్తిన రామాయణములోని పద్యము లని వ్రాయఁబడినవని యీ క్రిందివానిని భారతిలోఁ బ్రచురించిరి.

అనిలజ రావణానుజులు హస్తములన్ గయిదండ గొంచుఁ గ్ర
క్కునఁ జనుదెంచి భానుజుఁడు గొల్వ సుఖంబున నున్న రామచం
ద్రునిఁ గని పాదముల్ శిరముతో నెఱయన్ బ్రణమిల్లి లేచి ని
ల్చిన యెడ నెమ్మొగము వికసిల్లి విభీషణుడుం బ్రియంబునన్.

తమ్ముఁడ! నేఁడు నాకుఁ బ్రియసంబు ఘటిల్లె దశాస్యనందనుం
డిమ్మెయిఁ గూలుటన్ మనకు నింత జయంబగు నంచు సిగ్గులోఁ
గ్రమ్ముఁగ నున్న లక్ష్మణుని గ్రక్కున సంకమునందు నుంచి వ
క్షమ్మునఁ జేర్చుచున్ శిరము సారెకు మూర్కొనుచుం గ్రమంబునన్.

కరముల నవ్విభుం డతని గాయము లంటుచు నూర్పువుచ్చుచున్
బురఁబురఁబొక్కుచున్ శిరము మూర్కొని యొంతయు సాఱడింపుచున్
దురమున నెన్నఁ గూల్చితివి దుర్దముఁ డైన విరోధిఁ బంక్తికం
ధరుఁడును నింకఁ గూలు నని నామది నిశ్చయబుద్ధి నొందెవన్,

మసలక రామరావణులు మార్కొని యుద్ధము సేయుచుండఁగా
నిశితశరంబు లొండొకటి నేర్పునఁ ద్రుంచుచు నుగ్రశక్తిమై
దశశిరుఁ డస్త్రప్రతతి వ్రాఁకినఁ జిత్రము దుల్లిసాపుమై
సుగిరికమ్రనిమీఁదఁ బిడుగూనినఁ గాయలు దుల్లు నాకృతిన్.

అక్కట ధూళిఁ ద్రుంగు తయి యంగము నెత్తుటఁ దోగి వేదనన్
స్రుక్కుచు ధాత్రిపైఁ బొరలుచున్ బడి లక్ష్మణుఁడిట్టులుండ నా
కెక్కడియుద్ధకాంక్ష యిఁక నెక్కడివిక్రమగౌరవక్రమం
బెక్కడిప్రాణ మెక్కడి మహీసుత యెక్కడి రాజ్యసంపదల్.

కంపక గాజువాఱక మొగంబు నివాసముఁ జెందెఁ జేతు లీ
యంపము లైనకాళ్లు నరుణాంబురుహంబుల లీలఁ జూపఁ జె
న్నొందెడు జవహను లిటు లుండరు ప్రాణముతోడ నున్నవాఁ
డిందు సహోదరుండు ధరణీశ్వర, నీకు విషాద మేటికిన్.

మనమున నిశ్చయించి పవమానతనూజుఁడు మూఁడు మాఱులే
వుసఁ గదలించి యంబుధరముం బలె నీలరుచిం జెలంగు త
ద్వనగిరిశృంగమున్ బిడిచి కైకొని పై కెగురంగవైచి యా
చి నిలువఁబట్టుచున్ వెస సుషేణునిఁ జేరగవచ్చి యచ్చటన్.

ఆతని రౌద్రరేఖఁ గని యుర్వి గలంగెఁ జలించె శైలసా
త్పాతికవారిషంబు లతిదారుణరావములై జనించె ధా
త్రీతల మెల్ల విస్ఫురలె దిక్కులు వ్రీలె సమస్తభూతముల్
భీతి వహించె నెంత మగటెం రజనీచరలోకభర్తకున్.

అనయము సర్వభూతములయందును గోప్యజులందు శైలకా
ననగగనాఖిలాశల ఘనత్వము మించ సహస్రపాదలో
చనశతశీర్షమూర్తివయి సారగతిన్ వసియించి సాద్రికా
వనియు సమస్తభూతము లవారి వహింతువు నీవె రాఘవా!

తరుణాదిత్యనిభద్యుతిన్ మెఱసి రక్తస్రక్సుమాశాదికా
ధరయుం దప్తసువర్ణభూషణయు సుస్నిగ్ధాలధూమ్రాభబం
ధురధమ్మిల్లయు నౌ విదేహతనయన్ దెబ్బార్తి బెన్మంటలోఁ
జొర నేతెంచిన రూపుతోన జగముల్ సౌమ్యంబునన్ జూచినన్.

ఆవనిజనంబు లెల్లను దశానను సంతిపురంబునందుఁ బె
క్కువుదివసంబు లున్న జనకాత్మజ శోధితఁ జేయకే యనా
ర్యవిహితప్రవృత్తిఁ దెచ్చె రఘురాముఁడు బాలిశుఁ డంచు నెంచరా
భువనములెల్ల నమ్ముటకు బో ఇటు సేసితి హవ్యవాహనా!

ప్రకటతరాత్మతేజమున రక్షితయౌ మిథిలాధిరాజక
న్యకను బయోధివేలఁ బలె నాశరుఁ డెందు సతిక్రమింపఁ డె
న్నికకును నిప్పువంటి మహనీయ చరిత్రము గల్గు నిట్టి జా
నకిని దరంబె వానికి మనంబున నేనియుఁ జుల్కఁ జూడఁగాన్.

వైరిజయంబు గాంచి బలవంతుల మిత్రులఁ గూడి తేజమున్
సారయశంబునన్ గనిన నాదు సమాగమనంబు నీవు నిం
పారఁగఁ జెప్పుచో నతని యాననవక్త్రవిలోకనేంగితా
కారవచోవిశేషములకై వడి నేర్పునఁ జూడు మేర్పడన్.

అతులంబై వశవర్తియై రథతురంగానేకపాకీర్ణమై
పితృపైతామహమైన రాజ్యము మదిన్ ఖేదిరిపఁగాఁ జేయు నం
తత మెవ్వానికి నైన రాజ్యఫల మాత్మన్ గోరినన్ గైకయీ
సుతుఁడే యేలుచునుండుఁగాక విపులక్షోణీతలం బంతయున్.

అతఁ డడరించు శస్త్రముల యారవముల్ శరపుంఖజాతమా
రుతములు గ్రమ్మినన్ గులగిరుల్ గదలెన్ గలఁగెన్ బయోనిధుల్
క్షితి వడఁకెన్ మనంబునఁ జలించిరి పన్నగలోకవాసులు
స్తుతరుచిఁ బాసి మాసె దిననాథుఁడు మంపటిలెన్ సమీరుఁడున్

వడి సురేంద్రముక్త మగు వజ్రములీల యుగాంతకాలు కై
వడిఁ బర తెంచి రావణునివక్షము గాఁడి ధరిత్రిఁ దూఱెఁ బ
ల్విడి దశకంఠుఁ ద్రుంచె రఘువీరుఁడు నేఁ డని మేలువార్త యే
ర్పడ ఫణిలోకవాసు లలరన్ వివరింపఁగ నేఁగెనో యనన్

ఆ పుణ్యవ్రతఁ బట్టినప్పుడా తదీయంబై యనిర్వార్యమౌ
కోపాగ్నిన్ మసిగాక నీపునికి రక్షోనాథ ; లోకంబునన్
బాపాత్ముం డగువాఁడు పాపఫలమున్ బ్రాప్తవ్యకాలంబునన్
బ్రాపించెన్ నిజపాపకర్మఫల మిబ్భంగిన్ నినుం జెందుటన్.

సవితృఁడు చంద్రుఁడున్ దిశలు సంధ్యలు రేలుఁ బగళ్ళు గాలియున్
భువియును నాదిగా సకలమున్ గను సాక్షులు వీరెఱుంగ నేఁ
బ్రవిమలసద్గుణోతపధురాపరిభూషిత నేని హ
వ్యవహుఁడు నన్ను నిప్పుడె దయాయుతచిత్తతఁ బ్రోచుఁగావునన్

ఆ రీతిన్ భువనత్రయిన్ గలుగువా రత్యంత శోకార్తులై
ధీరత్వంబు పరిత్యజించి యల ధాత్రీనందనం జెందు దు
ర్వారాపన్నత యెంచుచున్ బలుకఁ దద్వాక్యంబు లాలించుచున్
ధారాళాశ్రులతో మనం బెరియఁ జింతన్ రాముఁ డున్నత్తఱిన్.

ఖలునిఁ గబంధునిన్ నిశితకాండములన్ దునుమాడి వాని ప
ల్కులు విని ఋశ్యమూకమునకున్ జని భానుజుఁ గూడి వాలి ను
జ్జ్వలబలుఁ గూల్చి యర్కసుతు వానరరాజ్యమునందు నుంచి యు
య్యలఘుఁడు పంపె భూమితనయన్ వెదకన్ గపివీరకోటులన్.

నిరుపమమూర్తి శ్రీరామధరణీపతి గోషసదేశ నాటి ర
ష్టపుపమొండ్ల కిన్నరులు పాడెరుఁ బాడిరి దేవదుందుభుల్
మొరసెను ధాత్రి సస్యములు మోహనలీల వహించె వృక్షముల్
వరసురభిప్రసూనఫలవర్గములన్ విలసిల్లె నెంతయున్.

అని కొనియాడుచున్ జలరుహాక్షులు సేసలు మీఁదఁ జల్లఁగా
ననఘచరిత్ర! రామ! సుగుణాకర! వర్ధిలుమంచుఁ బౌరు ల
ల్లను దనచుట్టుఁ గొల్వఁగ నలంకృతమైన రథంబుపై ముదం
బున భరతాగ్రజుండు రఘుపుంగవుఁ డీగతి వైభవంబులన్.

జలనిధి గట్టి మించు కపిసైన్యముతో వనరాశి దాఁటి ఘో
ర్పలమున లంకపై విడిసి రావణముఖ్యనిశాటకోటులన్
కలన జయించి భూతనయఁ గ్రమ్మఱఁ గైకొని నిత్యకీర్తులన్
వెలసినవాఁడు రాముఁ డిటు వింటిమె కంటిమె యిట్టి చిత్రముల్.

భేరికాహళశంఖతూర్యములు గంభీరంబులై మ్రోయఁగన్
దారామార్గమునందు దేవఋషిగంధర్వస్తుతుల్ మించ నే
వారూథిం దగ వందిమాగధులు కైవారంబు గావించుచున్
సారోదారవిచిత్రవైఖరుల నానందంబు గల్పింపఁగన్.

రావణుఁ గూల్చి క్రమ్మఱ ధరాసుతఁ జేకొని వచ్చుచున్నవాఁ
డావసుధాకళత్రుఁ డిదె యాప్తులతోడ మహేంద్రుతో శచీ
దేవియుఁ బోలె సీత జగతీతలనాథునిఁగూడె సంతత
శ్రీ విలసిల్ల నప్పుడది చేరినవాఁడు సుమిత్రపట్టియున్.

అతికుల వేములన్ జలరుహాక్షులఁ జంద్రనిభాస్యలన్ విని
ర్మలమణిహేమభూషణసమగ్రల భార్యలఁగా వరింపు గ
న్యల గుణజాతియుక్తలఁ బదాఱుర గ్రామశతంబుఁ జూడఁ జె
న్నలరెడు లక్షగోవులఁ బ్రియం బెసఁగించిన నీకు నిచ్చెదన్.

క్రౌంచక కోటపై నిలిచి కొండలు భీమబలాఢ్యులైన స
త్తంచరు లుగ్రతోమరగదాపటుశక్తుల వానరాలి నొ
ప్పించిరి వానరేంద్రులును బేర్చి రణంబునఁ గోటపైకి లం
ఘించి నిశాటులన్ ధరణికిం బడ నేచి నొంచి దుర్గతిన్.

ఎఱ్ఱన, భారతములోఁగూడ రామాయణగాథ వివరించియుండెను. ఆ సంక్షిప్తగాథగాక ఈ పద్యములఁబట్టి యథా వాల్మీకముగ విస్తరించియే ఎఱ్ఱన రామాయణము వ్రాసినట్లూహింప వచ్చును.

ఎఱ్ఱన, హరివంశపీఠికఁబట్టి వేమారెడ్డి, మల్లారెడ్డిని గూర్చిన చారిత్రకవిశేషములు తెలియుచున్నవి. ఏకశిలానగర పతనాంతరము, తెలుఁగునాట వెల్లివిరిసిన పునర్వికాసప్రవర్తకులలో వేమారెడ్డి యొకడు.

తనకు నద్దంకి తగు రాజధానిగాఁ బ
రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజతనుజబాంధవమిత్రజనుల కిచ్చె
నెదురె యెవ్వారు వేమభూవిభున కెందు.

అగ్రహారములు విద్యాతపోవృద్ధవి
ప్రుల కిచ్చి యజ్ఞకర్తయుగ నుతికెఁ
గోపురాలఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి
లోక సంభావ్యంబులుగ నొనర్చె

నిధులు నల్లిండ్లును నిలిపెఁ దోటలు సత్ర
 ములు చలి పందిళ్ల వెలయఁ బెట్టె
హేమాద్రిపరికీర్తితామితవ్రతదాన
 నివహంబు లన్నియు నిర్వహించెఁ

జేసెఁ జేయుచున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతిశుభావళుల నెల్ల
ననఁగ శ్రీవేమవిభున కయ్యలరు పేర్మి
వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు.

తురుష్కాక్రాంతమై "అరాజకమై" అష్టకష్టములకు గురియైన తెలుఁగు దేశమును బంధమోక్షము గావించిన మహావీరుఁడు పెదకోమటి వేమారెడ్డి. అతఁడు మహాదాత. హేమాద్రి రచించిన చతుర్వర్గచింతామణి ననుసరించి, ధర్మార్థకామమోక్షములకు సామరస్యము ఘటించి జీవితము నొక లలితకళగాతీర్చి దిద్దుకొనిన ఆదర్శప్రభువు.

ఇట్టి ఆదర్శప్రేరితజీవితమును గడిపి భారతీయులు లోకోత్తరపురుషులై ధర్మవీరులై వీరధర్మము, ధర్మరాజ్యము పునః ప్రతిష్ఠితము సలుపవలెనని దక్షిణాపథమున విద్యారణ్యమహర్షి యోగిగా సల్పిన కృషి ఎఱ్ఱాప్రెగ్గడ, మహాకవిగా సల్పెను. విద్యారణ్యమహర్షి వేదశంఖనినాదమునకు హరిహర బుక్కరాయలు, ఎఱ్ఱాప్రెగ్గడ పంచమవేద కవితాగానమునకు, వేమారెడ్డి, మల్లారెడ్డి కత్తితో భాష్యము సల్పి జీవదుదాహరణలై నిల్చినారు. ఉత్తరాపథమున తుఘ్లకు పరిపాలనలో రాజధాని ఢిల్లీనుండి దేవగిరికి, దేవగిరినుండి ఢిల్లీకి మారి పరిపాలనక్రమ మవ్యవస్థిత

ముగా నున్న సమయమున దక్షిణాపథమున జాతీయసంస్కృతి పునర్వికాసమునకు మహాసామ్రాజ్యనిర్మాణమునకు స్థిరమైన పునాదులు వేయఁబడినవి. సనాతనభారతీయసంస్కృతి ఆనాడే దక్షిణాపథమునకు వలసవచ్చి సుమారు రెండు శతాబ్దులు స్థిరనివాస మేర్పరచుకొని విద్యానగరసామ్రాజ్యమున పరాకాష్ఠ నొందినది. కాలక్రమమున రెడ్డిరాజ్యము విద్యానగరసామ్రాజ్యములో గలసిపోయినను భారతీయసాంస్కృతికసామ్రాజ్యమునకు పునాదులు వేసి ఉత్తమసారస్వతసంప్రదాయము నెలకొల్పిన ప్రతిష్ఠ మున్ముందు రెడ్డిరాజ్యమునకు దక్కవలెను.

ఎఱ్ఱాప్రెగ్గడవలె హరివంశము నితివృత్తముగా స్వీకరించి రచించినకవి నాచనసోముఁడు. అతఁడు బుక్కరాయలవలన, కడపజిల్లాలోని పెన్నాతీరమందలి పెంచుకలదిన్న నగ్రహారముగాఁ బడసెను. నాచనసోముని ఉత్తరహరివంశపీఠికలోఁ గవి కాలమును చర్చించి యీ శాసనకాలము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు శా. శ. ౧౨౬౬ క్రీ॥ శ॥ 1344 సంవత్సరమని నిర్ణయించిరి.

నాచన సోముఁ డప్పటికే అష్టభాషావిద్య శ్రీవిరాజితుఁడు. శ్రీమన్నాచనసోమాఖ్యమహాకవి. అందుచే నతఁడంతకుముందే ఉత్తరహరివంశమును వ్రాసినట్లెంచిన, నించుమించుగా నెఱ్ఱన, నాచనసోము లేకకాలముననే హరివంశము వ్రాసి రని చెప్పవచ్చును. ఎఱ్ఱన హరివంశము సంపూర్తిగ యథామూలముగ రచించెను. నాచనసోముని ఉత్తరహరివంశము మాత్రమే నేడుపలభ్యమానము.

ఎఱ్ఱన భారతము వ్రాసి కవియశస్సు సంపాదించి కవిత్రయమునఁ జేరెను. అతఁడు నన్నయభట్టుమహాకవీంద్రు సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ బొందెనని చెప్పుకొనెను. కావున, నాచన సోముఁడు తాను "సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథుఁడ" నని గద్యలో వ్రాసికొనెను.

అప్పటికి ప్రసిద్ధపూర్వకవులు నన్నయ, తిక్కనలు. నన్నయ, సరససారస్వతాంశప్రశస్తి ఎఱ్ఱనకు దక్కిన, నాచనసోముఁడు, తిక్కన కవితాశిల్పసంపూర్ణకీర్తి తనకుఁ దక్కవలెనని తలపోసెను. అందుచే ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతకథానంతరమున" నని తన హరివంశము నారంభించెను. తిక్కనసోమయాజివలెనే తనకావ్యముహరిహరనాథునకే యంకితమిచ్చెను. కమ్మని తేటతెనుఁగు నుడికారము లేరికూర్చుకొనుటలో సంభాషణచాతురిలో పాత్రల చిత్తవృత్తుల నిరూపించి యాంగికాభినయపూర్వకముగా వర్ణించుటలో నాచన సోముఁడు తిక్కన ననుసరించెను. అనువాద భారతపర్వాంశమగు హరివంశము వ్రాసి తిక్కనతోపాటు కవియశస్సు నార్జింపఁ దలపోసెను.

అలికంబున యక్షిని డాచిన సర్వజ్ఞుఁడని నాచన సోముఁడు ప్రస్తుతి నందెను. ఇతని కవిత్రయముతోపాటు కొందరు, తిక్కన తరువాత కొందరు గణించి మహాకవి పీఠము నర్పించుచున్నారు. కొందరు ఎఱ్ఱనకంటె నధికుఁడని, ఉత్తర హరివంశము ఎఱ్ఱన హరివంశముకంటె నుత్కృష్టకావ్యమని యభిప్రాయము వెలి

పుచ్చుచున్నారు. నాచనసోముఁడు గూడ, నెఱ్ఱనవలెనే యుగధర్మము ననుసరించి పంచవేదమైన భారతమునకుఁ బరాంశమైన హరివంశము ననుసరించి భారతీయసంస్కృతిని తెలుఁగునేల సుప్రతిష్ఠిత మొనర్ప మహోద్యమప్రవర్తకుఁ డయ్యెను. అతనికే బుక్కరాయల ఆదరాభిమానములు లభించినవి. తిక్కన పోకడలు పుటికి పుచ్చుకొని, సజీవపాత్రలు చిత్రింపఁ గలిగిన నాచనసోముఁడు కొందఱి రసజ్ఞహృదయములలో నేకచ్ఛత్రాధిపత్యము వహించుట వింతగాదు.

ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి హృదయమున నన్నయ, తిక్కనల కవితారీతులు గంగాయమునలవలె సంగమించుటయే గాక స్వతంత్రవర్ణనాత్మకశయ్యారీతిగూడ కలిసి పవిత్రసాహిత్యప్రయాగ యేర్పడినది. ఆంధ్రవాఙ్మయమున వాగర్థముల జోడుగుఱ్ఱపు పందెపుపరుగులో సూపుహగు లేకుండ కవితారథమును నడిపిన ప్రజ్ఞ కవిత్రయమునకే దక్కినది. ఎఱ్ఱన మహాకవి సమాధి, భావోద్రేకము నణచిపెట్టిన శాంతనిర్భరనిశ్చలచిత్తవృత్తి యాధ్యాత్మికోన్నతి శృంగారఘట్టములలోఁగూడ ప్రదర్శింపఁ గలిగిన 'నిర్వికారరసల్లాపమింపారు' సంయమ మతని నన్నయ తిక్కనలతోపాటు ఋషితుల్యునిఁ జేసి యాతని వాక్కు ఋగుజ్జ్వలము సల్పినది.

ఆంధ్రవాఙ్మయమున మహాభారతము రచించిన కవిత్రయము మహేతిహాసము వినిర్మించిన మహాకవులు మాత్రమేగాక సమకాలీనజగత్తులో మహోద్యమప్రవర్తకులై మహోదారజీవితము నెరపిన మహాపురుషులు. మును మార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత పుట్టించి ఆంధ్రవిషయమునఁ దెనుంగును నిలిపిన

చాళుక్యుల కాలములో నన్నయ తెనుగునకు రాజపూజ్యతతో పాటు సభాగౌరవము గల్పించిన మహానుభావుఁడు. తిక్కన మహాకవి ధర్మాద్వైతవేదాంతప్రవక్త. దక్షిణాపథమున కాకతీయ సామ్రాజ్యమునకు సహకారికుఁడై తెలుగు వీరులు భారతయోధు లవలె వీరము ధర్మము నుచ్ఛ్వాసనిశ్వాసములు చేసి క్రియాశూరులు గా వలె నని ఉద్బోధించిన మహానుభావుఁడు.

ఎఱ్ఱన మహాకవి కాలమున దక్షిణాపథమునఁ దాత్కాలికముగ ధర్మగ్లాని యేర్పడినది. పాండవుల యరణ్యవాసము దలపింపఁ జేయు దైన్యదుఃఖములు తెలుఁగునేల తాండవించినవి. ఎఱ్ఱన నన్నయ తిక్కన లందించిన పంచమవేదప్రబోధమును తిరిగి తెలుఁగు జాతికి వినిపించెను. సమకాలీనుఁడైన విద్యారణ్య మహర్షి ప్రభుసమ్మితముగ వినిపించిన యా ప్రబోధమునే యెఱ్ఱన కాంతాసమ్మితముగ వినిపించెను. అందుచే మహాకవి ప్రవక్తలైన కవిత్రయము ఆంధ్రవాఙ్మయమున ప్రాతఃస్మరణీయులైన త్రిమూర్తులై నిలిచిరి.

"ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁ గాఁ బడియె నెందును దానినె కాని సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగు పల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రా దని ద్రాక్షవాటి కవిరాక్షసుఁడీ నియమంబు చేసినన్

ఆ మూఁడు పర్వములలో
సామాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కన
భీమజి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్"

అని అప్పకవి ప్రవచనము. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల ప్రభావము సోకని తెలుఁగు కవియే యీ తెలుఁగునేల సహస్రసంవత్సరాల సాహిత్యజీవితములో లేడు. కవిత్రయము వారి పద్యములకు నీడలు క్రీనీడలు ననఁదగు పద్యము లర్వాచీనకావ్యములలో అసంఖ్యాకములు. కాని, వారి యొఱవడి యంతమాత్రమే గాదు. ఆంధ్రమహాభారతము తెలుఁగులో సాహిత్యవేదము. నన్నయభట్టు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
అధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతమ్ము

అని సంస్కృతభారతప్రశంస సల్పెను. ఈ ప్రశంస సంస్కృతభారతముకంటెను యథాక్షరముగఁ దెలుఁగు భారతమునకే యన్వయించుచున్నది.

---

శ్రీ బాబా బైండింగ్ అండ్ ప్రింటింగ్ వర్క్స్, అనంతపురం.

# ఈ రచయితవే.

1. తారాతోరణము
ఖండకావ్యసరపుటి — 1-8-0

2. ధర్మచక్రము
నాటకము — 2-0-0

3. ఛత్రపతి శివాజీ
నాటకము — 2-0-0

4. విక్రమోర్వశీయము
(ఆంధ్రీకృతి) — 1-0-0

5. శ్రీకృష్ణదేవరాయలు
నాటకము — 2-0-0

ప్రతులకు

విజ్ఞానప్రభాస

c/o ఉదయిని ప్రెస్, భీమవరము: పశ్చిమగోదావరి.

శ్రీ బాబా బైండింగ్ అండ్ ప్రింటింగ్ వర్క్సు, అనంతపురం.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA102B156 |
| పుస్తకం పేరు | కవిత్రయము |
| తారీఖు | 30 January 2025 |
| ముందు అట్ట | |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 197 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CI, 2, BCI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | SHUSHW |
| పేజీలు విడదీసినది | SHUSHW |
| స్కాన్ చేసినది | Monica |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |